# విశిష్ట
# శ్రీచక్రము

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు
తెలుసుకోండి... ఫేస్‌బుక్ మోహన్ పబ్లికేషన్స్
పేజ్ లైక్ చేయండి.




Like us to follow :
**MOHAN PUBLICATIONS**
Rajamahendravaram



This Book is published with the
Financial Assistance of
Tirumala Tirupati Devasthanam
Under their Scheme
Aid to Publish Religious Books

తిరుమల తిరుపతి దేవస్థానమువారు రచయితల కొరకు ఆర్థిక సహాయ పథకము ప్రకారము ఈ గ్రంథమునకు సహాయమునందించిరి.

తిరుమల తిరుపతి దేవస్థాన కార్య నిర్వాహణాధికారికి, సప్తగిరి సంపాదకులు గారికి, తత్సంబంధిత ఇతర సభ్యులకు నా కృతజ్ఞతాంజలులు. బోర్డు సభ్యులు నేను చెప్పిన ''నాకు తెలిసిన శ్రీచక్రము'' పేరును ''విశిష్ట శ్రీచక్రము''గా మార్చినారు. ఆపేరు నాకు చాలా నచ్చినది. అందుకు వారికి నా కృతజ్ఞాభివందనలు.

బుధజన విధేయుడు,

నోరి హనుమచ్ఛాస్త్రి.

# ఆప్త వాక్యము

ఈ ఆప్త వాక్యము ముందు ఒక విషయాన్ని వివరించటం సమంజసంగా ఉంటుందని అనిపించింది నేను ఒకప్పుడు అశక్తురాలనయి, నిత్యము నేను ఇంట్లో పూజించు శ్రీచక్ర పటములను, సజల నయనములతో వారణాసిలో గంగాదేవి ఒడిలో ఉంచి వచ్చిన తరువాత ఒక విధమైన అస్థిరత్వముతోను, అశాంతితోను బాధపడుచుంటిని అప్పుడు చి॥ సౌ॥ అన్నపూర్ణ మొదలగు పదిమంది సువాసినులు నావద్దకు వచ్చి తాము 108 పూర్ణిమలు వరుసగా శ్రీచక్రార్చనలు చేయించాలని సంకల్పించామని, దానికి నన్ను అండగా నిలబడి జయప్రదము చేయించమని కోరిరి. నేను అప్పుడు గుంటూరులోని మా శ్రీ శృంగేరి శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శ్రీ నృసింహానంద భారతీస్వామి వారిని సంప్రదించగా వారి అనుగ్రహము నాపై ప్రసరింపచేసిరి. ఇక నేను ధైర్యముతో అంగీకరించితిని ఆ క్షణమే నాలో కొత్త ఉత్సాహము కలిగినది. 108 శ్రీచక్రార్చనలు గురుదేవుల అనుగ్రహము, పరదేవత కృపాకటాక్షముల వలనను జయప్రదముగా జరిగినవి. చివరకు శ్రీదేవిని కాశీలో గంగానది మీద వైభవంగా ఊరేగించినాము. ఈ కార్యక్రమమునకు ప్రస్తుత పీఠాధిపతులు శ్రీ శ్రీ జగద్గురు శ్రీ శివ కల్యాణానంద భారతీమహాస్వామివారి ఆధ్వర్యము వహించుట మాకందరికీ ఆనందము చేకూరినది.

ఇప్పుడు ''అప్పుడే 108 శ్రీచక్రార్చనలు అయిపోయినవే! '' అని అనిపించుచున్నది. ఆ ఆనందానుభూతి మాటిమాటికీ స్మరణకు వచ్చి నన్ను సమ్మోహితురాలిని చేయుచున్నది చిత్రముగా నాలోని అశాంతి మాయమైనది. ఆ స్థానములో భక్తి జ్ఞానములు ప్రబలి, ప్రాపంచిక విషయములపై వైరాగ్యోదయము కలుగుచున్నది. నా అహంలో శాంతితో కూడిన శక్తి ఆవిర్భవించినది.

''విశిష్ట శ్రీచక్రము'' అను పుస్తకము వ్రాసిన హనుమచ్ఛాస్త్రికి చిన్నతనం నుండి శ్రీ కల్యాణానంద భారతీమాంతాచార్య మహాస్వామి వారి వలన

శ్రీ విద్యోపాసకుడైనాడు మా శ్రీచక్రార్చనలకు వచ్చెడివాడు. ఇది ఒక విధముగా శ్రీ పరదేవత తన భక్తుని తన సన్నిధికి రప్పించుకొనటయే! కొన్ని అర్చనలు కూడా చేసినాడు వారిని మా సంస్థలు, శ్రీ శ్యామలా కృష్ణమండలి, నందగోకులం, దాని అనుబంధ సంస్థ చింతామణి ముక్తిధామములకు మా సభ్యుల అంగీకారముతో సలహాదారుడుగా పెట్టుకొన్నాము.

అతడు చెప్పుకొన్నట్లు, పండితుడు కాదు. సంస్కృత జ్ఞానముగాని, స్వేచ్ఛా ఉచ్ఛారణలు గాని పెద్దగా లేవు. అయినప్పటికీ మా 'కిట్టయ్య సహోదరి' శ్రీమాత వారిచేత ఈ పుస్తకము వ్రాయించినది. పలికినది, పలికించెడిదీ ఆమే! అతను పరికరము మాత్రమే. వారికి ఉన్నది అమ్మవారి మీద నిశ్చలమైన నిర్మలమైన భక్తి. ఆ పరమేశ్వరి వారిని ఎన్నో గడ్డు సమస్యల నుండి బయటపవేసినది.

మా మండలి వారు అకుంఠిత దీక్షతో చేసిన శ్రీచక్రార్చనలకు గుర్తుగా ఈ పుస్తకము వ్రాయించి ప్రసాదించినదని మా అందరి దృఢ విశ్వాసము. ఇది ఒక అద్భుతమే! ఒక సామాన్యుడు ఇటువంటి విషయమును గురించి చెప్పుట అసాధ్యము. కాని పరమేశ్వరి అసాధ్యసాధిని కదా!

ఈ పుస్తకము కొత్తగా శ్రీవిద్యను, శ్రీచక్రమును గురించి తెలుసుకొనువారికి పెద్ద బాలశిక్ష వంటిది. అందువలన ముందు ఈ పుస్తకము చదివితే పూర్ణోపాసనాపరుడగుట సులభము. అసలు శ్రీ విద్యోపాసనము కష్టమైనది, క్లిష్టమైనది. పూర్వజన్మ సంస్కారములున్న వారికే అది సాధ్యము. నేను స్వతంత్రముచే హనుమాన్లు అంటాను. అతడు ఈ పుస్తకము ముందుమాటలో ఇట్లా వ్రాశాడు.

"అదే - ఆ శ్రీచక్రమే - నాకు తెలిసిన శ్రీచక్రము" అనగా ఆ శ్రీచక్రము శ్రీశ్రీ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమాంతాచార్య మహాస్వామి వారు మా పితృదేవులు నరసింహశాస్త్రి గారికి పూర్ణదీక్ష నొసగి అనుగ్రహించిన శ్రీచక్రము. శ్రీచక్రములలో శ్రీవిద్యలో కూడా భేదములున్నవి. కాని నాటికీ, నేటికి, ఏనాటికీ శ్రీవిద్యారుణ్యుల నుండి అవిచ్ఛిన్న పరంపరగా శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్య

మహాస్వామి వారికి సంక్రమించిన, వారు సంస్కరించిన సంప్రదాయమే సరి అయినది. అదే తనకు తెలిసినదని భావము

ఒక పుస్తకాన్ని వ్రాయడమంటే ఒక సత్యాన్ని అన్వేషించటము ఇతని అన్వేషణలో తపన ఉన్నది తనకున్న పరిధిలో విస్తృతంగా శ్రమించి, పరిశోదించి, చెప్పే ప్రయత్నం జరిగింది. ఇందులోని విషయం మాన్యులకు కాని సామాన్యులకు అర్థమవటం కష్టం. దీనికి కారణం ఈ మధ్య ప్రబలుతున్న విభిన్న ఉపాసనా పద్ధతులు ఆచార భేదములు, ప్రచారమవుతున్న సిద్ధాంతములు. ప్రజలలో శ్రీవిద్యా అన్నా, దేవీ ఉపాసన అన్నా కొంత భీతి, బెరుకు ఉన్నవి. అటువంటి భయాన్ని పోగొట్టి శ్రీదేవి ఉపాసనము 'భద్రమైనదే' అని చెప్పే ప్రయత్నము జరిగినది.

ఈ వాక్యము ఉపసంహారములో చివరగా శ్రీదేవి బ్రహ్మాత్మైక్య స్వరూపిణి, సచ్చిదానంద రూపిణి, జ్ఞానజ్ఞేయరూపిణి అని స్త్రీ రూపముగా స్తుతించినప్పటికీ శ్రీదేవి. విశ్వశక్తి. అందువలననే శ్రీదేవి ఉపాసనము ప్రశస్తమైనది. ఈ ఉపాసన యొక్క ఫలం మోక్షమే. మహిషాసురుడిని, శుంభ నిశుంభలను, రక్తబీజుడిని, చండముండల వంటి దుష్టరాక్షస సంహారం చేసి మూడు లోకములను మంగళప్రదము చేసిన ఆ మహాశక్తి, ఏకాగ్రతతో పూజించి, స్మరించినంత మాత్రమున మన జన్మార్జిత పాపకర్మల నుండి విముక్తుల్ని చేయదా? తప్పక చేయగలదు.

తథాస్తు!

కం॥ పలికెడి పరాశక్తియె
పలికించెడి తల్లి ఆది పరమేశ్వరియే
పలికిని భవహర మగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా॥

వారణాసి మహాలక్ష్మమ్మ
శ్యామలా కృష్ణమండలి



భారతీ సాంప్రదాయ సార్వభౌమ

శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర

**జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ**

**మంత్రాచార్య మహాస్వామి వారు**



శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర

పరమహంస పరివ్రాజకాచార్యవర్య

**జగద్గురు శ్రీ శ్రీ సదాశివానంద భారతీ మహాస్వామి**



శ్రీ శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాదీశ్వర

**జగద్గురు శ్రీ శ్రీ నృసింహానంద భారతీ మహాస్వామి**



శ్రీ విద్యాశంకర పదమాశప్రకాశిత

శ్రీ శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాదీశ్వర

**జగద్గురు శ్రీ శ్రీ శివకల్యాణానంద భారతీ మహాస్వామి**

45వ పీఠాధిపతులు

"శ్రీ సదనము" 4 / 2 అరండేలుపేట గుంటూరు - 2

# విషయ సూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము

## అనుబంధములు

# విశిష్ట శ్రీచక్రము
## దేవతా ప్రార్థన

ఓం సర్వ చైతన్యరూపాం తా
మాద్యాం విద్యాంచ ధీమహి
బుధిః యానః ప్రచోదయాత్ ॥

1. ప్రణవరూపుడు లక్ష్మితో బరివృతుడయి
కేవలము మాయయై కామకీలితుండు
శంకరాత్మజు డఖిల వశంకరుండు
గణపతిని సంస్మరింతు సత్కావులకవిని.

2. శ్రీరూపంబును భారతీప్రథయు గౌరినామము దాల్చి, లో
కారాధ్యంబయి వెల్గుచున్, మునులకేకారతం దోచు బో
ధారామంబు, సమస్త భూతతతి చైతన్యాత్మ సత్త్వంబు వి
ద్యా రూఢంబగు నాద్యశక్తి మదిలో ధ్యానింతు నశ్రాంతమున్.

3. శ్రీదేవి యను నక్షరత్రయము మజ్జిహ్వాగ్ర వీథిన్ సదా
పాదన్యాసమొనర్చి ధింధిమి నట ద్వ్యాపారముల్ సల్పగా,
నీ దేహంబు త్రివిక్రమక్రమ విరాడిద్ధాత్మ విశ్వాయితం
బై దీపింపదే, నిండదే మనసు పూర్ణానంద దుగ్ధాబ్ధియై?

4. సుధా సింధు మధ్యే మణి ద్వీపరాజ
న్మహా శ్రీపురాంత స్థ్సితానంత చింతా
మణి మందిరే సుందరే మోదమానా
ఘనానంద మూర్తిః పరాంబా ఽవతాన్నః॥

5. షట్చక్ర మాలోపరి రాజితాయాః
షడంగ దేవీ పరిపూజితాయాః
షట్కూట మంత్రోత్తమ నాయికాయాః
పదాబ్జ సేవానిరతి ర్మమాస్తు

6. అ క చ ట త ప రూపాయాది హాంతాం చితాంగీ
ప్రకటిత మనుచక్ర స్యందనారూఢ మూర్తిః
సకల భువనమాతా సామమంత్ర ప్రగీతా
నివసతు లలితాంబా నిత్య మస్మన్మనోబ్జే.

7. నవక మన నవబ్రహ్మలు
నవదుర్గలును నవనిధులు నవరత్నంబుల్
నవరసములును నవావర
ణ వరమ్ములు సంఖ్యలు గ్రహ నవకంబు నగున్.

8. ప్రణవ చక్రమె శ్రీచక్రరాజ మవుట
బ్రణవరూప పరాపర బ్రహ్మమయము;
తత్పరమర్చనధ్యాన తత్పరత యెల్ల
బరమ పురుషార్థ సిద్ధి కుపాయము సుము.

9. సర్వ వేదమయము, సర్వ లోకమయమ్ము
సర్వ మంత్రమయము, సర్వమయము
చక్రరాజమవుట సతత తదర్చన
మఖిల దేవతార్చనాధికమ్ము.

ఆధారే భూపురత్రయమ్। తదుపరి వృత్తమ్ ।
స్వాధిష్ఠానే షోడశారమ్। మణిపూరేష్టదలమ్ ।
అనాహతే చతుర్దశారమ్। విశుద్ధౌ బహిర్దశారమ్ ।
ఆజ్ఞయా మంతర్దశారమ్। లలాటే అష్టారమ్ ।
సీమంతే త్రికోణమ్। బ్రహ్మరంధ్రే బిందుమ్ ॥

ఆబాలగోప విదితా సర్వాను ల్లంఖ్యశాసనా ।
శ్రీచక్రరాజ నిలయా శ్రీమత్త్రిపుర సుందరీ ॥
శ్రీశివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా ॥

సర్వమంగల మాంగల్యే శివే సర్వార్థ సాధికే ।
శరణ్యేత్ర్యంబకేదేవి నారాయణి నమోస్తుతే ॥

1,2,3 పద్యములు కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రి గారి శ్రీదేవీ భాగవతములోనివి.

4-9 పద్యములు శ్రీ విద్యాశంకర పదమావేశ ప్రకాశిత శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీ పీఠాధీశ్వర జగద్గురు శ్రీశ్రీ నృసింహానంద భారతీ స్వామివారి శ్రీలలితా రహస్యనామ స్తోత్ర ప్రబంధములోనివి.

# ముందుమాట

మా వంశంలో మూడు తరములనుండి శ్రీ విద్యోపాసన ఉన్నది. మా తాతగారు నోరి హనుమచ్ఛాస్త్రిగారు శ్రీ మహాపాదుకాంత దీక్షాపరులు. మా నాయనగారు నోరి నరసింహశాస్త్రి గారు పూర్ణదీక్షాపరులు. నేనుగూడ పూర్ణదీక్షా పరుడనే. ఈ తరములో మా అక్కగారు వారణాసి మహాలక్ష్మిగారు ఆమె భర్త వేంకట సుబ్బారావు గారు, మా తమ్ముడు నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి, వాని కుమారుడు కల్యాణ సుందరు పూర్ణదీక్షా పరులే కల్యాణసుందరు మా తరువాతి తరము అంటే నాల్గవ తరము. మా ఇంటిలో సుమారు అరవయి (60) సంవత్సరముల నుండి శ్రీచక్రము పూజింపబడుచున్నది. ఆ శ్రీ చక్రరాజమును జగద్గురు శ్రీశ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు మా నాయన గారికి అనుగ్రహించినది నేను రెండవఫారము చదువుచున్నప్పుడు (1943-44) శ్రీ జగద్గురుశ్రీ శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు నాకు మంత్రోపదేశము చేసి శ్రీవిద్యలో ప్రవేశపెట్టిరి. మా ఇంటిలో శ్రీచక్రార్చనలు జరుగుచుండేవి నేను మా అమ్మ, నాన్నగార్లతో గుంటూరు 4/2, అరండల్ పేటలోని శ్రీసదనములో శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారి ఆధ్వర్యములో జరిగే శ్రీదేవి నవరాత్రములకు చాలపర్యాయములు వెళ్ళాను నాకు 1954 సంవత్సర ప్రాంతములో శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు శ్రీషోడశాక్షరీ మంత్రమును కంకరగుట్ట శ్రీశంకర సదనములో ఉపదేశించారు శ్రీ వడ్లమూడి లక్ష్మీనారాయణ గారు జపవిధానమును వ్రాసి ఇచ్చారు. శ్రీవిద్యలో ఇట్లా ప్రవేశముండి శ్రీవిద్యా వాతావరణములో ఉంటున్నా శ్రీచక్రమును గూర్చి తెలుసుకోవాలని ఎప్పుడు అనిపించలేదు. మా నాన్నగారు వారి శ్రీచక్రమును నాకు 27-3-1977 (ఆంగిరసనామ సంవత్సర బహుళ సప్తమి)న ఇచ్చారు దానిని పూజిస్తూనే ఉన్నాను దానిని గూర్చి నాకు ఏమీ తెలియదు. మా నాయనగారు జీవించియున్నప్పుడు ఆయనను అడిగియున్నట్లైతే చాల సులభంగా అర్థమయేటట్లు చెప్పి ఉండేవారు కాని అట్లా జరుగలేదు. కొన్ని విషయములు కష్టపడే తెలుసుకోవాలి.

హైదరాబాదులో శ్రీ జగద్గురు శ్రీ నృసింహానంద భారతీస్వామి వారు నాకు 1989వ సంవత్సరములో మహాపాదుకను, దీక్షా నామమును అనుగ్రహించారు. వారు 1988 డిశంబరు 4 ఆదివారము నాడు మాతమ్ముడు నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి ఇంటిలో లలితారహస్యనామ స్తోత్రము మీద ఒక అద్భుత ఉపన్యాసమిచ్చారు. అప్పటినుండి నాకు సుమారు 40 సంవత్సరములుగా పారాయణ చేస్తున్న లలితారహస్యనామాలను గూర్చి తెవుసుకోవాలి అనే జిజ్ఞాస కలిగింది.

హైదరాబాదులో వారణాసి మహాలక్ష్మమ్మ గారు (బామ్మగారుగా ఆమె సర్కిలులో ప్రసిద్ధి). ''చింతామణి ముక్తిధామ్'' అనే ఒక సంఘమును శ్రీ శ్యామలా కృష్ణమండలి నందగోకులమునకు అనుబంధ సంస్థగా స్థాపించారు. దానికి భగవాన్ శ్రీకృష్ణ అధ్యక్షులు; కార్యదర్శి శ్రీ రాజమాతంగేశ్వరి. దానిలో పదకొండు (11) మంది సభ్యులున్నారు. వారు 108 పున్నములకు వరుసగా శ్రీ చక్రార్చనలు తమ ఖర్చుతో చేయించవలెనని నిర్ణయించు కొన్నారు. అష్టోత్తరశతశ్రీచక్రార్చనలలోని ప్రథమ అర్చన 9-2-1990 (శుక్లనామ సంవత్సర మాఘశుద్ధ పూర్ణిమ)న జరిగింది. ఈ కార్యక్రమ నిర్వహణ బాధ్యత బామ్మగారిమీద పెట్టారు. ఈ సంఘము నిర్వహించే శ్రీ చక్రార్చనలను గూర్చి నాకు తెలుసు. కాని నేను అర్చనలకు వెళ్ళలేదు. వారు అర్చన ఉన్నదని చెబుతారు కాని ప్రత్యేకముగా ఎవరికి ఆహ్వానము ఉండదు. మనము వెళితే గౌరవించి వారిలో కలుపుకుంటారు.

నేను 1991లో పదవీ విరమణ చేశాను. నాకు రావలసిన పెన్షను మొదలగునవి రాలేదు. నేను ఇంకా ఒక కుమార్తె వివాహము చేయవలసి యున్నది. మా మేనకోడలు చి॥ సౌ॥ చివుకుల అన్నపూర్ణ సలహామీద చింతామణి ముక్తిధామ్ వారి 40వ.శ్రీచక్రార్చనకు వెళ్ళాను. అప్పటినుండి వారి అన్ని కార్యక్రమములకు వెళ్ళుచునే ఉన్నాను. కొంతకాలానికి నాకు శ్రీ చక్రమంటే ఏమిటి? నవావరణలు ఏమి తెలుపును? మొదలగు సందేహములు వచ్చినవి. శ్రీచక్రార్చనకు వచ్చే కొందరు పెద్దవాళ్ళను అడుగుట ప్రారంభించాను. కాని ఎవరు నాకు చెప్పలేదు. ఒకసారి ఒకాయన సౌందర్యలహరి చదువమని చెప్పాడు. బామ్మగారు కామకలా విలాసము ఇచ్చి చదువనున్నారు. చి॥ కె. సుబ్రహ్మణ్యం శ్రీ గౌడపాదాచార్యుని సుభగోదయ స్తుతి చదువుమని చెప్పి ఆ పుస్తకము కొనిపించాడు.

ఈ లోపల పెద్దగా నా ప్రయత్నము లేకుండగనే మా మూడవ అమ్మాయి వివాహము కుదురడమే కాకుండ దానికి కావలసిన ధనముకూడ సమకూడింది వివాహము జయప్రదంగా జరిగింది. వెంటనే నా పెన్షను మొదలగునవి సెటిల్ అయి రావలసిన డబ్బు వచ్చింది. అప్పుడే నా తమ్ముడు చి॥ సుబ్రహ్మణ్యశాస్త్రి సహాయ సహకారములతో చింతామణి ముక్తిధామ్ వారి శ్రీచక్రార్చనలలో కొన్ని అర్చనలు చేయుటచే నా చిరకాల వాంఛితము నెరవేరినది. ఇదంతాకూడ శ్రీచక్రనిలయ లలితాంబికా కృపారసమని నాదృఢ విశ్వాసము. ఆమె నా యందు తన కృపాకటాక్షములను సారించిన సందర్భములనేకములు కలవు. వానిలో ఇది ఒకటి. అమ్మ చూపిన కరుణకు కృతజ్ఞతలు బహిరంగంగా తెల్పుకొనుటకు ఇది ఇక్కడ వ్రాశాను - సందర్భోచితము కాదేమో కూడా.

పైన పేర్కొన్న పుస్తకములే కాక, గూడార్థదీపిక, శ్రీచక్ర దర్శనము, శ్రీచక్ర విలసనము, శ్రీకలా, పూర్ణమీమాంస, బ్రహ్మవిద్యావైభవము, శ్రీవిద్యోదంతము, బ్రహ్మకలా, ట్రీటీజ్ ఆన్ శ్రీ చక్ర, ఇట్లా ఎన్నో పుస్తకములు చదివే భాగ్యము లభించినది శ్రీచక్రమును గూర్చి చదువుచున్నకొలది ఆ విషయము చాల లోతైనదని, ఎంత చెప్పిన, ఎంత చదివిన, ఎంత ఆలోచించిన తరగదని, ఇంకా తెలుసుకొనవలసినది ఎంతో ఉన్నదని నాకు అనిపించినది. కాని శ్రీచక్రమును గూర్చిన ప్రాథమిక అవగాహనకొరకు నేను పడ్డ శ్రమను—అంటే ఇప్పుడు నాకు తెలుసనికాదు—తోడివారితో పంచుకొంటే నాకు తృప్తి, వారికి గూడ లాభముండునని అనిపించి ''నాకు తెలిసిన శ్రీచక్రము'' అనే వ్యాసము వ్రాస్తున్నాను. జగద్గురు శ్రీనృసింహానంద భారతీస్వామి వారిని శ్రీచక్రమును గూర్చి అడిగినా చెప్పి ఉండేవారు. వారు నా దీక్షాగురువులే కాక వారి పూర్వాశ్రమమునుండి నాకు బాగా తెలిసినవారు. కాని ''అమ్మ'' ఎందుకో ఆపనిగూడ చేయించలేదు.

ఇక్కడ ఇంకొక విషయము చెప్పవలెను నేను పండితపుత్రుడనే కాని పండితుడను కాను. అందువలన ఈ వ్యాసములో ఎన్నో భాషావ్యాకరణ వైరుధ్యాలు ఉంటాయి. రచన అంతా భాష ఒకటిగా ఉండదు దానికి కారణము ఏ పుస్తకములో ఉపయోగపడే విషయము కనబడితే దానిని వ్రాసి యుంటిని. అంటే దీనిలో నా స్వంత వాక్యము ఒకటి కూడ లేదు అంటే అతిశయోక్తి కాదు. నేను చదివింది నాకు అర్థమైన రీతిలో

ఒక చోట చేర్చి పాఠకుల ముందు పెట్టాను. పండితులైన వారికి ఇది చెప్పుకోదగ్గ ప్రయత్నముగా అనిపించదు. నా బోటి కొద్దిమందికైన ఇది ఉపకరించిన నేను చేసిన సాహసము సార్థకత కలదియే యగును.

# II

శ్రీచక్రము శివశక్త్యాత్మకమైన స్వరూపము. అంతేకాక బ్రహ్మాండమునకు, శ్రీవిద్యా మంత్రములకు మాతృకకు (వర్ణమాల 'అ' నుండి 'క్ష' వరకుగల అక్షరములు) మానవ శరీరమునకు గూడ చిహ్నమే. స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర శ్రీచక్రములు మానవ శరీరములోనే కలవు.

బ్రహ్మానందము స్వరూపజ్ఞానము వలన కలుగును. స్వరూప జ్ఞానము విచారణవలన లభించును. ఆ విచారణ ఆత్మానాత్మలను గూర్చి, సత్యాసత్యములను గూర్చి, దీనికి చతుర్దశభువనాత్మక బ్రహ్మాండస్వరూప విచారణము అవసరము. ఇది మనకు దుర్లభము. చరాచరములగు పిండాండము (మానవ శరీరము) బ్రహ్మాండము (విశ్వము)లు సమానధర్మము గలవి. కనుక శారీరక విచారణ వలన నిజతత్త్వము తెలియును. శారీరక విచారణయు అంతరంగ వస్తు భేదములున్నందున, ప్రత్యక్షములు కానందున అంతరంగ విచారణమును దుర్లభమని పరమేశ్వరుడు శ్రీచక్రమును స్వస్వరూప జ్ఞానసాధనముగా సృష్టించెను. బ్రహ్మాండము, పిండాండము, శ్రీచక్రములు సమాన ధర్మముగలవి. ఇట్లు ప్రత్యక్షముగా గ్రహింపదగిన చక్రతత్త్వమును తెలుసుకొనినవారు స్వరూప జ్ఞానమును గలిగి జీవన్ముక్తలగుదురు.

శ్రీ చక్రము తొమ్మిది త్రిభుజముల కలయిక వలన ఏర్పడుటచే దానిని నవయోని చక్రమని కూడ అందురు. శ్రీచక్రములో తొమ్మిది ఆవరణలు ఉండుటచే నవావరణ చక్రమని అందురు. శ్రీచక్రము మహాత్రిపురసుందరి నివాసస్థానము.

## III

"విశిష్ట శ్రీచక్రము" ఏమిటి? శ్రీచక్రమును గూర్చి నేను విన్నదానిని బట్టి, చదివినది అర్థమైనదానిని బట్టి తెలుసుకొన్న శ్రీచక్రమే నాకు తెలిసిన శ్రీచక్రము. అంతేకాదు నాకు నిజముగా తెలిసిన శ్రీచక్రమొకటి ఉన్నది. అది జగద్గురుశ్రీ శ్రీకల్యాణానంద భారతీస్వామి వారు మా నాయనగారు నోరి నరసింహశాస్త్రి గారికి అనుగ్రహించినది. మా నాయనగారు మా అమ్మ హనుమాయమ్మగారు తమ జ్యేష్ఠపుత్రుడనే ఆపేక్ష, ఆప్యాయతలతో దానిని నాకు ఇచ్చారు. అదే—ఆ శ్రీచక్రమే—నాకు తెలిసిన శ్రీచక్రము.



# శ్రీచక్రము

## ప్రథమ భాగము

### ఉపాసనా మార్గము

ఓం సర్వచైతన్య రూపాంతా
మాద్యం విద్యాం చ ధీమహి
బుద్ధిం యానః ప్రచోదయాత్

సర్వచైతన్యరూపయు, మా బుద్ధులను ఆత్మ చింతనకై ప్రేరేపించు దేవియు, ఆద్యయు, మహావిద్యయునగు శ్రీదేవిని ధ్యానింతును.

శ్రీదేవి రూపపరిణామమే సకల చిదాచిదాత్మక, చరాచరాత్మక జగత్తు అగుటచే ఆమె సర్వరూప. సర్వభూతములయందలి చైతన్యము ఆ దేవియే. ఆమె సర్వమునకు ఆద్యయును, పరతత్త్వ సాక్షాత్కారమునకు సాధనమగు విద్యయు అయి ఉన్నది.

పవిత్ర శ్రుతి, స్మృతులచే చెప్పబడిన బ్రహ్మమునకు సమానార్థకము ఓమ్. ఓమ్ బ్రహ్మ విద్య. బ్రహ్మ విద్యకు శ్రీవిద్యా అనునది నామము. శ్రీచక్రము అనునది రూపము. సృష్టికి పూర్వము సత్ అనే మహా బిందువు ఉండెడిది. అదియే పరమేశ్వరతత్త్వము. ఆ బిందువు అనేకముగా అగుదునని సంకల్పించెను. ఆ సంకల్ప సహిత బిందువే మహాకారణ బిందువు. దాని క్షేత్రరూపమే శ్రీచక్రము; లలితాదేవికి నిలయము.

స్తంభాది బ్రహ్మపర్యంతము అన్నియు శక్తిని కలిగే యుండును. వీటి అన్నిటికి శక్తిదాయకమైన సృష్టి, స్థితి, సంహారములు విలాసమాత్రమున నెరపు వస్తువు మహాశక్తి యుక్తమై యుండవలెనని చెప్పకయే తెలియుచున్నది. ఇట్లు అన్ని పదార్థములందు గల శక్తుల సమష్టి మహాశక్తి పరమేశ్వరుని యందు మాత్రమే ఉండును. చంద్రునికి అతని

శక్తియగు వెన్నెలకు, అగ్నికి దాని దాహక శక్తికి భేదము లేనట్లుగనే పరమేశ్వరునకు (కామేశ్వరునకు) సర్వక్రియా శక్తియగు పరమేశ్వరికిని (కామేశ్వరికిని) కించిత్ భేదము లేదు. పరమేశ్వరుడు నిర్గుణుడు. కనుక ఈ జగన్నాటకమునకు అంతకు ఆ శక్తియే కారణభూతురాలు. నామరూప రహితుడై నివృత్తి స్థితి యందున్నప్పుడు పరమేశ్వరుడు అనబడెడు వాడే పంచకృత్య పరాయణుడై ప్రవృత్తి స్థితి యందుడునపుడు పరమేశ్వరి అనబడును. నిర్గుణ తత్త్వము కేవలము మోక్ష ప్రదమగును. భోగ మోక్షములు కోరుకొను భక్తులకు శక్తియుత బ్రహ్మమే సకల కోరికలను తీర్చు కామేశ్వరీ కామేశ్వర రూపమున సమారాధ్య అగును. కర్మమార్గమునకును, జ్ఞాన మార్గమునకును మధ్యమార్గము ఉపాసనా మార్గము. ఉపాసనా విద్యలందు శ్రీవిద్య ఉత్తమోత్తమముగను, బ్రహ్మ జ్ఞానదాయకముగను ఉన్నది.

---

# శ్రీదేవి ఔన్నత్యము

భక్త్యా న తస్మై విదధాతు శుభాని సాన: - మార్కండేయుడు -

కేవలము పూజాజపాదులు లేకున్నను భక్తితో నమస్కరించినంత మాత్రముననే శ్రీదేవి మనకు సర్వశుభములనిచ్చును. శ్రీదేవిని ప్రణుతి చేయుటకుగాని ప్రస్తుతి చేయుటకు గాని—అనేక జన్మార్జిత సుకృతిరాశి కలవారే అధికారులు, అన్యులు కారు.

ఇతర దేవతలందరు శ్రీదేవిని ఉపాసించుట వలననే తమ తమ భక్తులకు భుక్తి ముక్తులను ఈయగల సామర్థ్యముకల వారగుచున్నారు. అందువలన శ్రీదేవియే సర్వత్ర ఫలధాత్రి అగుచున్నది.

తనీయాంసం పాంసుంతవ చరణ పంకేరుహ భవం
విరించి: సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్ ।
వహత్యేనంశౌరి: కథమపి సహస్రేణ శిరసాం
హర: సంక్షుద్యైనం భజతి భస్మోద్ధూళన విధిమ్ ॥ - సౌందర్యలహరి -

శ్రీదేవియొక్క పాదధూళిలోని అణుమాత్రమే బ్రహ్మ విష్ణు శివులకు సృష్టి స్థితి లయశక్తులను అనుగ్రహించుచున్నది. మహామాయా గుణములైన రజస్సత్వ తమోగుణములైన త్రిగుణములే త్రిమూర్తుల పనులకు ఆధారములు.

శ్రీదేవి పాదకమల పరాగలేశము అవిద్యా అనే చీకటిని పోగొట్టును. శ్రీదేవి ధ్యాన యోగము వలన అమరోచిత నానాభోగములను అనుభవించి శివసాయుజ్యమును పొందుదురు. ''భవాని త్వం'' అను రెండు పదములు ఉచ్చరించునప్పటికి శ్రీదేవి సాయుజ్యమును ఇచ్చును.

శ్రీవిద్యోపాసనయు, లలితారహస్యనామ పారాయణయు అనేక జన్మార్జిత పుణ్యమున చరమ జన్మయందుగాని కలుగదని తెలియుచున్నది.

అప్యేకం నామయోవేత్తి ధాత్వర్థ నిగమాదిభిః
సోపి శ్రీలలితా లోకే కల్ప కోటీర్వస న్నరః ।

*- దేవీ పురాణే -*

ప్రపంచమున ప్రజలు మంద బుద్ధులు, అల్పాయుష్కులు, క్షుద్ర భోగలాలసులుగా నున్నందున పరమేశ్వరి ప్రపంచ శ్రేయస్సును కోరినదై తన అంగదేవతలగు వశిన్యాది వాగ్దేవతలను చూచి ప్రపంచమందలి త్వ భక్తులు దేనిని పఠించుటచే తనకు సంపూర్ణ సంతోషము కలుగునో అట్టి రహస్యనామస్తోత్రమును తయారు చేయుడని ఆజ్ఞాపించెను. వారు శ్రీదేవి ఆజ్ఞానుసారము సర్వవిజ్ఞాన గర్భితముగను, బ్రహ్మజ్ఞాన దాయకముగను, అనేక రహస్యార్థములతో కూడి సమధిక భక్తిభావ ప్రదాయకమగు రహస్యనామ స్తోత్రమును తయారు చేసిరి.

శ్రీచక్రము సృష్టి స్థితి లయములకు ఆధారభూతమైన శ్రీమాతృకా స్వరూపమే కాక సచ్చిదానంద చిత్స్వ రూపమును తెలియజెప్పు బ్రహ్మజ్ఞాన వ్యాప్తికి మూలము అంతేకాక వేదమంత్రముల యొక్క శబ్దార్థములందు నిగూఢముగా దాగియున్న భావములు— నిగమార్థములు, ఆగమర్థాములు, రహస్యార్థములు, సకేంతార్థములు, రూఢి యోగికార్థము

లన్నియు—సమస్తము శ్రీచక్రమునందు ఇమిడి యున్నవని ప్రమాణగ్రంథములు తెలియ జేయు చున్నవి.

శ్రీచక్రమునందు లేనిది, దానివలన సిద్ధింపనిది ఈ సృష్టియందు ఏమియు లేదు. శ్రీచక్రమును దర్శించినంత మాత్రముననే సర్వపాపములు అగ్నిని తాకిన దూదివలె భస్మమగును. పూజించిన వారికి సకలాభీష్ట సిద్ధి, ఇహపర సౌఖ్యములు లభించగలవని శాస్త్రములు తెల్పుచున్నవి.

జగజ్జనని త్రిపురసుందరి శ్రీచక్రము నందధివసించియుండును (శ్రీ చక్రరాజ నిలయా శ్రీమత్త్రిపుర సుందరీ). శ్రీచక్రపూజయే శ్రీమత్త్రిపురాసుందరి పూజ. శ్రీదేవి నర్చించుటకు, ఆమాత సన్నిధి చేరుటకు, ఆ జగన్మాత కృప నందుటకు శ్రీచక్రపూజను మించినది మరొకటిలేదు. అనేక పూర్వజన్మల పుణ్యవిశేషము వలన మానవజన్మ కలుగును దానిని ప్రతివారు సార్థకపరచుకొనవలెను. ఇహమువల్లగాని, పరము (స్వర్గ భోగముల) వల్లగాని మానవజన్మకు పరిపూర్ణ సార్థకత చేకూరదు. పరాపరమైన రహస్యమైన బ్రహ్మజ్ఞానము— తద్వారా ప్రాప్తించు పునరావృత్తి రహితమైన సచ్చిదానంద బ్రహ్మైక్యతచేగాని సంపూర్ణ సార్థకత కలుగదు. అట్టి స్థితికి తీసికొనిపోగల మహత్తర సాధనము శ్రీచక్రము.

మానవులందరు ఏపని చేసిన ఇష్టప్రాప్తిని అరిష్టనివృత్తిని కోరియే చేయుచుందురు ప్రతి జీవికి పూర్వజన్మానుకృతమైన సంచితప్రారబ్ధ ఆగామి కర్మఫలితమే వర్తమాన జన్మయందు సుఖదుఃఖ రూపముగా పరిణమించి కష్టసుఖములను కలిగించును. ఈ విధముగా అనుభవమునకు వచ్చు కష్టసుఖములు ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధిదైవికమని మూడు విధములు. వీనినే తాపత్రయములందురు. ఈ తాపత్రయములను బాపుకొనుటకు మనశాస్త్రములందు అనేక మార్గములు చెప్పబడినవి. అవి అన్నియు పునరావృత్తి కలిగినవగుట వలన శాశ్వత నివారణా రహితము లగుచున్నవి ఇక మానవునికి కలిగెడు సుఖదుఃఖములు గూడ దుఃఖభాజకములే అని తత్త్వవిధులు చెప్పుచున్నారు. సుఖదుఃఖములు వెంటాడునంత కాలము మానవులకు శాశ్వతానందమైన జీవన్ముక్తి లభించుట దుర్లభము. కావున ఉభయతారకమగు అనగా భక్తులు కోరకుండగనే ఈ

జన్మయందు సమస్త సౌఖ్యములను, సంతోష సౌభాగ్యములను ప్రసాదించి తుదియందు ముక్తిని కలిగించు శ్రీచక్రమును జగన్మాత రూపముగా పూజించుట యెల్లరి కర్తవ్యము.

శ్లో॥ చక్రే సాప్యతి మంబాంతు విధానేన ప్రపూజయేత్।
సుఖం యల్లభతే లోకే నవసే ట్చ్రీ పురాంతరే॥

శివుడు అభిషేక ప్రియుడు, సూర్యుడు నమస్కార ప్రియుడు, గణపతి నైవేద్య ప్రియుడు, అట్లే శ్రీచక్రవిలసితయైన అంబిక పూజాప్రియ అని త్రిపురామహాత్మ్యమునందు తెలుపబడినది. మాయను అధిగమించి సంసారజనిత దుఃఖశోకాదులకు జనన మరణ క్లేశములకు అతీతమైన శ్రీదేవీ సాయుజ్యమును ఇహసాధనోప లభ్యమలగు అనంతానంద భోగసంపదలను సులభముగా పొందవలెనన్న శ్రీవిద్యయగు శ్రీచక్రార్చనకన్న మించిన మరొక మార్గము లేదు.

## శ్రీచక్రావిర్భావము

పరమేశ్వరుడు జగత్తునందుగల ప్రాణుల కామ్యసిద్ధుల కొరకు చతుష్షష్టి (64) తంత్రములను సృజించెను ఆయాతంత్రములందు ఆసక్తులగు ప్రాణులను చూచి వినోదించుచుండగా కామేశ్వరీదేవి పరమేశ్వరుని ఈ విధంగా ప్రార్థించెను. ''ఓ స్వామీ! తమరు తంత్రములను సృజించినారు. ఆ తంత్రములందు ఒక్కొక్కదానియందు ఒక్కొక్క కామ్యసిద్ధి మాత్రము కలిగియున్నది. కాని ఆ తంత్రములందు చతుర్విధ పురుషార్థసిద్ధి ఏ ఒక్క తంత్రమువలన కలుగనేరదు అవి అన్యోన్యాపేక్ష కలిగియున్నవి కావున చతుర్విధ పురుషార్థములు ఒకే తంత్రమువలన కలుగునట్టి దానిని నిరపేక్ష గలదానిని నాకొరకు ఆనతిమ్మని వేడుచున్నాను.''

అంత పరమేశ్వరుడు శ్రీవిద్యా తంత్రమును శ్రీచక్రము అను యంత్రమును అనుగ్రహించెను. ఈ తంత్రమునకు స్వతంత్ర తంత్రమనియు శ్రీచక్రమునకు సిద్ధవజ్రము అనియు సంకేతములు. శ్రీలలితాత్రిపుర సుందరి విద్యకు సమాన విద్యయు, శ్రీచక్రమునకు

సమాన యంత్రమును లేవనియు, ఇది సమయమతమనియు నిర్దేశించిరి. ఈ విషయమునే శ్రీవిద్యాశంకరపాదులు తమ సౌందర్యలహరి యందు ఇట్లు చెప్పిరి:

శ్లో॥ చతుష్షష్ట్యా తంత్రైః సకలమతి సంధాయ భువనం
స్థితస్తత్తత్సిద్ధి ప్రసవ పరతంత్రైః పశుపతిః
పునస్త్వ న్నిర్బంధా దఖిల పురుషార్థైక ఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితల మవతీతరదిరదిదమ్

– సౌందర్య లహరి–31 –

తల్లీ భగవతీ! పశువులగు ప్రాణులను పాలించువాడైన శివుడు-ఇహలోకోపకారములైన పరకాయ ప్రవేశము, ఆకాశగమనము, తిరోధానము, జలస్తంభన, అగ్నిస్తంభన, వాయుస్తంభన మొదలగు ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలను, వానివాని విద్యాస్వరూప సిద్ధాంతములను సాధకులకు వారివారి అభీష్టములను ప్రతిపాదించునట్టి మహామాయ, శాంబరము మొదలగు 64 తంత్రములను వెల్లడించి ప్రపంచము నంతటిని మోహపెట్టినవాడై తాను నిశ్చలుడై మిన్నకుండెను. ఆ తంత్రరాశినియెల్ల వినియున్నదానవు నీవు. వాని సారమును గ్రహించిన దానివై ఆచతుష్షష్టి తంత్రముల వలన పరమ పురుషార్థమైన మోక్షము లభించుటలేదని, వానియందు విసుగు కలిగి నిరాశపడి నీవు నీ భర్తను ఉత్తమ తంత్రమును అఖిలపురుషార్థ ఘటనా సామర్థ్యము కలదానిని వచింపుమని నిర్బంధించితివి. అందువలన పరమేశ్వరుడు అన్యాపేక్ష లేక సకల పురుషార్థములను కూర్చుటయందు ప్రధానమైన నీయొక్క తంత్రమును—శ్రీవిద్యాతంత్రమును—భూతలమున అవతరింపజేసెను.

## శ్రీచక్రావిర్భావమును గూర్చిన పౌరాణిక గాథలు

**1. రేణుకా పురాణమందలి గాథ :-**

ఇక్ష్వాకు వంశమున రేణురాజను పేరుగల రాజుగలడు. ఆయన శ్రీదేవీ భక్తుడు. ఆయన శ్రీదేవిని గూర్చి ఉగ్రమైన తపస్సు చేసెను. ఆయన తపస్సుకు శ్రీదేవిమెచ్చి హోమాగ్ని మధ్యమున దివ్యరూపములో సాక్షాత్కారము అనుగ్రహించినది. ఆమే శ్రీచక్రమధ్య

**2. బ్రహ్మాండ పురాణమందలి గాథ :-**

భండాసురుని జయించుటకై శ్రీదేవిని ఉద్దేశించి ఇంద్రుడు మహాయజ్ఞము చేసెను. ఈ యజ్ఞమున దేవతలు తమతమ శరీర మాంసములను కోసి హోమద్రవ్యముగా నొసగిరి. దేవతల త్యాగమునకు సంతోషించిన శ్రీదేవి కోటిసూర్య సమమైన తేజముతోను కోటి చంద్రశీతల మయూఖములతోను ఆ హోమాగ్ని మధ్యమున ప్రత్యక్షమయ్యెను. శ్రీదేవి జ్యోతిరూపమైన శ్రీచక్రమధ్యగతయై ప్రత్యక్షమైనది.

ఈ వృత్తాంతము ''చిదగ్నికుండ సంభూతా దేవకార్య సముద్యతా'' అనునది తెల్పుచున్నది. ఈ వృత్తాంతములోని యజ్ఞము గోదావరీ తీరమున రాజమహేంద్రమున గల కోటిలింగక్షేత్రమున జరిగినదనియు, అప్పుటనే శ్రీచక్రముతో శ్రీరాజరాజేశ్వరీదేవి ఆవిర్భవించుటచేత ఆప్రదేశము రాజరాజేశ్వరీ మందిరమై—రాజమహేంద్రవరముగా మారిపోయినదని స్థలపురాణము.

## కామేశ్వరీ కామేశ్వరులు

సకల జీవులు సర్వదా సుఖమును కోరుచున్నారు. కాని సుఖేతరమైన దుఃఖమును ఎవ్వరును కోరుట లేదు. అయినను సంసారములో సుఖము స్వల్పముగను, దుఃఖము అధికముగను కలుగుచున్నది. దీనిని బట్టి సుఖదుఃఖములను సంపాదించుటకుగాని, త్యజించుటకుగాని జనులకు స్వతంత్రము లేనట్లును, జనులందరు అవిద్యాపశువులైనట్లును తెలియుచున్నది. ఆ అవిద్యాస్వరూపమును, తన నిజస్వరూపమును విచారించుట అవసరము. దానివలన స్వస్వరూపము తెలిసి అవిద్య స్వయముగ తొలగును.

మనము కోరు సుఖమునకు ప్రతిబంధకము కలిగి, మనము అనుభవించుచున్న సుఖము అంతమగుటను దుఃఖమందురు. సుఖమనునది రెండు విధములు : (1) బ్రహ్మానందము (2) విషయ సుఖము. బ్రహ్మానందము స్వరూప జ్ఞానమువలన కలుగును; స్వరూప జ్ఞానము విచారణవలన లభించును. బ్రహ్మానందము అంతము లేనిది. దీనిని నిత్యసుఖమందురు. స్వరూపవేత్తలగు పుణ్యపురుషుల అనుభవములోనున్నది. దీనిని అనుభవించుటకు

బాహ్యాపరికరములు, ధనవ్యయము, దేహాయాసము మొదలగునవి ఏమియు అక్కరలేదు. ఇక విషయ సుఖమనునది సర్వప్రాణుల అనుభవములో ఉన్నది. ఇది బాహ్యాపరికరముల వలన లభించునది; ఇంద్రియములచే గ్రహింపబడునది; స్వల్పకాలమును, అంతమును గలది. విషయ సుఖము అనుభవమైన ఉత్తరక్షణమునందే దుఃఖప్రదమగును దీనికి ధనవ్యయము, దేహాయాసము, కాల విలంబనము ఆవశ్యకములు.

ఈ విషయ సుఖములు బ్రహ్మానంద సుఖము యొక్క వాసనలు గాను, ప్రతిబింబలుగాను ఉన్నవి. నిజ సుఖమును కోరువారు సుఖేచ్ఛ జనింపగానే స్వస్వరూప విచారణ చేయవలెను తన నిజరూపమును తెలిసికొనుటకు రెండు విధములగు సాధనములు గలవు (1) బాహ్యము—బ్రహ్మాండ స్వరూపము (ప్రపంచము). (2) ఆంతర్యము-తన శరీరమునందు గల పదార్థశోధన. బ్రహ్మాండ (ప్రపంచ) విచారణను స్థూలమనియు, ఆంతర్యమును సూక్ష్మమనియు అందురు. స్థూల సూక్ష్మములకు భేదములేదు కావున స్వస్వరూప జ్ఞానము వలన నిత్యసుఖప్రాప్తి కలుగును. ఆ స్వస్వరూప జ్ఞానము అంతర్ముఖునకు లభించును.

వేదారంభమునందు, సమాప్తియందు ''ఓమ్'' అనే ప్రణవోచ్చారణ విహితముగా నున్నది ప్రణవము వైఖరీ రూపముగాన ప్రకృతిరూపమయిన పరానాదమందులీనమగును.

పరావాగ్దేవతకు పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అని నాలుగు స్థానములు గలవు అన్ని పనులకు సహస్రారమందు స్ఫురణశక్తి కలుగును. తరువాత ఆపని యే ఇంద్రియ సంబంధమైనదో ఆ యింద్రియము ప్రేరేపింపబడి ఆపని జరుగును. అట్లే ఒకే శబ్దము ఉచ్చరింపదలచినపుడు మొదట సహస్రారమందు ఇచ్ఛ జనించును. అది పరవాక్కు స్థానము. శబ్దోచ్చారణ యిచ్ఛజనించిన వెంటనే అది పరానాడి ద్వారా మూలాదారమును చేరును. అది పశ్యంతీస్థానము. పశ్యంతీరూపములో నున్న శబ్దము పరానాడి ద్వారా అనాహతమును చేరును. అప్పుడు అది మధ్యమ అనబడును. అచ్చటినుండి అనాహతమును చేరినపుడు వైఖరి అందురు. వైఖరియందు స్పష్టాక్షరములు కలిగి శబ్దము ఉచ్చరింపబడును. ఈ నాలుగు స్థానములలో [(1) సహస్రారగతమయిన పరాస్థానము (2) మూలాధారగతమయిన పశ్యంతీస్థానము (3) అనాహతగతమయిన మధ్యమస్థానము

(4) విశుద్ధకమలము వైఖరీస్థానము.] మొదటి మూడు స్థానములు తేజోమయములు. అందువలన వాటిని మనుష్యులు తెలిసికొనలేరు. నాల్గవదియగు వైఖరీ మాత్రము సకలజనులకు తెలియును.

ఈ వాక్కుస్థానములను గురించి వివిధ పుస్తకములలో అభిప్రాయ భేదములు కనబడుచున్నవి. శ్రీజగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు లలితారహస్యనామ స్తోత్ర వ్యాఖ్యానగ్రంథమైన శ్రీకలలో 81వ శ్లోకమునకు ఈ విధంగా వ్రాశారు.

శ్లో॥ పరా ప్రత్యక్చితీరూపా పశ్యంతీ పర దేవతా।

మధ్యమా వైఖరీరూపా భక్త మానసహంసికా॥

వాక్కుయొక్క నిర్వికారమగు నవ్యాకృత స్వరూపమునకు పరా అని సంకేతము. ఇది కారణ రూపము. స్వస్వరూపము యొక్క చైతన్యమే పరావాక్కు. హృదయకమలము ప్రవేశించిన ఈక్షతిరూపమగు పరావాక్కు యొక్క సూక్ష్మ రూపము పశ్యంతి అనబడును. ఈ పశ్యంతి వాక్కునకే పరదేవత యని సంకేతము. హృదయగతమగు పశ్యంతీవాక్కు కంఠము మొదలగు స్థానములగుండా వ్యాపించినపుడు పొందిన స్థూలరూపమునకు మధ్యమా అనిపేరు. ఈ మధ్యమా రూపమగు వాక్కునకే వైఖరీ రూపమని అర్థము. వైఖరీయనగా వివిధములగు వర్ణములు, పదములు, వాక్యములు మొదలగు స్వరూప విశేషమని అర్థము. ఇందు మధ్యమ యనగా ఉచ్చరించువాని చెవులకు మాత్రమే వినబడునట్టి యుపాంశు రూపము. శ్రోతలకుగూడ వినబడునట్టి ఉచ్చైరూపము వైఖరీరూపము. మధ్యమా వైఖరులకు ధ్వని భేదముచే భేదమేకాని వాస్తవమునకు కొంచెముగూడ భేదము లేదు.

మాతృకా వివేచనమందు పరావాక్స్థానము మూలాధారమని యున్నది. ఇది కౌళమతపరము. పరావాక్స్థానము సహస్రారము. ఇది సమయ మతము. జగద్గురు శ్రీశ్రీకల్యాణానంద భారతీస్వామి వారి మాటే ప్రమాణము.

ఇంతవరకు వాక్స్థానములను గూర్చి కొంత చర్చించడము జరిగినది. ఇక పరమాత్మను గూర్చి కొంత తెలుసుకొందాము.

ప్రకృతికంటె పైనున్న తత్త్వము పురుషుడు. అతడు మహేశుడు. మహాన్ = అపరిచ్ఛేదుడు; ఈశః = సర్వనియంతృత్వాది ధర్మము గలవాడు అని మహేశ శబ్దానికి అర్థము.

సర్వజ్ఞత్వశక్తి, అనాదిబోధ, స్వతంత్రము, నిత్యత్వము, సంపూర్ణశక్తి, అనంతత్త్వము ఈ ఆరును మహేశ్వరునికి అవయవములు. అందువలన పరమాత్మయని గ్రహించవచ్చును.

బ్రహ్మము అవాఙ్మానస గోచరము. అంటే బ్రహ్మము ఇట్టిదని వాక్కుచే చెప్పుటకును, మనస్సుచే గ్రహించుటకును శక్యము కానిది. అట్టి వస్తువును వివరించుటకు జీవినిగాని, ఈశ్వరునిగాని, జగత్తునుగాని పురస్కరించుకొని శ్రుతి బోధించుచున్నది కావున ఈశ్వర నిర్దేశము స్వరూపజ్ఞాన సాధనగా నున్నది

స్వరూపజ్ఞాన బోధకు ముందుగా అవాఙ్మనస గోచరమయిన బ్రహ్మమును నిర్దేశించుటకు కారణమేమనిన

శ్రు॥ అనంతశాస్త్రం బహువేది తవ్య
మల్పశ్చ కాలో బహువశ్చ విఘ్నాః।
హంసో యథాక్షీర మివాంబు మధ్యా
ద్యత్సార భూతం తదుపాసితవ్యమ్॥

చతుర్దశ భువనాత్మకమయిన బ్రహ్మాండమందు ఏ వస్తువు సారభూతముగా నున్నదో, అది ఉపాసించ దగినదని పైవచనము వలన తెలియుచున్నది.

ఈ ప్రపంచమందలి అన్ని వస్తువులు, అన్ని జీవులు సత్యము, అసత్యముల మేళనముగా నున్నవి. అందు అసత్యమనునది నామరూపములు గలది; సత్యము ఆ నామరూపములకు చైతన్యమును, వృద్ధిక్షయములను గలుగచేయునది. ఈ రెండును కలిసి జగత్తుగా నున్నది ఈ రెండింటిలో సత్యభాగము సారమనిపించుకొనును. తిలలో తైలము సత్యము; అదే సారము. రెండవది పిప్పము, అదియే అసత్యభాగము. మనుష్యుని యందు జీవుడు సత్యము; దేహము అసత్యభాగము. ఈ రెండును కలిసియున్నప్పుడు ప్రవృత్తి కలుగుచున్నది. కావున

ప్రపంచమునందు సత్యవస్తువు సారభూతముగా నున్నది. సారమనగా రసము. అదియే బ్రహ్మపదార్థము. కావున ఆ రసరూపమున ఆత్మను పొందినవారు, తెలిసికొన్నవారు బ్రహ్మానందమును పొందుచున్నారు. ఆనందము సుఖస్వరూపము. కావున ఆత్మ వస్తువు మహేశః అగును. దీనినే మాయ యందురు. చైతన్యము సత్యభాగము.

మహేశుడు బ్రహ్మాండముయొక్క సృష్టిస్థితి సంహారములను అనాయాసముగా కల్పించు క్రీడయందు ఆసక్తి కలవాడు. త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, రుద్రులు సృష్టిస్థితి సంహారకర్తలు కావున వారికిని వారి పనులకు ఈతడే నియామకుడు. దీనివలన ఆపరమాత్మకు ఫలమేమియు లేదనియు సృష్ట్యాది నున్న వస్తువనియు తెలియుచున్నది.

## సృష్టిని గురించి శ్రుతివలన తెలియు విషయములు

ఈ సృష్టి స్వయంప్రకాశ స్వరూపుడగు ఆ పరమేశ్వరుని యొక్క నైసర్గికమగు మాయచేత జరుగుచున్నది. అందువలన సృష్టి మాయా మయమైనది. స్వప్నమాయా సదృశమును, నిష్ప్రయోజనమును అయిన ఈ సృష్టియందు ముముక్షువులు అనాదరణులుగా నుందురు.

సృష్టికి పూర్వము బ్రహ్మపదార్థము మాత్రము ఉన్నట్లు శ్రుతివలన తెలియుచున్నది. బ్రహ్మపదార్థమే జగత్సృష్టత్వ కారణమని శ్రుతి తెలుపుచున్నది.

### పైదానికి ప్రమాణము :

శ్రు॥ ఆత్మై వేదమగ్ర ఆసీత్ సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్।
నాసదాసీన్నో సదాసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ॥

### సృష్టికి బ్రహ్మపదార్థమే కారణమనుటకు ప్రమాణము :

శ్రు॥ మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం।
అస్య అవయవ భూతేస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥
తస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్।

(శ్వేతాశ్వతరోపనిషత్। - 4-10, 4-9)

2. యథాసుదీప్తాత్పావకా ద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభావంతే స్వరూపాః।
తథాఽక్షరా ద్వివిధాస్సోమ్య భావాః ప్రజాయంతే తత్ర చైవాపియంతి॥
(ముండకోపనిషత్ ద్వి ము 1-1)

3. సతపోఽతప్యత సతపస్తప్త్వా ఇదగ్ం సర్వమసృజత
- తైత్తిరీయే -

శ్లో॥ సకల భువనోదయ స్థితిలయమయ లీలావినోదనోద్యుక్తః।
అంతర్లీన విమర్శః పాతుమహేశః ప్రకాశమాత్ర తనుః॥

సకల ప్రపంచము తనయందు ఇమిడియుండి, స్వాంతర్గత విమర్శన శక్తి కలిగి ప్రకాశ మాత్రమే శరీరముగా గలవాడు కామేశ్వరుడు. ప్రకాశ విమర్శ శబ్దములు రెండును శివశక్తి పర్యాయములు "ప్రకాశమాత్ర తనుః" అని చెప్పినందున సృష్ట్యాదిని వేరొక వస్తువు లేనందున, నామరూపములు లేనందున ఇదియే ప్రకాశబిందువని నిర్ణయించినారు. ఈ ప్రకాశత స్వసిద్ధము జ్ఞానము ప్రకాశరూపము కావున ఇదియే సంవిద్బిందువు. నామరూపములు రెండును ఏకవస్తు ధర్మములు. ఈ రెండింటికి ఆశ్రయము ఒకటిగా నున్నది ఈ ప్రకాశబిందువు నందే విమర్శశక్తి అంతర్భూతముగా నున్నది

ఈ బిందువు శ్రీవిద్యా మాతృకా శ్రీచక్రాదులకు కారణబిందువుగా నున్నది. ఈ ప్రకాశబిందువు అనుసంధానమందు సాధకుల సహస్రారాంతర్గత పరావేశమందున్న చంద్ర మండలముగా నున్నది

స్వరూప జ్ఞానమునకు సాధకుని శరీరము నాలుగు భాగములుగానున్నది. అందు కటిప్రదేశము నుండి భ్రూమధ్య పర్యంతము మూడు భాగములు భ్రూమధ్యము నుండి బ్రహ్మరంధ్ర పర్యంతము ఒక భాగము. ఇది ఆరోహణమునందు తురీయ భాగము. దీనికి తురీయకూటమని సంకేతము ఇచట నున్న ప్రధానవస్తువు "ఆత్మ"! అదే బ్రహ్మకల— ధ్రువకలయని సకలాగను సిద్ధము, ప్రకాశబిందువునందు అంతర్లీనముగ విమర్శ శక్తి ఉన్నది ఈ విమర్శ శక్తియందు భావి జగత్తు ఇమిడి ఉన్నది

శ్లో॥ న శివేన వినా దేవీ దేవ్యా చ న వినా శివః।
నైతయోరంతరం నాస్తి చంద్ర చంద్రిక యోరివ॥

ఈ ఆగమ సిద్ధాంత వచనము వలన శివశక్తులకు అన్యోన్య భేదము లేదని తెలియుచున్నది ఇదే సదాశివతత్త్వము

పరాశక్తి లేక పరమేశ్వరునికి జగత్సృష్టి సామర్థ్యము ఎట్లు లేదో అటులనే పరాశక్తికిని పరమేశ్వరుడు లేక అట్టి సామర్థ్యము లేదని తెలియుచున్నది. ఈ విమర్శన శక్తి అహమాత్మకమైన శివస్వరూప జ్ఞానమునకు స్వచ్ఛమైన అద్దము (ఆదర్శము) వంటిది. ప్రకాశబిందువు బ్రహ్మస్వరూపము. అందువలన మాతృకలో ప్రథమ వర్ణమైన ''అ''కార స్వరూపమనియు, చంద్రమండలమనియు అందురు. ఇక విమర్శ బిందువు బ్రహ్మాత్మికమైన శక్తి స్వరూపమనియు, అగ్నిమండలమనియు అందురు. మాతృకలో అంత్యవర్ణమైన ''హ'' కారము అగ్ని బీజముగా నున్నది. శివశక్తి బీజములైన ప్రకాశ విమర్శలగు అ, హం, ఏకమైన ''అహం'' అనే శబ్దమేర్పడును. ఇదియే శివస్వరూపము. అయమహమనే జ్ఞానమునకు ఈ పరాశక్తి నిర్మలాదర్శము వంటిది. పరమేశ్వరుడు తన అంశ భూతమైన ఆత్మశక్తిని చూచి తాను సర్వపరిపూర్ణుడని తెలుసుకొను చున్నాడు. అద్దమునకు దగ్గర ఏ వస్తువును లేనపుడు స్వాంతర్గత ప్రతిబింబ ప్రకాశతకు సామర్థ్యము లేదు. అదేవిధంగా పరాశక్తికిని పరమేశ్వరుని సాన్నిధ్యము లేనపుడు తన యందు ఇమిడియున్న ప్రపంచోల్లసన సామర్థ్యము సంభవింపదు. అట్లే పరమేశ్వరునికి (కామేశ్వరునికి) పరాశక్తి (కామేశ్వరి) సంయోగము లేనిదే స్వరూపజ్ఞానము కలుగనేరదు. కావున కామేశ్వరీ కామేశ్వర ద్వంద్వము వలన సకల ప్రాణులు ఉత్పన్నమగుచున్నవి.

శ్రీచక్రోద్ధారములోనికి వెళ్ళుటకు ముందు శ్రీచక్రము యొక్క స్థూలరూపమును గూర్చి కొంత చెప్పుకొందాము.



# శ్రీచక్రము

తాంత్రిక పరిభాషలో శ్రీచక్రయంత్రము లలితాదేవికి నిలయము. ఇది ఆమె సామ్రాజ్యము. శ్రీచక్రములో తొమ్మిది ఆవరణలు ఉండును వాటిని నవావరణలు అంటారు. ఇవి పైనుండి క్రిందికి వరుసగా : 1) బిందువు, 2) త్రికోణము, 3) అష్టకోణచక్రము, 4) అంతర్దశారము, 5) బహిర్దశారము, 6) చతుర్దశారము, 7) అష్టదళపద్మము, 8) షోడశదళ పద్మము, 9) భూపురత్రయము. ఇది మూడు చతురస్రములు. నాలుగు దిక్కులందు ద్వారములతో ఉండును.

శ్రీచక్రమునందు శివకోణములు నాలుగు, శక్తికోణములు అయిదు గలవు. త్రికోణము, అష్టకోణము, దశకోణద్వయము, చతుర్దశకోణము—ఈ అయిదు శక్తిచక్రములు. బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురత్రయము—ఈ నాలుగు శివచక్రములు. నవయోని సహితమైన శ్రీచక్రమునందు శివశబ్దముచేత చతుర్యోన్యాత్మకమగు అర్థచక్రము సూచియబడు చున్నది. శక్తి శబ్దముచేత పంచయోన్యాత్మకమగు అర్థచక్రము సూచింపబడుచున్నది. శివశక్తి కలయిక వలన రెండు అర్థచక్రములు కూడి నవయోన్యాత్మకమగు శ్రీచక్రము రూపుకట్టు చున్నది ఈ చక్రము విశ్వోత్పత్తి స్థితిలయములకు స్వరూపము. శ్రీచక్రము శివాశివుల స్వరూపమై యున్నది.

శ్రీచక్రమునందున్న తొమ్మిది ఆవరణలకు, ఇతర భాగములకు సాంకేతిక నామములున్నవి. ప్రతి విభాగమునకు ప్రత్యేకమగు వర్ణము, అధిష్ఠానదేవత, బీజము, ప్రత్యేక పరివారము, ప్రకృతి, రసం, తత్త్వం ఉన్నవి. ఇవి అన్నీ రెండవ భాగములో చర్చించబడినవి.

దేవాలయములలో చేసే నవావరణ పూజలను, ముత్తుస్వామి దీక్షితులు వ్రాసిన నవావరణ కీర్తనలు పరిశీలిస్తే కొన్ని వివరాలు తెలియును.

ఇక ఇప్పుడు సౌందర్యలహరిలోని ఒక శ్లోకవివరణను పరిశీలించెదము.

శ్లో॥ చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పంచాభిరపి
ప్రభిన్నాభిః శంభోర్నవభిరపి మూలప్రకృతిభిః।
చతుశ్చత్వారింశద్వసుదళ కలాశ్రత్రివలయ
త్రిరేఖాభిః సార్ధం తవశరణ కోణాః పరిణతాః॥

- సౌందర్యలహరి -- 11

అమ్మా! నీకు నిలయమైన శ్రీచక్రములో శివకోణములు నాలుగును, శక్తికోణములు అయిదును కలవు. శ్రీచక్రమునకు మూలకారణమగు తొమ్మిది మూలప్రకృతుల చేతను, అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము, భూపురత్రయము చేతను నలుబదినాలుగు అంచులు కలది.

శ్రీచక్రమునకు మూలకారణమైన తొమ్మిది త్రికోణములును ప్రపంచ నిర్మాణ కారణములు. అందువలన వాటికి నవయోనులని పేరు వచ్చినది. అవియే పిండాండ నిర్మాణహేతువులైన తొమ్మిది ధాతువులు. అవి త్వక్ రక్తమాంసమేదో అస్థులు అయిదు శక్తి సంభూతములు; మజ్జా, శుక్ల, ప్రాణ, జీవములు శివసంజాతములు. అదే విధముగా పంచభూతములు, పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, మనస్సు శక్తి సంబంధమైనవి. మాయాశుద్ధ విద్య మహేశ్వర సదాశివములు శివసంబంధమైనవి. ఇట్లు ఇరువది అయిదు తత్త్వములు (పంచవింశతి తత్త్వములు) అన్నియు ఆ నవయోనులందు అంతర్భావమును పొంది బ్రహ్మాండ (ప్రపంచము) పిండాండ (మన శరీరము) నిర్మాణమునకు ఆధారములగుచున్నవి.

ఈ దేహము నవయోని సముద్భవమై నవధాతుమయమై యున్నది. పదియవయోని ఒక్కటే వానికి ఈశ్వరి. ఆమె పరాశక్తి. దశమయోని బైందవస్థానము. దానికి ఈశ్వరి పరాశక్తి.

చరాచరాత్మకమైన ఈసృష్టి శివశక్తుల స్వరూపము. చరమనగా పిండాండము (మన శరీరము). అచరమనగా బ్రహ్మాండము. అన్ని తత్త్వములకు అతీతమైన శివశక్తి సంపుటము—అదే శ్రీచక్రము.

శ్రీచక్రోద్ధారము మూడు విధములుగా నున్నది. 1) మేరు ప్రస్తారము, 2) కైలాస ప్రస్తారము, 3) భూప్రస్తారము. ఇక్కడ చెప్పిన ఈ ప్రస్తారములకు అనుబంధములో చెప్పిన ప్రస్తారములకు సంబంధము లేదు.

మేరు ప్రస్తారమునందు నిత్యాషోడశాతాదాత్మ్యము; కైలాస ప్రస్తారమునందు మాతృకా తాదాత్మ్యము; భూప్రస్తారమునందు వశిన్యాది తాదాత్మ్యము కలవు.

మాతృకాచక్రమైన శ్రీచక్రము సోమ, సూర్య, అగ్ని అను మూడు ఖండములుగా నున్నది. ఇదే పురత్రయము. శ్రీచక్రము మహా లక్ష్మీపురము. ఇందే సదాశివుడున్నాడు.

## శ్రీచక్రోద్ధారము

బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్ర నాగదళ షోడశపత్ర యుక్తం।
వృత్తత్రయం చ ధరణీ సదనత్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతా యాః॥

- త్రిపురతాపిన్యాం -

శ్రీచక్రములో తొమ్మిది ఆవరణల పేర్లు పైన చెప్పుకొన్నాము. ఇప్పుడు ఒక్కొక్క ఆవరణను గూర్చి రేఖామాత్రముగా తెలిసికొందాము.

**1. బిందు మండలము :** నవయోనులు, నవచక్రములను కలిగిన శ్రీక్రమును నిరూపింపదలచి—సృష్టి క్రమము అంటే బిందువునుండి వరుసగా భూపురత్రయము వరకు—అవరోహణక్రమములో నవయోని మధ్యగత బిందుమండలమును గూర్చి కొంత తెలిసికొందము.

శ్రీచక్రము మధ్యనున్న బిందువు యొక్క యదార్థము పరాస్వరూపము. ఈ బిందువు శ్రీచక్రమందున్న నవచక్రములకును—పశ్యంతీ, మధ్యము, వైఖరీరూపములుగల మాతృకకు కారణ స్వరూపముగా నున్నది. పశ్యంత్యాది మాతృకాత్రితయమే నవ చక్రాకారముగా

పరిణమించినది. ఈ బిందువు మాతృకక ప్రథమవస్తువు, అట్లే చక్రోత్పత్తికిని ప్రధమకారణముగా నున్నది.

సకల ప్రపంచమును నామరూపాత్మకముగా నున్నందున ఈ నామరూపులచే స్వరూప జ్ఞానము విస్మృతమైనది. తిరిగి ఆస్వరూపమును తెలిసికొనుటకు ఈనామరూపముల యదార్థము తెలిసికొనవలెను.

నామము శబ్దబ్రహ్మ స్వరూపము. ఆ శబ్దము మాతృకాస్వరూపము. ఆ మాతృక పరా, పశ్యంతీ, మధ్యమ, వైఖరీ అని నాలుగు రూపములు గలది. అందు ఈ బిందువు పరాస్వరూపము. ఇది పశ్యంతి, మధ్యమ, వైఖరీలకు ఆస్పదముగా నున్నది రూపమును నవచక్రాత్మకమగు శ్రీచక్రము తెల్పుచున్నది. నవచక్రములకు ఈ బిందువు కారణమగా నున్నది

ఈ నామరూపములు రెండును శబ్దార్థముల వలెనే ఒకే వస్తువు యొక్క సంకేతములుగా నున్నవి కావున ఈ బిందువు పరాస్వరూపము. ఈ పరాశబ్దముచే ఉత్కృష్ట మనియు అందును నామరూపాత్మక జగత్తుకన్న పరమనియు తెలియచున్నది

ఈ బిందువే పరమాత్మ స్వరూపము సచ్చిదానంద లక్షణములుగల బ్రహ్మతేజో బిందువు. ఈ బిందువును ఋతమని, సచ్చిదానందస్వరూపమని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. ఈ బిందువునకు నామరూపములు లేవు. వ్యవహారము కొరకు నిర్గుణ వస్తువును బోధించుటకు ఈ సంజ్ఞలు కలిగినవని శ్రుతి తెల్పుచున్నది. ఈ బిందువు తేజోమయముగానున్నది.

శబ్దబ్రహ్మస్వరూపమైన మాతృకోత్పత్తి క్రమములో ఈ బిందువు ప్రధమ వస్తువు ఈ బిందువు వికసనము వలన విసర్గలు (నాదము) ఏర్పడుచున్నవి ఆనాదమువలన కళలు అనగా స్వరవ్యంజనములు ఏర్పడుచున్నవి.

బ్రహ్మాండోత్పత్తి కాలము సంభవించినపుడు నిస్తరంగ సముద్రమువలె పూర్ణానంద స్వరూపముగా నున్న పరమాత్మయందు మాయాప్రవృత్తిచే ఘూర్ణాయమైన స్మరణశక్తి కలిగినందున, స్వాంతర్గత విమర్శశక్తి త్రికోణముగా పరిణమించినది.

ఈ బిందువు వికసనము వలన చంద్రసూర్య పరివేషముల భంగితేజోమయ మయిన త్రికోణ మండల మేర్పడుచున్నది. తరువాత క్రమముగా నవచ్రకము లేర్పడుచున్నవి. కావున ఈ మాతృకా చక్రములకు ఈ పరాస్వరూప బిందువు కారణముగా నున్నది. ఈ బిందువును సుధాసింధువనియు చంద్రమండలమనియు, మహాహ్రదమనియు అందురు.

ఇక్కడే కామేశ్వరుని వామోరుభాగమున కామేశ్వరి కూర్చున్నది. ఈ బిందువే సర్వమునకు ప్రకృతి. బింబభూత శుద్ధ బ్రహ్మస్వరూపము; మిగిలినవి శబలబ్రహ్మ స్వరూపములు.

తైత్తిరీయ శ్రుతియందు చెప్పబడిన మానుషానందాది బ్రహ్మానందపర్యంతమైన సర్వానందములు ఇందు కలవు. అందుకే దీనికి సర్వానందమయ చక్రమని పేరు

తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లి అష్టమోఽనువాకములో చెప్పిన ఆనందములు వాని సంబంధము ఈ విధంగా ఉన్నవి:

1. యువకుడును సాధువును, వేదాధ్యయ సంపన్నుడును, శాసింప సమర్థుడును, దృఢగాత్రుడును, బలిష్ఠుడును అగు చక్రవర్తియొక్క యానందము మానుషానంద మునకు ఆదర్శము. దీనిని ఒక మానుషానందమందురు.
2. 100 మానుషానందములు = ఒక మనుష్య గంధార్వానందము
3. 100 మనుష్య గంధర్వానందములు = ఒకదేవ గంధర్వానందము.
4. 100 దేవగంధ్వర్వానందములు = ఒక పితృదేవతానందము.
5. 100 పితృదేవతానందములు = ఒక ఆజానదేవతానందము.
6. 100 ఆజానాదేవతానందములు = ఒక కర్మదేవతానందము.
7. 100 కర్మదేవతానందములు = ఒక దేవానందము.
8. 100 దేవానందములు = ఒక ఇంద్రానందము.
9. 100 ఇంద్రానందములు = ఒక బృహస్పత్యానందము

10 100 బృహస్పత్యానందములు = ఒక ప్రజాపత్యానందము.

11. 100 ప్రజాపత్యానందములు = ఒక బ్రహ్మానందము

దీనినిబట్టి బ్రహ్మానందము మనుష్యానందమునకంటే ఎన్నియోరెట్లు అధికమని తెలియుచున్నది. అట్టి ఆనంద విశేషము కూడ పరబ్రహ్మానందము నందొక అణుమాత్ర మనియును, అకామహతుడును, అవ్రుజినుడునగు బ్రహ్మావేత్త అనుభవించుననియును, అందువలన పై ఆనందములలో ఏ ఆనందమున్నైనను బ్రహ్మావేత్తకు అవలీలగా చేకూరుననియు వేదమాత యుపదేశము.

శ్రీచక్ర మధ్య బిందువు పరాస్వరూపము. బిందు వికసనము, త్రిభుజాచక్రము పశ్యంతీ స్వరూపము. అష్టకోణచక్రము మధ్యమాస్వరూపము. మిగిలిన శ్రీచక్రభాగములు వైఖరీ స్వరూపములు.

వైఖరీరూప శక్తియే ''అ'' నుండి 'హ'' వరకుగల పంచాశద్వర్ణ మాతృకాశక్తి. మాతృక మండలత్రయముగా నున్నది:

1. ''అ'' నుండి ''అః'' వరకుగల 16 అచ్చులు చంద్రఖండము.
2. ''క'' నుండి ''భ'' వరకుగల 24 అక్షరములు సౌరఖండము.
3. ''మ'' నుండి ''క్ష'' వరకుగల 10 అక్షరములు అగ్నిఖండము.

శ్రీచక్రముగూడ మూడుఖండములుగా నున్నది.

1. బిందుత్రికోణ, వసుకోణాత్మకమైన చక్రత్రయము ఆగ్నేయఖండము అందురు. దీనినే సృష్టి చక్రమనియు అందురు.
2. దశారద్వయము మన్వస్రరూప చక్రత్రయమును సౌరఖండమందురు. దీనినే స్థితి చక్రమనియు అందురు.
3. అష్టదళ, షోడశదళ (పద్మద్వయము) భూపురత్రయ చక్రత్రయమును సోమ ఖండమందురు. దీనినే సంహార చక్రమనియు అందురు.

**2. యోనిచక్రము :** బిందువికసనము వలన తేజోమయ త్రికోణచక్రము ఏర్పడినది. ఈ కోణచక్రము పశ్యంతి, మధ్యమ, వైఖరీలనే శక్తిత్రయమునకు ఆవిర్భావకారణముగా నున్నది. కోణబిందువులు వాగ్భవ (ఐం) కామరాజ (క్లీం) శక్తిబీజ (సౌః) స్వరూపములు.

ఏ బిందుతత్త్వరూప పరాశక్తి తేజస్సు వలన ఈ యోని చక్రము ఉత్పన్నమైనదో ఆతేజస్సు వలననే శ్రీచక్రము ఆవిర్భవించినది.

పరాశక్తియే పశ్యంతీ, మధ్యమ, వైఖరీ స్వరూపములను పొందినదని మనము చెప్పుకొన్నాము. ఈ పరాపశ్యంతులు బిందు త్రికోణములుగా నున్నవి. త్రికోణరూపిణి శక్తి, బిందురూపము పరమేశ్వరుడు. ఈ రెండును ప్రకాశవిమర్శాంశములుగా నున్నవి. ఈ శివశక్తి సామరస్యము సకల జగదుత్పత్తికి కారణముగా నున్నది. ఈ పరాపశ్యంతుల సామరస్యరూపము మధ్యమ అనబడును. బిందుమయ పరమాత్మ తేజోమయ గర్భితమై పశ్యంతీరూపమున నున్న త్రికోణ చక్రముయొక్క మూడు రేఖల యందును అవ్యక్తరూప తేజోమయ మాతృకా రూపమయి ఉన్నాడు. ఆవర్ణములు (మాతృక) స్పష్టమైనపుడు వైఖరీశక్తి అగును.

ఈ పరాపశ్యంతాదులు బీజాంకురవృక్ష ఫలరూపములుగా నున్నవి. బీజమందు వృక్షశాఖ పత్రఫలములు ఇమిడి యున్నట్లు పరాబిందువగు పరమాత్మయందు సకల జగత్తు ఇమిడి యున్నది పశ్యంతి అంకురము వంటిది అంకురమును బట్టి వృక్షమేదో తెలిసికొనలేము. అటులనే పశ్యంతి యందలి అవ్యక్త మాతృకలోని వర్ణవిభజన తెలియదు. అందుకే పశ్యంతిని అవ్యక్తమని గూడ అందురు.

ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తిమయి సత్త్వరజస్తమోగుణాత్మకమైన ఈ సకల జగన్నిర్మాతయగు త్రిపురాశక్తి యోనిచక్రాకారమును పొందినది. ఈ యోని చక్రాకారముగానున్న రేఖాత్రితయము అవ్యక్తరూపముగల పంచాశద్వర్ణాత్మక మాతృకయు, పంచదశ వర్ణములుగల మూలమంత్రములోని వాగ్భావ, కామరాజ, శక్తికూటములను, షోడశ నిత్యస్వరూపములగు అకారాది షోడశవర్ణములు, తేజోమయ రేఖాకారములు నున్నవి

ఈ త్రికోణ బిందువులు సత్త్వరజస్తమస్సులనే గుణత్రయమును, బ్రహ్మ, విష్ణు, రుద్రులనే మూర్తిత్రయమును, జ్ఞాతృ జ్ఞాన, జ్ఞేయములు మొదలగు త్రిపుటులను తెల్పును. అంతేగాక చంద్రాగ్ని సూర్యులను మూడు తేజస్స్వరూపములను త్రికోణ

బిందువులుగా భావించిన మధ్యన త్రికోణాంతరమున పరమేశ్వరి బిందురూపిణిగా ప్రకాశించుచు ఈ మూడు తేజస్స్వరూపములకును తేజస్సు ఇచ్చుచున్నటుల గూడ భావింపవచ్చును అదే రహస్యనామ స్తోత్రమందలి త్రికోణాంతరదీపికా

శ్రీచక్రాంతర్గత బిందుతత్త్వము సచ్చిదానంద స్వరూపము ఆ బిందుమండల ప్రభా పుంజమువలన ఏర్పడిన యోని చక్రము పశ్యంతీ స్వరూపము ఈ బిందుయోనులు భావిచక్రములకు బ్రహ్మాండ పిండాండములకును ఆస్పదముగా నున్నవి

**3. అష్టకోణ చక్రము (వసుకోణము) :** శ్రీచక్రమధ్యగత ఆత్మరూప బిందుమండల తేజస్సువలన సవయోనులకు కారణమైన యోనిచక్రమేర్పడినది ఆ బిందుయోనుల కిరణ సముదాయముచే అష్టకోణ చక్రమేర్పడినది

ఆ బిందు త్రికోణతేజస్సు అనగా అవ్యక్త మాతృకాతేజస్సులో శ,ష,స,ప,ఫ,బ,భ,మ అను ఎనిమిది కళలు స్ఫుటములయి ఎనిమిది కోణములుగా వికసించినవి ఈ ఎనిమిది కోణములు, బిందు త్రికోణ చక్రములు రెండును కలిసి పదివస్తువులును, మధ్యనున్న పరమాత్మరూప చిత్కళ అనే దీపముచే ప్రకాశించుచున్నవి అష్టకోణము వైఖరీ శక్తిని తెల్పును

శ్రీచక్రమే శరీరముగా నున్న సంవిద్రూప పరాశక్తి యొక్క మనోబుద్ధ్యహంకారములు, పంచభూతములు కలిసి మొత్తము ఎనిమిదియు అష్టకోణరూపావస్థితములు అని కొందరు చెప్పుదురు. పాశ, అంకుశ, ధనస్సు, బాణము అనునవి శ్రీకామేశ్వరీ, శ్రీకామేశ్వరుల ఆయుధములు ఇద్దరివి కలిసి ఎనిమిది దీనిని అష్టారము తెల్పునని మరి కొందరు చెప్పుదురు

**4,5 అంతర్దశారము, బహిర్దశారము (దశారయుగ్మము) :** ఇంతవరకు బిందువు త్రికోణం, వసుకోణములు ఉత్పన్నమయినవి అందు బిందువు ప్రకాశాంశము; త్రికోణ, వసుకోణములు విమర్శాంశములు ఈ మూడిటి యందున్న ప్రకాశ విమర్శాంశ తేజస్సువలన దశారద్వయము ఏర్పడినది ప్రకాశాంశ తేజస్సు అంతర్దశారముగను, విమర్శాంశ తేజస్సు బహిర్దశారముగను ఏర్పడినవి అందు అవ్యక్త మాతృకయందు

అంకురములుగానున్న త,థ,ద,ధ,న,ట,ఠ,డ,ఢ,ణ —ఈ పది బీజములు అంతర్దాశార కోణములుగను, చ,ఛ,జ,ఝ,ఞ,క,ఖ,గ,ఘ,ఙ—ఈ పది బీజములు బహిర్దశార కోణములగను పరిణమించినవి.

అంతర్దశార కోణదేవతలు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కుర్మ, క్రికార, దేవదత్త ధనంజయ అను పదిప్రాణములను, అయిదు జ్ఞానేంద్రియములను, అయిదు కర్మేంద్రియములను అదుపు చేయుదురు.

బహిర్దశారమందలి తత్త్వము దశావతారాత్మకము. మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, రామ, పరశురామ, బలరామ, కృష్ణ, కల్కి అనునవి దశావతారములు.

**6. చతుర్దశారము (పదునాలుగు కోణములు) :** దశారయుగ్మము, వసుకోణము, త్రికోణము, బిందువు—ఈ చక్రముల కాంతిపుంజము దశారచక్ర పరిణామ రూపమయిన చతుర్దశారము ఏర్పడినది.

త్రికోణ చక్రమందు అంకుర రూపమున ఉన్న అకారాది పదునాలుగు స్వరములు స్ఫుటరూపములయి ఈ చ్రకమందు పదునాలుగు కోణములుగా వికసించినవి. ఇట్లు ప్రతి చక్రకాంతియు చంద్రసూర్య పరివేషాకృతిగా నాచక్రమును ఆక్రమించి రెండవ చక్రాకృతిని పొందుచున్నది. ఈ చక్రతత్త్వము చతుర్దశ భువనములు.

ఈ చక్రము పదునాలుగు కోణములందలి దేవతలు—అలంబుస, కుహు, విశ్వోదరి, వరుణ, హస్తిజిహ్వ, యశోవతి, పయస్విని, గాంధారి, పుస, శంఖిణి, సరస్వతి, ఇడ, పింగళ, సుషుమ్న అను పదునాలుగు నాడులను అదుపులో ఉంచునని కొందరందురు. అవి పిండాండములో దశ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారములయందు కిరణములుగా నుండునందురు.

శ్రీచక్రమే శరీరముగా నున్న సంవిద్రూప పరదేవతయొక్క ఇంద్రియ దశకము, అంతఃకరణ చతుష్టయమును ఇక్కడ దేవతాస్వరూపులుగా ఉన్నారని, మరికొంద రందురు. పదునాలుగు కోణములు పదునాలుగు లోకములను సూచించునని, ఇంకా కొందరు అందురు ఇంతవరకు పరిణతప్రాణి యందలి ప్రకృతులు, ప్రాణములు,

ఇంద్రియాదులు వాటి స్వభావములు అష్టకోణ, దశారద్వయ (8+10+10) కోణములచే సూచింపబడినవి 14 కోణముల ఆవరణచే ప్రాణులకు ఆధారమయిన లోకములు తెలుపబడినవి అని కొందరి అభిప్రాయము.

**7. అష్టదళ పద్మము :** అ,క,చ,ట,త,ప,య,శ - అను ఈ ఎనిమిది వర్గుల కాంతితో అష్టదళ పద్మముండును. అ-వర్గము అంటే అ నుండి అః వరకు, క-వర్గమంటే క నుండి ఙ వరకు అట్లాగే మిగిలినవి. పరాశక్తి యొక్క అవ్యక్త, మహత్తత్వాహంకారములు, భూతతన్మాత్ర పంచకమును ఈ ఎనిమిది పద్మముల యందు దేవతా రూపములను ధరించి యున్నవి.

**8. షోడశదళ పద్మము :** అకారాది షోడశస్వరములును షోడశదళ కమలాకారమును పొందినవి.

**9. భూపురత్రయము :** దీనిలో మూడు చతురస్రములుండును. వీటిలో నాలుగువైపుల ద్వారములుండును. ఈ మూడు కలిసి ఒకే ఆవరణ. పశ్యంతీ, మధ్యమా, వైఖరీ శక్తులు త్రికోణాది షోడశదళాంత చక్రవములందు విజృంభించి భూపురత్రయమునందు విశ్రమించినవి. కావున ఆశక్తిత్రయమునకు ఈపురత్రయము విశ్రాంతి స్థానము.

## వైఖరీ
## స్పష్ట వైఖరీ స్వరూపము

బిందువు మొదలుకొని చతుర్దశారపర్యంతము ఉత్పన్నమయిన అయిదు చక్రములకు ప్రథమ చక్రము కారణముగాను, రెండవది కార్యముగాను ఉన్నది. పరా, పవ్యంతీ, స్థూల మధ్యములనే శక్తిత్రయమువలన వైఖరీశక్తి పుట్టినది. తద్వారా అకారాది క్షకారాంతమయిన 51 అక్షర రాశి సకల వ్యవహార యోగ్యమైన వైఖరీ అనే స్ఫుటాక్షర పంక్తి ఉత్పన్నమయి ఈ అయిదు చక్రాకారములుగా వైఖరీశక్తి ప్రకాశించుచున్నది.

**వైఖరీ ఉత్పత్తిక్రమము :** మాతృకోత్పత్తికి ప్రథమకారణము బిందువు. దాని వికసనము విసర్గ(ః) తరువాత అకారాది స్వరములు. ఆ తరువాత కకారాది వర్ణములు. అకారాది

స్వరములకు పూర్వమున్న బిందు విసర్గలను వేటి సహాయములేకుండ పలుకుటకు వీలుకాదు. అందువలన అకారాది 14 స్వరముల ఆఖరున అం, అః అని అకారమును పురస్కరించుకొని అంతమందు ఉచ్చరింపబడుచున్నవి. కాని అవి షోడశ స్వరములకు (16 అచ్చులకు) ఆది ద్వంద్వముగా నున్నవి. షోడశ స్వరములలో హ్రస్వములు ఎనిమిది ప్రకాశాంశములు. దీర్ఘస్వరములు ఎనిమిది విమర్శాంశములుగా నున్నవి. షోడశ స్వరములలో మొదటిది అయిన బిందువు శ్రీచక్రము మధ్యగల బిందురూపము. విసర్గ యోనిచక్రాంతర్గతము. ఇక య,ర,ల,వ. ఇందు యకారము వైఖరీ మాతృకయందు వాయురూపముగను, రకారము తేజోరూపముగను పరిణమించినవి. లకారము భూపురత్రయముగా పరిణమించినది. వకారము అమృత మయము, షోడశదళ కమలముగా పరిణమించినది. ల,ళ-లకు అభేదము. క్షకారము క,ష అను వర్ణద్వయ సంయోగము అని ఇక్కడ చెప్పుకొన్నా మంత్రశాస్త్రములో క్షకారమునకు ప్రత్యేక స్థానమున్నది. ఆ విషయము వేరొకచోట చర్చించబడినది. ఇట్లు 51 అక్షరములు గల వైఖరీ మాతృకాశక్తి తెలియుచున్నది.

ఇక్కడ వృత్తత్రయమును గూర్చి ప్రస్తావించలేదు. వృత్తత్రయము, భూపురత్రయములోని ద్వారములు మొదలగు విషయములలో ఏకాభిప్రాయము లేదు. ఇవన్ని రెండవ భాగము చివర ప్రత్యేకముగా చెప్పుటకు ప్రయత్నము జరిగినది.

## స్థూల, సూక్ష్మ, సూక్ష్మేతర చక్రమేళనము

**స్థూల చక్రభావన :** మూలాధారాది సహస్రాంత కమలములందు శ్రీచక్రమునందుగల అష్ట చక్రమేళనమునే స్థూలచక్ర మేళనమందురు. విశుద్ధ కర్ణిక, లంబికయును, దశారద్వయము ఒకే చక్రముగా భావించినపుడు "అష్టచక్రా నవద్వారా" అనేశ్రుతి శరీరచక్రములకు సమానముగా వర్తించుచున్నది. ఇదే స్థూల చక్రభావన.

**సూక్ష్మచక్ర భావన :** సాధకుని భ్రూమధ్యనుండి సహస్రారమధ్య వరకును ఆరోహణ క్రమములో ఈక్రింది చక్రములున్నవి. 1) చంద్రమండలము, 2) అర్థచంద్రాకారము,

3) రోధిని, 4) నాదము, 5) నాదాంతము, 6) శక్తి, 7) వ్యాపిక, 8) సమనా, 9) ఉన్మనా - ఈ తొమ్మిది శరీరమునందు సూక్ష్మముగా నున్నవి. వీనియందు శ్రీచక్రగత భూపురాదిగా బింద్వంతముగల నవచక్రములకు ఐక్యము భావించుట సూక్ష్మ చక్రభావన

**సూక్ష్మ తర చక్రభావన :** సహస్రారాంతర్గత చంద్రమండలమునందు నవచక్రసహిత శ్రీచక్ర భావన సూక్ష్మతర చక్రభావన అనబడును.

ఇట్లు శ్రీచక్రమును శరీరమునందు ఈ మూడు విధములుగా భావించినప్పుడు సాధకుడు జీవన్ముక్తుడగును.



# శ్రీకలా యంత్రము

సప్తాస్యాసన్ పరిధయః। త్రిస్సప్త సమిధః కృతాః॥

(ఏడు పరిధులు, 21 ముఖ్య బిందువులతో రూపొందిన యంత్రమే శ్రీకల)




తత్ర శ్రీకలా రూపం హి పరాత్పరమ్। పరాత్పర చక్రయోరధిష్ఠానం హి తత్॥

(పరాత్పర రూప చక్రమునే శ్రీకలాయంత్రము అందురు.
శ్రీకలా యంత్రమే పర, అపర అను శ్రీచక్రములకు ప్రాతిపదిక)

# శ్రీచక్రము

## ద్వితీయ భాగము

### ప్రాస్తావికము

''నాకు తెలిసిన శ్రీచక్రము''లో మొదటి భాగము బ్రహ్మపదార్థము దగ్గరనుండి ప్రారంభించి నవావరణ శ్రీచక్రము వరకు చెప్పబడినది. మరల బ్రహ్మము నుండి నవావరణ శ్రీచక్రము వరకు రెండవ భాగములో గూడ చర్చించబోవుచున్నాము. రెండవ భాగములో చర్చించబోవు శ్రీచక్రము ప్రధానముగా శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత, భారతీసంప్రదాయ సార్వభౌమ జగద్గురుశ్రీ శ్రీకల్యాణానంద భారతీస్వామివారు చెప్పిన శ్రీచక్రము, వారు రచించిన శ్రీయాగ సూత్రము, బ్రహ్మకల, శ్రీకల, పూర్ణమీమాంస మొదలగు పుస్తకముల ఆధారముగా చెప్పబడినది.

శ్రీ శంకరభగవత్పాదులు తూర్పున జగన్నాథక్షేత్రమున గోవర్ధనమఠమును (పద్మపాదులు), దక్షిణమున శృంగగిరి క్షేత్రమున శ్రీపీఠమును (సురేశ్వరులు), పశ్చిమమున ద్వారకాక్షేత్రమున శారదాపీఠమును (హస్తామలక) ఉత్తరమున హిమాలయముల మధ్యమున జ్యోతిర్మఠమును (త్రోటకులు) స్థాపించిరి.

క్రీ.శ. 1331లో శ్రీవిద్యారణ్య బిరుదాంకితులగు శ్రీవిదాశంకర భారతులు శృంగేరీ ప్రతాప భారతీ శ్రీపీఠము (శృంగగిరి శ్రీపీఠము) నందు అభిషిక్తులయిరి. వారు హరిహరునకు, బుక్కరాయలకు విజయనగర సామ్రాజ్య స్థాపనలో సహాయపడిరి. శ్రీవిద్యారణ్యులు శ్రీవిద్యా నగర నిర్మాణమునకు, శ్రీచక్రము పోతపోయుటకు ఒక సుముహూర్తమును నిర్ణయించి వానిని నిర్మింపచేసిరి. అప్పుడు పోతపోయించిన శ్రీచక్రమే గుంటూరు 4/2 అరండల్‌పేట శ్రీసదనములో ఉన్నది.

శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠమునకు 23-12-1923న గుంటూరులో శ్రీ కల్యానంద భారతీస్వామి వారు పీఠాధిపతులైరి. శ్రీశృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠమునకు శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు పీఠాధిపతులగు వరకు సంచారము చేస్తూ ఉండేది. 1932 వైశాఖ శుక్ల సప్తమినాడు శ్రీవిద్యారణ్య నిర్మితమైన అష్టనాగేభ కూర్మమండిత శ్రీచక్రమును గుంటూరు శ్రీసదనములో శ్రీ కల్యాణానందభారతీ స్వామివారు స్థిరప్రతిష్ఠను చేసిరి. శ్రీస్వామివారు శతాధిక గ్రంథకర్తలు వారు ఏదివ్రాసినా, చెప్పిన వేద సమ్మతముగా సకారణముగా వ్రాసేవారు; చెప్పేవారు. ఈ తరమువారికి వారినిగురించి కొంత తెలియుట అవసరమని భావించి ఇక్కడ వివరించడం జరిగింది. ఆ మహనీయుడు చెప్పిన విధముగా ఈ రెండవ భాగములో శ్రీచక్రమును గూర్చి చర్చించబడినది. ఆయన పీఠాధిపతులగు నప్పటికి ఆంధ్రదేశము నందంతటను విప్రులయందు శ్రీచక్రార్చనలో వామాచారము ప్రబలియున్నది. శ్రీవారు దానిని ఖండించుచు దక్షిణాచారమును స్థాపించిరి. శ్రీచక్ర చర్చలో దొర్లిన తప్పులు నావిగా భావించ ప్రార్థన.

శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష పీఠ మూలచరిత్ర, భారతీ సంప్రదాయ విశిష్టత ''రేణుకా తంత్ర''మను ఒక సుప్రసిద్ధ గ్రంథమున వర్ణించబడినది. గుంటూరు శ్రీసదనము వారు వారి ''లలితారహస్యనామస్తోత్ర'' పుస్తకములలో ఆ చరిత్రను క్లుప్తముగా ప్రచురిస్తూ ఉంటారు. శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీ పీఠముననే శ్రీవిద్య నేటికిని సంప్రదాయ సిద్ధముగా విరాజిల్లుచున్నది.



# ఓం-శ్రీం

పదప్రపంచము రెండు విధములు. అవి 1) శ్రుతి, 2) స్మృతి శ్రుతికారణము, స్మృతి ఫలము. శ్రుతినే వేదము అందురు శ్రుతి నిత్యము, అపౌరుషేయము; స్వతఃప్రమాణము. శ్రుతి నిజస్వభావము శ్రుతి ద్వార మాత్రమే తెలియును స్మృతి అనిత్యము, పౌరుషేయము; పరతహ ప్రమాణము. శ్రుతి, స్మృతి రెండును జ్ఞానమునకు అత్యుత్తమ ప్రమాణములు

వేదములన్నీ ''ఓం'' అనే ఏకాక్షరము యొక్క అర్థమే అని శ్రుతి ఘోషించు చున్నది ''ఓం'' అనగా బ్రహ్మము మరియు సర్వము (ఓం మితి బ్రహ్మ, ఓం మితిదమ్ సర్వమ్) బ్రహ్మమే ఆర్యావర్తన పవిత్ర సాహిత్యములైన శ్రుతి స్మృతుల అంతిమ లక్ష్యముగా నున్నదని కృష్ణద్వైపాయన భారతీ వేదవ్యాస భగవానుని వేదాంతదర్శనము ప్రథమ సూత్రము ఘోషించు చున్నది (అధాతో బ్రహ్మజిజ్ఞాసా) భగవాన్ శ్రీకృష్ణపరమా విశ్వవిఖ్యాత స్మృతి భగవద్గీతలో ''అహం'' సర్వవేదముల ముఖ్య లక్ష్యమని స్పష్టీకరించెను [వేదైశ్చ సర్వైరహమేవవేద్యో వేదాన్త కృద్వేద విదేహ చాహమ్॥ (భ.గీ. 15-15)] ఆ బ్రహ్మము ముఖ్యముగా మూడు పవిత్రపదములచేత తెలియ చెప్పబడుచున్నది. అవి 'ఓమ్', 'తత్', 'సత్' (ఓమ్ తత్సత్ ఇతి నిర్దేశో బ్రహ్మనామ త్రివిధహ స్మృతా।)

పైన పేర్కొనిన దాని నిశిత పరిశీలన వలన అట్టివే అయిన ఇతర శ్రుతిస్మృతి ప్రకటనల వలన మనకు తెలిసేది, మన ప్రధాన గమ్యము ఓమ్, బ్రహ్మ, అహం అను మూడు పవిత్ర పదములచేత ప్రధానంగాను మరియు ఇంకా ఇతర పదములచేత తెలుపబడుచున్నది వానిలో ముఖ్యమైనవి క్రింద పేర్కొనబడినవి అవి : 1) పురుష, 2) సర్వమ్, 3) ఆనంద, 4) దహార, 5) శరీర, 6) రస, 7) గతి, 8) శివ, 9) ప్రణవ, 10) పద, 11) అజ, 12) ఆత్మ, 13) సత్, 14) భూమా, 15) కర్త, 16) ఇష్టి, 17) గర్భ, 18) యజ్ఞ, 19) స్వపితి, 20) పురీషియ, 21) ప్రజాపతి, 22) తారక,

23) తత్, 24) పూర్ణం, 25) తురీయ, 26) పర, 27) గాయత్రీ, 28) యంత్ర, 29) చక్ర, 30) సుదర్శనమ్

ఈ పదములన్నీ బ్రహ్మము లేక ఓమ్‌కు సమానార్థక (Synonomous) ములే బ్రహ్మము లేక ఓమ్ అర్థమును చెప్పుటకు పవిత్ర శ్రుతి స్మృతి ఈ ప్రపంచములోనికి ప్రవేశపెట్టిన పదములివి.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"- అని తైత్తిరీయోపనిషత్ బ్రహ్మమును గూర్చి చెప్పుచున్నది. ప్రణవ వాచకమగు ఓంకారమెట్టిదో శ్రీంకారము గూడ అట్టిదే. ఓంకారము పరమేశ్వర స్వరూపమైన, శ్రీంకారము దానిశక్తి. చంద్రునికి వెన్నెలకు భేదము లేనట్లే ఓంకార శ్రీంకారములు అభేదములు. సన్యాసులకు ఓంకారమెట్టిదో శ్రీవిద్యానిష్ఠులకు శ్రీంకార మట్టిది. శ్రీంకారము పరబ్రహ్మ సూచకమగు ఓంకారమునకు పరోక్షనామము. శ్రీ అనగా బ్రహ్మ అని శ్రుతివచనము. 'సాహిశ్రీరమృతా సతాం' అనగా అమృతము బ్రహ్మము అగుట. అంటే శ్రీ అనగా బ్రహ్మయే అగును. శ్రీవిద్య అంటే బ్రహ్మవిద్యయే. శకార, రేఫ, ఈకారములు కలిసి శ్రీకారమగును. శకారము ఆనందవాచకము; రేఫ తేజోవాచకము; ఈకారము పరమేశ్వరీ వాచకము. కావున జ్ఞానానంద పరబ్రహ్మ స్వరూపమే శ్రీంకారము. శివోహమను కామేశ్వర రూపమును, శివాహం అను కామేశ్వరీ రూపమును శ్రీం తెలుపును

బ్రహ్మము మూర్తము, అమూర్తమని రెండు విధములు అని ప్రశ్నోపనిషత్ చెప్పుచున్నది.

"తస్మై సహోవాచ ఏతద్వైసత్యకామ పరంచా పరంచ బ్రహ్మయదోంకారః తస్మాత్ విద్వాన్ ఏతే నైవ ఆయతనేన ఏకతర మన్వేతి" ॥

ఓ సత్యకామా! పరబ్రహ్మము సత్యము; అక్షరము. వేదాంతములు దీనిని పురుషుడని వ్యవహరించును. హిరణ్యగర్భుడు అపరబ్రహ్మము తొలి పుట్టువు. దీనిని ప్రాణమని వేదాంతములు వ్యవహరించును ఈ రెండిటికి ఓంకారమే ప్రతీకము. కావున పరాపర బ్రహ్మలు రెండును ఓంకారమే.

ఓంకారోపాసన ఆత్మప్రాప్తికి సాధనము. ఓంకారము బ్రహ్మమునకు దగ్గరలోనుండు ఆలంబనము.

**మూర్తాఽమూర్తా నిత్యతృప్తా.....** (ల.ర.స్తో. 154)

మూర్తియుతమైనది పరమేశ్వరి ఉపాస్యరూపము. మూర్తము అపరము. నామరూప సహితము, ఆనందమయ స్వరూపము. అమూర్తము పరమేశ్వరియొక్క జ్ఞేయరూపము. అమూర్తము పరమ్; నామరూపములు లేనిది; ఆనందస్వరూపము.

మూర్త ఉపాస్యబ్రహ్మయగు ఈశ్వరరూపము. అమూర్త జ్ఞేయమగు పరబ్రహ్మ స్వరూపము.

## యంత్రము

ప్రతిభావన శబ్ద చిహ్నముతోను, రూపచిహ్నముతోను కూడి యుండును. ఆ భావనాసత్యమును దేవత అందురు. శబ్ద చిహ్నమును మంత్రమని, రూప చిహ్నమును యంత్రమని అందురు. దేవత ప్రాణము; మంత్రము దాని సూక్ష్మ శరీరము; యంత్రము దాని స్థూల శరీరము యంత్రమును దేవతా శరీరమని, మంత్రము దాని ఆత్మ అనిగూడ అందురు.

మంత్రము 'మన్' మూలమునుండి వచ్చినది. మరల మరల చెప్పుట (Repeat) లేక మననము చేయుట, రక్షించు (Protect) లేక విమోచనము చేయు అని దాని అర్థము. మరల మరల చెప్పుచు (జపించుచు) ధ్యానించుటవలన మంత్రము సంసారబంధముల నుండి విముక్తిని కలిగించును. అన్ని భయములనుండి విముక్తిని కలిగించునదే మంత్రము. మంత్రము ప్రధానంగా వ్యాపన చెందు ప్రకంపన శక్తి. మంత్రములో బీజాక్షరము లుండును. వానిని క్రమపద్ధతిలో ఉచ్చరించుటచేత ప్రకంపనములు ఉత్పత్తి అగును. అవి సాధకునిలో అమోఘశక్తిని కలిగించి వానిలో భౌతిక, మానసిక అభ్యుదయమును, ఆత్మోన్నత్యమును

కలిగించి చివరకు మోక్షమును కలిగించును. మంత్రము ఎప్పుడూ స్తుతించేదిగాను, ఒక నిర్ణీతార్థమునుగాని కలిగియుండదు. అందువలన మంత్రమును యథాతథముగా భాషాంతరీకరణము చేయలేము. ఆవిధంగా చేస్తే అది మంత్రముగా ఉండదు. కారణమేమనగా అది శబ్దనిర్మాణము (Phonetic Structure)ను కోల్పయి నిర్ణీతమైన శబ్ద ప్రకంపనలు ఉత్పత్తి కావు.

యంత్రము ''యమ్'' అను మూలమునుండి పుట్టినది; అదుపుచేయు అని అర్థము. ''యమ్'' అనగా గృహమనిగూడ అర్థమున్నది. మంత్రము విడుదల చేసిన శక్తిని కావలసిన పద్ధతిలో, రూపములో ఏర్పాటుచేయు సాధనమే యంత్రము. అనగా శక్తిని నిలువచేసే గృహమని చెప్పవచ్చును. తంత్రశాస్త్రములో శక్తులను లేక దేవతలను విగ్రహములుగాను, రూపులుగాను కాకుండ యంత్రములుగా పేర్కొంటారు.

విగ్రహము లేక రూపు దేవతయొక్క బాహ్య పరమైన విషయమును మాత్రమే సూచించును. యంత్రము ఆ దేవతా తత్త్వమును రేఖాగణిత ప్రతిపాదితమైన సరళ రేఖలతోను, వృత్తములతోను, త్రికోణములతోను, చతురస్రముల తోను, దళములతోను మొదలుగాగల చిహ్నములతో తెలియజేయును.

దేవతను యంత్రముద్వారా పూజించు విధానము విగ్రహము లేక రూపు పూజలకంటె ఉత్తమమైనది; ఉన్నతమైనది; అధికఫలవంతమైనది. యంత్రము దేవతా సాక్షాత్కారమును కలిగించును.

విగ్రహమునకు శక్తినిచ్చుటకు విగ్రహము క్రింద ఆదేవతా యంత్రమును ఉంచుట పరిపాటి. కాని శ్రీక్రమును ప్రతిష్ఠ చేయునపుడు దానిక్రింద ఏ యంత్రమును ఉంచ నవసరము లేదు. కారణము శ్రీచక్రమే యంత్రము. దానికి వేరేయంత్రము అవసరము లేదు. ఒక దేవత ప్రతిష్ఠకు దానిక్రింద ఉంచుటకు తత్సంబంధమైన యంత్రము లభించనపుడు ఆదేవతా విగ్రహముక్రింద శ్రీచక్రమును ఉంచుదురు. తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి మూలవిరాట్టు క్రింద శ్రీచక్రమున్నదని ప్రసిద్ధి. అదే అక్కడి జనాకర్షణకు, ధనాకర్షణకు కారణమని ప్రసిద్ధి.

శ్రీయంత్రమును ప్రత్యేకముగాను, పారిభాషికముగాను శ్రీచక్రమందురు. కావున దానిని శ్రీ లేక లక్ష్మి యంత్రమని భ్రమపడరాదు. శ్రీమహాలక్ష్మి చాలకాలము మహాత్రిపుర సుందరీ దేవిని ఆరాధించినది. అపుడు ఆమె శ్రీపదముచే సూచిపబడునని మహాత్రిపుర సుందరి వరమిచ్చినదని ఇతిహాసము. శ్రీచక్రము చక్రరాజము; చక్రములు లేక యంత్రము లన్నిటిలో శ్రీచక్రము అత్యుత్తమమైనది. అది తొమ్మిది త్రిభుజములవలన ఏర్పడుటచే దానిని నవయోని చక్రమని గూడ అందురు. ఆ తొమ్మిది భుజములలో ఐదు త్రిభుజములు అధోముఖముగాను, నాలుగు ఊర్ధ్వముఖముగాను ఉండును. దానిలో తొమ్మిది చక్రములు (ఆవరణలు) ఉండుటచే దానిని నవచక్రమందురు. శ్రీచక్రములో 43 కోణములుండుట వలన దానిని 'త్రయశ్చత్వారింశత్ కోణ' అని అందురు. దహరాకాశములోను (హృదయావ కాశము) బాహ్యావకాశములోను మేరు రూపములో పూజింపబడుటచే శ్రీచక్రమును వియత్ చక్రమనిగూడ అందురు. శ్రీచక్రము శ్రీదేవి – ఆమె త్రిపురసుందరి, లలితాంబిక – యొక్క నివాసస్థానము లేక ఆమె నగరమగుటచే శ్రీనగరమని అందురు. శ్రీచక్రములో మాత్రికలు ఉండుటచేత, మాత్రికలన్నిటికి (అ నుండి క్ష వరకుగల సంస్కృతాక్షరములకు మాత్రికలని పేరు) ఉత్పత్తిస్థానమగుటచే శ్రీచక్రమును మాత్రికా చక్రమనిగూడ అందురు. ఈపేరు శ్రీచక్రము పరామాతకు నివాస స్థానమనేగాక ఆమె యొక్క సర్వశక్తులను, మూర్తి మత్వములను, కిరణములను తెలుపును. ఇవన్నీ మహాత్రిపురసుందరి నివాసమును తెల్పును. ఆమె త్రిపురములు – మూడు కూటములు, మూడు చక్రముల వర్గము లేక విశ్వములోని అన్ని త్రిపుటములకు మహారాజ్ఞి – లలిత (అనుగ్రహమాత), పరాభట్టారిక రాజరాజేశ్వరి, జగదంబ, భగవతి – ఇవన్నీ ఆ అత్యున్నత శక్తి లేక పరబ్రహ్మము అని అర్థమిచ్చే పర్యాయ పదములు

శ్రీచక్రములోని "శ్రీ" మామూలుగా దేవతా నామములకు ముందు ఉంచే గౌరవ సూచిక 'శ్రీ' వంటిది కాదు. మహాత్రిపురసుందరి యంత్రమును తెలుపుటకు ఉపయోగించు ప్రత్యేక నామము శ్రీచక్రము శ్రీచక్రము బ్రహ్మాండ పిండాండములను తెలుపుటకు ఉపయోగించు ప్రతీక శ్రీచక్రము శివుని శరీరము. శివుడు లేకుండ దేవి (శక్తి) ఉండదు, దేవి (శక్తి) లేకుండ శివుడు ఉండదు శివశక్తులు రెండూ విడదీయబడవు

నశివేన వినాదేవీ దేవ్యాచ న వినాశివః ।
నైతయోరంతరం నాస్తి చంద్రచంద్రిక యోరివ ॥

ఏ విధంగా వెన్నెలకు చంద్రుని విడదీయుటకు వీలులేదో అటులనే శివ-శక్తి. వారు శబ్దార్థ స్వరూపులు. ఇదే అర్ధనారీశ్వర స్వరూపము.

శివునికి అగ్ని, సూర్య, సోమాత్మకములగు మూడు కన్నులున్నవి ఇవి శ్రీవిద్యలో మూడు ఖండములుగాను, గాయత్రిలో మూడు పాదములుగాను ఉన్నవి. ఇవే మూలాధార, అనాహత, ఆజ్ఞాచక్రములు.

శ్రీచక్రము త్రిపురాత్మకము. అది విశ్వములోని అన్ని త్రికములను తెల్పును. బిందు, త్రికోణ, అష్టార చక్రములను కలిపి ఆగ్నేయ ఖండమందురు. ఇది సృష్టిని, కారణ శరీరమును తెల్పును. దానిని ప్రమాతపురమందురు. దశారద్వయము, చతుర్దశారములను కలిపి సౌరఖండమందురు. ఇది స్థితిని, సూక్ష్మ శరీరమును తెల్పును. దీనిని ప్రమాణపురమందురు. అష్టదళము, షోడశదళము, భూపురత్రయములను కలిపి సోమఖండమందురు ఇది సంహారమును, స్థూల శరీరమును తెలుపును. దీనిని ప్రమేయపురమందురు పురము అంటే పట్టణము మరియు క్రియాస్థానమని అర్థము. ప్రమాత అంటే జ్ఞాత అనగా తెలిసికొనేవాడు ప్రమాణ అంటే జ్ఞానము అనగా తెలిసికొనేది ప్రమేయ అంటే జ్ఞేయము అనగా తెలిసికొనినది. ప్రతిదానిలోను ఈ త్రిపుటే ఉండును. ఇక్కడ త్రిపుర అనగా సూర్యుడు, చంద్రుడు, అగ్ని అని అర్థము. అవి ప్రకాశము, బ్రహ్మానందము ఈ సూర్యుడు, చంద్రుడు, అగ్ని మనము సామాన్యముగా వాడుకలో వాడు మాటలు కావు

శ్రీచక్రము బ్రహ్మాండమును (స్థూలప్రపంచమును) పిండాండమును (సూక్ష్మ ప్రపంచమును) తెలుపు ప్రతీక. బ్రహ్మాండములో జాగృతి, స్వప్న, సుషుప్తయు; పిండాండములో శిరస్సు, హృదయము మూలాధారము లేక సాధకుని శరీర త్రిఖండములు.

## శివా-శివత్రిభుజములు :

శ్రీచక్రము భూప్రస్తారములో కేంద్ర బిందువు చుట్టూ తొమ్మిది పెద్ద ప్రాధమిక త్రిభుజములుండును. వానిలో అయిదు త్రిభుజములు అధోముఖము గలవి. అవి మేరు ప్రస్తారములో ముందువైపునకు ఉండును. ఇవి శక్తి త్రిభుజములు. భూప్రస్తారములో నాలుగు త్రిభుజములు ఊర్ధ్వ ముఖముగా ఉండును. మేరుప్రస్తారములో అవి వెనుక ముఖముగా ఉండును. ఈనాలుగు శివత్రిభుజములు.

| శక్తి త్రిభుజములు అయిదు ఈక్రింది వానిని తెలుపును | |
|---|---|
| బ్రహ్మాండము (విశ్వము) | పిండాండము (మానవ శరీరము) |
| 1. పంచ మహాభూతములు | 1. త్వక్ (చర్మము) |
| 2. పంచతన్మాత్రలు | 2. అస్రిక్ (రక్తము) |
| 3. పంచజ్ఞానేంద్రియములు | 3. మాంసము |
| 4. పంచకర్మేంద్రియములు | 4. మేదస్సు (క్రొవ్వు) |
| 5. పంచప్రాణములు | 5. అస్థి (ఎముకలు) |
| శివత్రిభుజములు నాలుగు ఈ క్రిందివానిని తెలుపును | |
| 1. చిత్తము | 1. మజ్జ |
| 2. బుద్ధి | 2. శుక్లము |
| 3. అహంకారము | 3. ప్రాణము |
| 4. మనస్సు | 4. జీవము |

ఈ తొమ్మిది త్రిభుజములు నిరాకార శివుని తొమ్మిది మూలప్రకృతులను తెలుపును. శ్రీచక్రము శివుని శరీరము శివుడు లేక దేవి లేదు, దేవి లేక శివుడు లేడు. వారు విడదీయ బడలేరు. వారు శబ్దార్థ స్వరూపులు. అర్ధనారీశ్వర స్వరూపము. దీనినే మహాకవి కాళిదాసు రఘువంశ కావ్యములో ఈవిధంగా చెప్పాడు:

వాగార్థావివ సంపృక్తే వాగార్థప్రతిపత్తయే।
జగతః పితరౌవన్దే పార్వతీపరమేశ్వరౌ॥

నిర్గుణబ్రహ్మము శబల బ్రహ్మమగుటకు ముందు ఈ విశ్వము నిర్గుణము. ఇది క్రియాశీలతలేని శివుడు—నిర్గుణ శివుడు—చలనశక్తిగా మారినపుడు శక్తి అగును. ఇది బ్రహ్మము యొక్క శక్తిరూపము. శక్తి, శక్తిమానుడు ఒకరే. శివుడు కామేశ్వర—కామేశ్వరి అను శివశక్తిగా రూపొందును. వారు విడదీయబడరు. వారు బిందువు—అదే కామకల.

ఆదిలో బ్రహ్మము ఒక్కటే (Brahman is one without a second). నేను అనేకముగా అగుదును; నేను ఇదమ్‌ను అని ఆయనకు స్ఫురించును. ఇదమ్-విశ్వము. ఇది అహం యొక్క ఉద్దేశానుభవము అ=శివ. హ=శక్తి. అ-హ=అహం. అంటే నేను. శివుడు జ్ఞానశక్తిని, శక్తి క్రియాశక్తిని సూచించును జ్ఞానము క్రియ.

శ్రీచక్రములోని నవచక్రములకు వేరే విధమైన వర్గీకరణ కలదు. త్రికోణము, అష్టారము, దశారద్వయము, చతుర్దశారము—ఈ అయిదు అధోముఖ శక్తి చక్రములు. బిందువు, అష్టదళము షోడశదళము, భూపురము—ఈ నాలుగు ఊర్ధ్వముఖ శివచక్రములు.

అధోముఖి అయిన చక్రములు త్రికోణములు. అంటే సృష్టి శక్తి. త్రికోణములోని కోణముల మొత్తము $180^0$. ఊర్ధ్వముఖ చక్రములు నాల్గింటిలో ఒకటి బిందువు. రెండు దళరూపములు. నాల్గవది చతురస్రము (భూపురము). దళమనగా పూర్ణరూపము లేక వృత్తమని అర్థము. వృత్తము $360^0$ ఉండును. వృత్తము పూర్ణమును, అనంతమును లేక బ్రహ్మమును తెల్పును. వృత్తమీశ్వరః-వృత్తము శివరూపము. బిందువు విస్తృతించిన వృత్తము లేక వృత్తము కుంచించిన బిందువు. చతురస్రము $360^0$ ఉండును. త్రిభుజము $180^0$. త్రికోణము శక్తిరూపము. వృత్తము శివరూపము. అంటే శక్తి శివునిలోని అర్థభాగము— అర్ధాంగి. శివుడు అర్ధాంగితో కలిసి అర్ధనారీశ్వరుడు అగును. అదేసగుణ బ్రహ్మము—హిరణ్యగర్భుడు. సగుణబ్రహ్మము మాత్రమే సృష్టిచేయగలదు. ఈ భావనకు శ్రీచక్రము ప్రతీక. 'శ్రీ' ఈ సర్వవిశ్వమునకు చిహ్నము. శ్రీచక్రము బ్రహ్మానందమును తెల్పును. బ్రహ్మములో ఒక పాదము మాత్రమే బ్రహ్మానందము-సగుణబ్రహ్మము.

ఈ విశ్వము యొక్క మూలము పైన, శాఖలు క్రింద ఉన్నవి. (ఊర్ధ్వమూలమ్ అధఃశాఖ) అందువలన శివకోణములు ఊర్ధ్వముఖముగాను శక్తి కోణములు అధోముఖముగాను ఉన్నవి.

# శ్రీకలా యంత్రము

సృష్టికి పూర్వము సత్ అను పదార్థముండెడిది. అదియే చిదగ్నిగా ఉపదేశింపబడిన బ్రహ్మపదార్థము. అదే మొట్టమొదటి మహాబిందువు.

ఒక పూర్ణబిందువుగా తెలియచేయబడిన మొదటి మహాబిందువు (సత్ పదార్థము) అనేకముగా అగుదునని సంకల్పించినది. ఈ సంకల్ప సహిత బిందువే మహాకారణ రూపము. అట్టి (ప్రథమ సంకల్ప సహిత) ఈశ్వత్యాత్మకమయిన మహాకారణశక్తి యొక్క క్షేత్ర రూపమునకే శ్రీచక్రమని వ్యవహారనామము.

పరాశక్తికి ఆయతనములు మూడు. అవి : 1) పరం, 2) అపరం, 3) పరాత్పరం. మొదటిది మహాబిందువు. అది సంకల్పసహితమై మహాకారణ బిందువు అవుతుంది. దీని క్షేత్రరూపమే పరాత్పరమనబడు శ్రీచక్రరూపము—శ్రీకలాయంత్రము. ఇది ఏడు వృత్త ములు కలిగిన రేఖాయంత్రము. దీనినుండి దీర్ఘవృత్తద్వయము పరం అనబడు శ్రీచక్రము శ్రీమండలము, అపరం అని చెప్పబడు నవావరణ శ్రీచక్రము ఏర్పడినవి. పరాత్పర శ్రీచక్రమునే శ్రీకలాయంత్రమందురు. మూడు ఆయతనములను శ్రీచక్రమనే అందురు. స్పష్టత కోసము ''—'' ఉంచి ఆ ఆయతనము పేరు వ్రాయబడినది.

శ్రీకలాయంత్రము ప్రక్క పుటలో చూపబడినది. శ్రీవిద్య సమగ్రోపాసనకు శ్రీకలాయంత్ర రహస్యములను తెలిసికొనుట అవసరము. ఇది పరదేవత యొక్క స్వరూపమును తెలుపునట్టి పవిత్రతమమైన పరాత్పరమను పేరు గలిగిన యంత్రము. శ్రీకలాయంత్రము యొక్క స్వరూపమును రహస్యనామస్తోత్రమందలి శ్రీమత్సింహాసనా అను నామము బోధించు చున్నది. సింహమన పంచాననము. ఆననము వృత్తరూపము. పంచాననమన అయిదు వృత్తములచే రూపొందిన పరాత్పరమను కల్యాణ శ్రీకలాయంత్రము, అధిష్ఠానముగా గలది. శ్రీకలాయంత్రమునే పెద్దలు కామకలాయంత్రమని గూడ పిలుచు చున్నారు. దీనికి గాయత్రీ చక్రమనియు, సదాశివ చక్రమనియు సంకేతవిశేషము గలదు.




శ్రీకలా యంత్రము

రోమను అంకెలు వృత్తసంఖ్యను, మామూలు అంకెలు శక్తిస్థానములను తెలుపును. అవి (1-8) వరకు జతలుగానున్నవి. తొమ్మిది మాత్రము ఒక్కటే.

రహస్యనామ స్తోత్రమునందలి మొదటి తొమ్మిది నామములు సర్వవేదాంత రహస్యసారమును ఉపదేశించుచున్నవి. ''ఉద్యద్భాను సహస్రాభా'' నుండి ''కురువిన్దమణి శ్రేణీకనత్కోటీరమండితా'' అను ఈ తొమ్మిది నామములు శ్రీకలా చక్రము యొక్క భావనా విశేషము సృష్టిక్రమములో తెల్పుచున్నవి. ఈ తొమ్మిది నామములు పరదేవత యొక్క కరచరణాది అవయవ యుక్తమగు స్థూలరూపమును, రహస్యముగా సూక్ష్మరూపమును వర్ణించుచున్నవి. ఇది అనుబంధములో ఇవ్వబడినది.

శ్రీకలాయంత్రములో ఏడు వృత్తములు, ఇరువది ఒక్క ముఖ్యబిందువులు ఉన్నవని పురుష సూక్తములోని —

సప్తాస్యాసన్ పరిధయః । త్రిసప్త సమిధః కృతాః।

అను మంత్రము వలన తెలియుచున్నది.

సృష్టికి మూలము మహాబిందువు. సున్న వ్యాసార్ధముగాగల వృత్తమే బిందువు. అంటే బిందువు గుణ (వ్యాసము) రహితము. వృత్తము గుణసహితము.

ఒక సూక్ష్మబిందువు నిర్గుణము. అప్పుడు సృష్టికి మూలమైన మహాబిందువు గుణరహితమగును. కాని నిర్గుణ బ్రహ్మమును పటరూపములో చూపుట అసంభవము. కావున గుణరహిత బిందువుచే నిర్గుణబ్రహ్మము చూపబడుచున్నది. వృత్తం ఈశ్వరునికి సంకేతము.

శ్రీకలాయంత్రములో ప్రథమముగా కొంత వ్యాసముతో వృత్తమొకటి ఏర్పడి వ్యాపించినది. దానిని వృత్తము-I అనుకొందము. ఆ వృత్తము (I) పరిధిపై నాలుగుదిక్కులు కేంద్రములుగా కలిగి, దానితో (I) సమానవ్యాసముగల నాలుగు వృత్తములు (II,III,IV,V) ఏర్పడినవి. సజాతో అత్యరిచ్యత। పశ్చాద్భూమి మధోపురః। - పురుషసూక్తము.

మొదటి వృత్తము కేంద్రమును (I) కేంద్రముగా చేసికొని నాల్గు దిక్కులందలి వృత్తముల (II,III,IV,V) ఖండన బిందువులగుండా మరొక వృత్తము (VI), నాల్గు దిక్కులందలి నాల్గు వృత్తములను (II,III,IV,V) బాహ్యంగా స్పరిస్తూ (అవృత్తముగా) మరొక వృత్తము (VII) ఏర్పడినవి. ఈ యంత్రమే శ్రీకలాయంత్రము దీనిలో ఏడు పరిధులు, ఇరువది ఒక్క ముఖ్య బిందువులు గలవు. 21 బిందువులు ఏవియనగా అంతరవృత్తము (I) పై (1-8) బిందువులు; మధ్యవృత్తము (VI) పై నాలుగు ఖండన బిందువులు (1,2,3,6), బాహ్యవృత్తము (VII) పై నాలుగు స్పర్శ బిందువులు (4,5,7,8), వృత్త కేంద్రములు అయిదు. [ప్రథమ వృత్తము (I)నకు, మధ్య వృత్తము (VI)నకు, బాహ్య వృత్తము (VII)నకు కేంద్రము ఒక్కటే. నాలుగు దిక్కులలోనున్న వృత్తముల (II,III,IV,V) కేంద్రములు నాలుగు. మొత్తము అయిదు కేంద్రములు].

మొత్తము ముఖ్య బిందువులు = **8+4+4+5=21** పైన చెప్పిన బిందువునుండి చూపబడినవి.

ఈ చెప్పినదంతా పురుషసూక్తములోని ఏడవ ఋక్కును అనుసరించి.

సప్తాస్యాసన్ పరిధయః, త్రిస్సప్త సమిధః కృతాః।
దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుమ్॥

[**ఈ మంత్రానికి అర్థము :** దేవతలందరు సృష్టి యజ్ఞమును విస్తరింపచేయగోరి పురుషుని పశువుగా బంధించిరి. అట్లు బంధించుటలో యజ్ఞపురుషునికి ఏడావరణములు ఇరువది యొక్క సమిధలు ఉండునట్లు చేయబడినవి.

**అంతరార్థము :** గాయత్రి మొదలగు ఏడు ఛందస్సులు వేదమును నడిపించు నడకలు. అవియే పరిధులు. ఈ ఛందస్సులే యజ్ఞశాల నిర్మాణమున మూడు ఆవరణాలు, మూడు ఉత్తర వేదికలు, ఆదిత్యుడు (ఆత్మ) అనబడు ఏడు వస్తువులు. 12 మాసములు, 6 ఋతువులు, 3 లోకములు అనునవి సమిధలు (12+6+3=21).

ఇవియే భూతసృష్టిలో ఈక్రింది వస్తువులుగా తెలియును. పరిధులనగా నలుదిక్కుల ఏర్పాటు చేయబడునవి. అవి పంచ భూతములు, అహంకారము, బుద్ధి అనునవి. ఇవియే మూడు రెట్లుగా మూడులోకములలో 21 సమిధలుగా వ్యక్తమగును.

పంచభూతములు, పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము మనస్సు మొత్తము 21 .

**పంచభూతములు :** 1) పృథ్వి, 2) నీరు, 3) అగ్ని, 4) వాయువు, 5) ఆకాశము.

**పంచతన్మాత్రలు :** 1) శబ్దము, 2) స్పర్శ, 3) రూపము, 4) రసము (రుచి), 5) గంధము.

**పంచకర్మేంద్రియములు :** 1) కంఠనాళము, 2) పాదములు, 3) చేతులు, 4) మూత్రద్వారము, 5) ఆసనము.

**తస్మాద్విరాడ జాయత విరాజో అధిపురుషః।**
**సజాతో౽త్యరిచ్యత పశ్చాద్భూమి మదోపురః॥**

పురుషుని నుండి విరాట్ అను బ్రహ్మాండము పుట్టెను. దానినుండి మరల పురుషుడు జీవరూపుడై జన్మించెను. వానికి దేశ కాలాది విభాగమేర్పడినది. కనుక అతడు వెనుకముందులు క్రింది మీద అను స్థితులను ఆక్రమించెను. ]

పైన పేర్కొన్న 21 బిందువులు శక్తికేంద్రములు. ఆ బిందువుల శక్తి హద్దును తెలుపునది అందలి సంఖ్యలు. మొదటి వృత్తము (I) మహాబిందువు నుండి ఉద్భవించినది. దాని సంఖ్యా సంకేతము 9.

మంత్రబీజం మంత్రపదము కంటె బలమైనది. సంఖ్య బీజంకంటే గొప్పది. సంఖ్యకంటే యంత్రము గొప్పదని పూర్ణ మీమాంస చెబుతున్నది.

**పదబీజా సంఖ్యాం రేఖాణాముత్తరోత్తరం బలీయః।** (పూ.మీ. 5-5)

సూత్రము : స ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి

సూత్రము : సంఖ్యా చా భవన్మాతృకాచా (బ్రహ్మకల 5-22, 23)

తాను అనేకముగా అగుదును అన్న ప్రథమ సంకల్ప సహిత (ఈక్ష్యత్యాత్మక) బిందువు సంకల్పము వలన సంఖ్యలు, మాతృకలు ఏర్పడినవి.

శ్రీకలాయంత్ర ప్రధానకేంద్రము పరమేశ్వరీ స్థానము. అది 9 చే సూచితము. బ్రహ్మము నామము ఓం. ప్రధానకేంద్ర బిందువు ప్రణవాత్మకము. ఇది సృష్టికి మూలమైన బ్రహ్మ పదార్థము. తక్కిన ఎనిమిది సంఖ్యలు తొమ్మిదినుండి పుట్టినవే (అనుబంధము చూడుడు). ఆ ఎనిమిది సంఖ్యలు అష్టప్రకృతులను సూచించును.

శ్రీకలాయంత్రమే పరాత్పర రూప శ్రీచక్రము. ఇదియే పర, అపర అను చక్రములకు ప్రాతిపదిక. శ్రీకలాయంత్రము శివాశివ శక్త్యైక్య రూపము. ఎట్లనగా పరాశంభుః సదా పాతు లలితజన్మహేతుకః॥

**పరాశంభు:** – పరా అనగా శివా, శంభుః అనగా శివుడు అంటే శివశక్త్యైక్య రూపము. పై సూత్రము లలితాంబిక ప్రాదుర్భావమునకు కారణమైనది పరాశంభువు

అని తెల్పుచున్నది. ఈక్షత్యాత్మక మహాకారణ బిందువే పరాశంభు రూపము. శ్రీకలే దాని యంత్రరూపము. సర్వసృష్టికి సమిష్టిరూపమైన శ్రీచక్రము శ్రీకలాయంత్రము నుండియే ఆవిర్భవించినది. శ్రీచక్రదేవతయే లలితాంబ.

శ్రీకలాయంత్రము (పరాత్పర చక్రము) నుండి శ్రీమండలము, శ్రీచక్రము ఉద్భవించినవి. శ్రీ మండలము స్థూలరూపం; శ్రీచక్రము సూక్ష్మరూపము.

శ్రీకలాయంత్రములో రెండు పాదములు గలవు. ప్రథమ వృత్తము (I), దాని నాలుగు దిశలందలి నాలుగు వృత్తములు (II,III,IV,V) కలిసి అయిదు వృత్తాలు ప్రథమ భాగము. మధ్య వృత్తము (VI) బాహ్యావృత్తము (VII) కలిసి రెండవపాదము.

మొదటిపాదమే పంచబ్రహ్మాస్వరూపము. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు—పంచబ్రహ్మలు. వీరు సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహము అను పంచాకృత్యములకు కారణభూతులు.

సృష్టికర్త్రీ బ్రహ్మారూపా గోప్త్రీ గోవింద రూపిణీ।
సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ ।
సదా శివానుగ్రహదా పంచకృత్య పరాయణా॥ (లలితా స.నా.)

ఈ 5 స్థితులు ఉపాస్య బ్రహ్మలక్షణము. అట్టి బ్రహ్మ స్వరూపమునకు యంత్రరూపమే శ్రీకలాయంత్ర ప్రథమపాదము.

ఈ పంచబ్రహ్మలను సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులను ఈశ్వరుని పంచముఖాలుగా కూడ తీసికొనవచ్చును. ఈ పంచ వృత్తాత్మక శ్రీకల ప్రథమ పాదమే హిరణ్యగర్భ స్వరూపము. ఇది పురుషసూక్తములోని

తస్మాద్విరాడ జాయత విరాజో అధిపురుషః।
సజాతో ఽత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః॥

ను తెల్పుచున్నది.

పై మంత్రానికి సామాన్యముగా చెప్పుకొనే అర్థము క్రింద ఇవ్వబడినది —

పురుషుని నుండి విరాట్ అను బ్రహ్మాండము ఉద్భవించెను. దానినుండి మరల పురుషుడు జీవరూపుడై జన్మించెను. అట్లు జన్మించిన వానికి దేశకాలాది విభాగ మేర్పడినది. అందువలన అతడు వెనుక ముందులు, క్రిందిమీదులు అను స్థితులను అనుభవములోనికి తెచ్చుకొనెను.

విరాట్ అనగా విశేషముగా ప్రకాశించునది అని అర్థము. మొట్టమొదట ఒక వెలుగు ముద్ద ఏర్పడును. అది దాని చుట్టూ ఉన్న చీకటికన్న భిన్నమై ఒక నూతన అనుభూతిని కలిగి యుండును. దానికి తను ఉన్నానని జ్ఞప్తి కలుగును. అదియే ప్రతి సృష్టి ప్రథమ సంకల్పము. మొదటి వెలుగే రాబోవు సృష్టికి మొదటి వెలుగై పుట్టబోవు జీవుడు నేర్చుకొన బోవు జ్ఞానముగా ఏర్పడును. అందుండి జీవుడు వివిధ రూపములలో జన్మించి ఈ జ్ఞానమును నేర్చుకొని సంసారమనబడు వృక్షముగా విచ్చుకొనును. ''పశ్చాత్పురః'' వలన భూత భవిష్యత్ కాలముల భాసయు కలిగినదని భావము. అంతేకాక తూర్పు పడమరలు మొదలగు దిక్కుల పరిచ్ఛేదము కలిగినది.

శ్రీకలాయంత్రములోని ప్రథమపాదము పంచవృత్తములు (I,II,III,IV,V) హిరణ్యాగర్భ స్వరూపము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. పూర్వ | తూర్పు వృత్తము | (II) | - | శిరస్సు |
| 2. దక్షిణ పక్షము | దక్షిణ వృత్తము | (III) | - | కుడి భాగము |
| 3. ఉత్తర పక్షము | ఉత్తర వృత్తము | (V) | - | ఎడమ భాగము |
| 4. పుచ్ఛము | అధోవృత్తము | (IV) | - | అధోభాగము |
| 5. ఆత్మ | మధ్య వృత్తము | (I) | - | ఆత్మ స్థానము |

వీనిని తైత్తిరీయమందు

''తస్య ఇదమేవ శిరః అయందీక్షణః పక్షః అయముత్తరపక్షః ఇదంపుచ్ఛం ప్రతిష్ఠా'' అని చెప్పబడినది.

ఈ పంచవృత్తములలో మధ్య వృత్తమును ఆనందమయ కోశముగా నెంచి మిగిలిన వృత్తములను మిగిలిన కోశములుగా భావింపవచ్చును.

శ్రీకలాయంత్రములోని రెండవ పాదములోని బాహ్యావృత్తము (VII) సదాశివ మండలమును సూచించును. సృష్టికి కారణమైనది బ్రహ్మము. అదే సత్పదార్థము అదే సదాశివ.

ఉపనిషత్తులు ఈశ్వర పదముచే సూచించేదంతయు సదాశివుడే.

**ఈశావాస్యమిదగ్ం సర్వమ్॥** (ఈ.ఉ.ప)

**అఖండమండలాకారం విశ్వం వ్యాప్య వ్యవస్థితం**
**త్రైలోక్యం మండితం ఏన మండలం తత్సదాశివం॥** (మేరుతంత్రము)

ఆ సదాశివుని యంత్రమే శ్రీకలాయంత్రములోని బాహ్యావృత్తము (VII). పూర్ణమీమాంస, భగవద్గీత, పురుషసూక్తము విరాట్ రూపమును వృత్తంగా చెప్పినవి.

వృత్త పరిధి అవిద్యను లేక మాయను సూచించును. పూర్ణము యొక్క అసలు రూపము కనబడకుండా చేయునది పరిధి. అదే మాయ. దానినే ఈశ్వర శరీరముగా భావిస్తారు. పూర్ణము వృత్తరూపముగాను, ఈశ్వరుని వృత్తంగాను చెప్పబడినది. కావున పూర్ణంను అంటే బ్రహ్మమును ఈశ్వరుని ద్వారానే సాధించాలి.

**సర్వతః పాణిపాదం। తత్సర్వతోక్షి శిరోముఖం।**
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మా వృత్య తిష్ఠతి॥** (గీత 13-13)

ఆ బ్రహ్మము కాళ్ళు, చేతులు, నేత్రములు, చెవులు, తలలు, ముఖములు కలిగి జగమునందు సమస్తమును ఆవరించి యున్నది.

మనకు ఈ చర్చలో వృత్తము చాల పర్యాయములు వచ్చుచున్నది. అట్టి వృత్తమును గూర్చి ఇక్కడ కొంత చెప్పుకొందాము. ఇది రేఖాశాస్త్ర పరిజ్ఞానము ఏమాత్రము లేనివారికి ఉద్దేశింపబడినది.

ఒక స్థిరబిందువుకు స్థిరదూరములో చలించే బిందువు యొక్క మార్గమును వృత్తము అందురు. స్థిరబిందువును కేంద్రము అందురు. స్థిర దూరమును వ్యాసార్థము (R) అందురు.



బిందుమార్గమే వృత్త పరిధి. వృత్త పరిధిపై రెండు బిందువులను కేంద్రము (O) ద్వారా కలుపు రేఖను వ్యాసము (D) అందురు. D=2R రెండు వ్యాసార్థములు ఒక వ్యాసమగును.

వృత్తము పరిధిపై లెక్కలేనన్ని (అనంత) బిందువులుండును. వీటిని శీర్షములు అనవచ్చును. అదే వృత్తము యొక్క సహస్రశీర్షత్వము. సహస్ర అంటే వేయి (1000) అనికాదు. అనేక, అనంత అని అర్థము.

వ్యాసమును ఆధారము చేసికొని వృత్తమును తిప్పిన సౌష్టవముగా తిరుగును. అప్పుడు వ్యాసమును సౌష్టవరేఖ అందురు. ఒక వృత్తములో అనంతవ్యాసములుండును. అనగా అనంత సౌష్టవ రేఖలురడును. ప్రతి వ్యాసమును బట్టి పరిధి యొక్క సౌష్టవమే సహస్రాక్షత్వము.

వృత్తపరిధిపై అనంతబిందువులుండునని చెప్పుకొన్నాము. ఆ బిందువులను వరుసగా కలుపుతూపోతే అనంత భుజి ఏర్పడును. (మూడు భుజములున్న త్రిభుజము; నాలుగు భుజములున్న చతుర్భుజి; ఎనిమిది భుజములున్న అష్టభుజి, సహస్ర భుజములున్న సహస్రభుజి, అనంత భుజములున్న అనంత భుజి). అనంతభుజియే వృత్త పరిధి అనునదే సహస్రపాదత్వము. (పాత్ అనగా భుజము లేక పాదము).

సహస్రశీర్ష, సహస్రాక్షీ, సహస్రపాద అనేవి వృత్తరీతిని తెల్పును. కనుక మహాబిందువు నుండి పుట్టినదే వృత్తము. ఇదే పురుష సూక్తములోని-

**సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్।**
**సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాఙ్గులమ్॥**

సహస్ర శీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్ - ఇది లలితాసహస్ర నామములోనిది.

సదాశివమే శ్రీమాతృ స్వరూపము. అదే ఆనందమయ స్వరూపము. ఆనందమయ శబ్దము ఉపాస్యాబ్రహ్మ వాచకమేకాని పరమాత్మక వాచకము కాదు. అనగా కృత్యాత్మక బ్రహ్మము.



శ్రీకలాయంత్రములో మూడు ఏక కేంద్ర వృత్తములున్నవి (I,VI,VII). వానిని మండల త్రయమందురు. ఇవి జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ అను మూడు అవస్థలను సూచించును. మధ్య (VI), బాహ్య (VII) వృత్తముల మధ్య అవకాశము జాగ్రదావస్థను సూచించును. అంతర్వృత్త (I) మధ్యవృత్త (VI) ముల మధ్య అవకాశము స్వప్నావస్థను సూచించును. అంతర్వృత్తములోని (I) కేంద్రముదాకా ఉన్న అవకాశము సుషుప్త అవస్థను సూచించును

బాహ్యావృత్తము (VII) సదాశివ మండలము. మధ్యవృత్తము (VI) లోకతార మండలము. అదే బ్రహ్మాండ మండలము లేక హిరణ్యగర్భ మండలము అని అందురు. సర్వజీవ సూక్ష్మశరీర సమిష్టి రూపమే హిరణ్య గర్భరూపము. లోపలి వృత్తము (I) దహర వృత్తమండలము. కేంద్రము నిర్వికల్ప ఆత్మరూపము. లోకతార అనగా కర్మఫలమును తరింపచేయునదని అర్థము. అంటే జీవులను కర్మఫలమునుండి తరింపజేయునది.

దహర వృత్తము విసర్గాత్మకము. విసర్గ అనగా రెండు బిందువుల సమాహారమని వాడుక. ఇక్కడ విసర్గ అనగా సృష్టి అని చెప్పుకొనవచ్చును. ఇంకా పూర్తి విశేషాలు కావాలంటే జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారి భగవద్గీత రహస్యము పేజి 16-19 చూచునది. దహర వృత్తవ్యాస భేదమువలననే మధ్య (VI) బాహ్యావృత్తము (VII)లకు స్థితి కలిగినది. దీనినుండే (I) మిగిలిన ఆరు వృత్తాలు జనించినవి. అందుకే అది విసర్గాత్మకము దహర వృత్తాన్ని (I)నాలుగు దిక్కులందు ఉన్న వృత్తాలు (II,III,IV,V) ఎనిమిది బిందువుల వద్ద ఖండించుచున్నది. ఖండన బిందువులు నాలుగు దిక్కులందు రెండేసి చొప్పున ఉన్నవి. తూర్పున (8,1), దక్షిణమున (7,2), పడమర (6,3), ఉత్తరము (5,4). ఒక్కొక్కటి ఒక్కొక్క విసర్గ తూర్పున బ్రాహ్మణ, దక్షిణమున క్షత్రియ, పశ్చిమమున వైశ్య, ఉత్తరమున శూద్ర విసర్గ సూచకము. ప్రణవాత్మకము కేంద్రము (9) సూచింపబడినది. అది పరమేశ్వర స్థానము. ఒకటి నుండి ఎనిమిది వరకు గల సంఖ్యలు 9 నుండి పుట్టినవి. (అనుబంధము చూడుడు). దహర వృత్తముపై నున్న ఎనిమిది సంఖ్యానాత్మక బిందువులు అష్ట ప్రకృతులను సూచించును. పంచభూతములు మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి అష్టప్రకృతులు. ఇంతవరకు తెలిసికొనిన శ్రీకలాయంత్రము సర్వజగత్స్వరూపము.

**అఖండమండలాకారం విశ్వంవ్యాప్యవ్యవస్థితమ్ ।**
**త్రైలోక్యం మండితా యేనమండలం తత్సదాశివామ్॥**

శ్రీకలాయంత్రములోని మండలములను గూర్చి తెలుసుకొందము. శ్రీకలా యంత్రములో సదాశివమండలము, లోకతార మండలము, దహర మండలములు ఉన్నవని చెప్పుకొన్నాము. ఈ మూడు మండలములకును మధ్యగల తలమునకు అంకమని పేరు.

లలితారహస్య నామస్తోత్రములో 21వ శ్లోకములో శివకామేశ్వరాంకస్థా అను నామమును తెలిసికొందము. ఈనామమందు శివశబ్దము సదాశివ మండలమును, కామ శబ్దముచే లోకతారా మండలమును, ఈశ్వర శబ్దముచే దహరమండలమును గ్రహింపవలెను. ఈ మూడు మండలముల పరిధులు మూడింటికిని మధ్యనుండు తల విశేషమునకు అంకమని పేరు. ఈ అంకమునకు శివుడు అని సంకేతము. ఈ అంకమునందు—శివకాముని అంకమందు అగ్రవృత్తము (II) పార్శ్వ వృత్తద్వయము (III,V) పుచ్ఛవృత్తము (IV) అను నాలుగు సమాన వృత్తములయందు (అగ్రబిందు పరికల్పితాననాం మధ్యబిందు యుగళ స్తనద్వయీాం, నాదబిందు కలికావృతాం పరాం నౌకి కామకలామయ సుందరీమ్) పరమేశ్వరి అధిష్టించియున్నది. కావున ఆమె అంకస్థా అయినది. తల మనబడు మూడు వృత్తములు శివకామేశ్వరుని అంకమై దానిపై అధివసించు నాలుగు వృత్తములు పరమేశ్వరి స్వరూపమైనందున పరమేశ్వరి శివకామేశ్వరాంకస్థా అని స్తుతింప బడుచున్నది.

ఇక్కడ 'చిదగ్నికూడ సంభూతా' యను నామ రహస్యము ఉపదేశింపబడుచున్నది. చిదగ్ని కుండమనగా శివకామేశ్వరుడే. సంభూతా అనగా అంకస్థా అనియే అర్థము.

చిదగ్ని కుండ సంభూతయగు శ్రీదేవికి శివా అనునది రహస్య నామము. ఇది దేవీ సప్తశతి యందు రెండవ అధ్యాయమున తెలుపబడినది. కేనోపనిషత్తునందు గూడ ఈ రహస్యము చెప్పబడినది. కేనోపనిషత్తు నందలి హైమావతీ బహు శోభమానా అను పదములచే ఈ శివాశబ్దము యొక్క రహస్యములు ఉపదేశింపబడినది. శివుడే ఆధారమైనది, కావునను సర్వకల్యాణములను, సర్వసంపదలను అనుగ్రహించునది కావునను శుభకరమైనది, శివాంకమున ఉండునది కావునను, శివునకు అభిన్నమైనది కావునను శివా అనబడుచున్నది. నిర్గుణుడగు పరమేశ్వరుని సగుణరూపమే శివా యనబడును.

శ్రీకలాయంత్రమున శివసూచితమైన వృత్తత్రయ ఆధారముపై వృత్త చతుష్టయ రూపమున అధివసించి యున్నది. కావున శివా అనబడుచున్నది.

శివుడు శక్తి అధీనుడు. పరమేశ్వరుని పేర పరమేశ్వరియే సకల జగన్నిర్వహణ జరుపును. పరమేశ్వరుడు ఉదాశీనుడుగా ఉండును. అందువలన పరమేశ్వరి వశుడైన భర్త గలది (స్వాధీనవల్లభా).

ఆధేయమైన శివుడు ఆధారమైన పరమేశ్వరికి స్వాధీనుడగుట సహజము. మా-యాశక్తి యగు పరమేశ్వరి వైదొలగి కటాక్షింపనిదే భక్తులకు పరమేశ్వర జ్ఞానప్రాప్తి కలుగదు. అందువలన పరమేశ్వరుడు ఆమె స్వాధీనుడు.

శ్రీచక్రమునందు బిందువు పరమేశ్వర సూచకము. త్రిభుజ చక్రము శక్తి సూచకము. బిందువు శక్తిరూపమైన త్రిభుజ చక్రమును ఆధారము చేసికొని యున్నందున స్వాధీన వల్లభా అయినది.

అంతర్వృత్తము (I) సూర్యమండలమును మధ్యవృత్తము (VI) బ్రహ్మాండ మండలమును బహిర్వృత్తము (VII) సదాశివమండలమును సూచించునని చెప్పుకొన్నాము. వీటిని వృత్తత్రయమందురు. వీటికి వళిత్రయమనునది సంజ్ఞ. శ్రీచక్రము, సుదర్శన చక్రాదులలో కనబడు వృత్తత్రయముల కెల్ల నిదియే భావము. సకల జగదాధార భూతమగు తత్త్వమును ఈ వృత్తత్రయము స్ఫురణకు తెచ్చును.

## శ్రీమండలము

పరం అను శ్రీచక్రమును శ్రీమండల మని అందురు.

దీనిలో లంబముగా పరస్పరము ఖండించుకొను రెండు దీర్ఘవృత్తములు వాటిని బాహ్యంగా స్పృశిస్తూ ఒక వృత్త ముండును. ఇది పరాత్పర శ్రీ చక్రమైన శ్రీకలా యంత్రము నుండి ఉద్భవించినది.



శ్రీమండలము



శ్రీమండలము ఏర్పడిన విధము

శ్రీకలాయంత్రము లోని ప్రథమ వృత్తము (I) (దహర వృత్తము)నకుకుడి ఎడమలనున్న వృత్తములను (III, V) మధ్య వృత్తము (VI) (లోకతార)ను ఆవరించిమూడింటిని స్పరిసిస్తూ అడ్డంగా ఒక దీర్ఘ వృత్త మేర్ప డినది. ఇదే విధంగా దహర వృత్తము (I)నకు పైన క్రింద ఉన్న వృత్తము (II, IV) లను మధ్య వృత్తము (VI)ను ఆవరించి మూడింటిని స్పరిసిస్తూ నిలువుగా ఇంకొక దీర్ఘ వృత్తము ఏర్పడినది. ఈ రెండు దీర్ఘ వృత్తములు ఒకదానికొకటి లంబముగా నున్నవి. ఈ రెండు దీర్ఘ వృత్తములకు సదాశివ వృత్తము (VII) ఆవృత్తంగా ఉన్నది. ఇట్లేర్పడిన యంత్రమే పరం అను శ్రీమండలము.

కేంద్రము (9) నుండి సదాశివ వృత్తపరిధివరకు సంకల్పశక్తి వ్యాపించి ఉండును. ఈ ప్రదేశమును అంకము అందురు. కేంద్రము బ్రహ్మము చుట్టూ ఉన్న ప్రదేశము త్రిగుణాత్మకమైన మాయాశక్తిచేత (శివకామేశ్వరీ) ఆవరింపబడి యుండును. ఆశక్తినే పరాశక్తి అందురు. అందువలననే మాయా వృతుడైన బ్రహ్మమును తెలిసికొనలేక పోవుచున్నాము. కేంద్రము బ్రహ్మము అంటే కామేశ్వరుడు. ఆయన చుట్టూ ఉన్న అవకాశము (సదాశివ పరిధి వరకు) శివకామేశ్వరీ మాయాశక్తి భావిత జగత్తు. అదే శివకామేశ్వరాంకము. జగత్తు మాయాశక్తి నిర్మితము. మాయాశక్తికి సదాశివనామక బ్రహ్మము—మహేశ్వరుడు అధిష్ఠానము. అంటే సదాశివుని ఆశ్రయించి మాయాశక్తి ఉండునేగాని మాయాశక్తికి స్వతంత్ర స్థితి లేదు. ఇదే భగవద్గీతలో చెప్పబడినది.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్॥** (భ.గీ. 7-25)

యోగమాయచే బాగుగా కప్పబడి యుండుటచే నేనందరకును కనబడును వివేకములేని జనులు నన్ను జనన మరణములు లేని వానినిగ తెలిసికొనజాలకున్నారు

ఈ శ్లోకము ఏడవ అధ్యాయములోని 13,17 గీతముల యొక్క వ్యాఖ్యానము.

పరమాత్మ యోగమాయచే గప్పబడి యుండుటచే జనులకు ఆయన కనబడుట లేదు. ఎవరామాయను వివేకాదులచే ఛేదింతురో వారు భగవంతుని గాంచగలరు. అంటే భగవంతునకును జనులకును మధ్య ఒక తెర ఉన్నది (మాయ). అది త్రిగుణాత్మకమైనది. దానిని ఎవరు భక్తి, జ్ఞానము మొదలగు సాధనలతో ఛేదించగలరో వారికి విలక్షణము, నిర్వికారము, నిరంజనము అగు బ్రహ్మము యొక్క పారమార్థిక స్వరూపము తెలియును.

**పరాశంభుః సదాపాతు లలితజన్మ హేతుకః।**

ఈ పరాశక్తి నుండియే లలితారూపమయిన శ్రీచక్రము ఉద్భవించినది.

శ్రీ మండలములో ఐదు ఖండములున్నవి. నాలుగు దిక్కులందు నాలుగు ఖండములు మధ్య వక్ర చతుర్భుజము. మధ్యఖండము ఆత్మభాగము. తూర్పుదిశలోని ఖండము శిరస్సు. ఉత్తరదక్షిణ దిశలలోని ఖండములు పక్షములు. అధోఖండము పుచ్ఛము.

జీవునియందలి ప్రతికోశములోను విభాగనిర్దేశము పైవిధముగానే ఉండును. జీవశరీరమును ఒక పక్షి శరీరముతో పోల్చుదురు. పక్షి తనగూడు చెడిపోతే ఆగూడును వదలిపోతుంది. అదేవిధంగా శరీరమనే గూడును విడిచిపోవు జీవుని ధర్మమును అన్యాపదేశంగా సూచిస్తున్నారు.

పరస్పర లంబంగా రెండు దీర్ఘవృత్తములు ఉండి అవి వృత్తముచే ఆవృత్తమై ఉండు చక్రమును శ్రీమండలమని చెప్పుకొన్నాము. గణితము తెలిసినవారికి వృత్తానికి దీర్ఘవృత్తానికి ఉన్న సంబంధము తెలియును. దీర్ఘవృత్తము యొక్క ఉత్కేంద్రత సున్న అయినపుడు అది వృత్తమగును. దీర్ఘవృత్తమునకు ఒక కేంద్రము రెండు ప్రధాన నాభులు ఉండును మూడు ప్రధాన కేంద్రములు కలిగి నాశరహితమైనదే కాలము. దీనిలో విశ్వములోని లోకములు మనకు కనబడే జగత్తు వర్థిల్లుచున్నది. దీనినిబట్టి దీర్ఘవృత్తము జగత్తుకు సంకేతమని తెలియుచున్నది. అట్టి దీర్ఘవృత్తములు సదాశివ వృత్తముచే పరివృత్తమై ఉన్నది. జగత్తులోని ఎట్టి కదలికయైన సదాశివ ప్రేరితము. ఈ కదలికలకు కల అని పేరు కావున జగత్తు అంతయు సదాశివకల

# నవావరణాత్మక శ్రీచక్రము

ఇంతవరకు పరాత్పర (శ్రీకలా), పరరూప (శ్రీమండలము) శ్రీచక్రములను గూర్చి రేఖామాత్రంగా తెలిసికొన్నాము. ఇక అపర శ్రీచక్రమును గూర్చి తెలిసికొందాము. అపరరూప శ్రీచక్రములు రెండు విధములు :

1) నవావరణ శ్రీచక్రము, 2) మహా సుదర్శన యంత్రము.

ముందుగా నవావరణ శ్రీచక్రమును గూర్చి తెలిసికొందాము.

తత్ర బిన్దుత్ర్యస్ర దశ దశ మన్వస్ర నాగస్వరదళ వృత్తత్రయ భూపురాత్మకం హి శ్రీచక్రమితి విజ్ఞాయతే॥

ఇది శ్రీవిద్యా శంకరపదమాఉఉ వేశ ప్రకాశిత శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరులు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారి బ్రహ్మకలలోనిది. సర్వదేవతా సమిష్టిరూపము, సర్వజగద్రూపమైన శ్రీచక్రమందలి ఆవరణలు ఈ సూత్రములో తెలుపబడినవి.

బిందువు, త్రికోణం, అష్టకోణం, దశకోణం, పదునాలుగు కోణములు (మన్వస్రం) అష్టదళములు (నాగదళం), షోడశదళములు (స్వరదళములు), మూడు వృత్తములు, మూడు భూపురములు కలిగిన యంత్రమే నవావరణ శ్రీచక్రము.

ఇక్కడ ఒక విషయము ప్రత్యేకముగా తెలుసుకోవాలి. షోడశదళము, భూపురముల మధ్య మూడు వృత్తములను గీయుట కొన్ని సంప్రదాయముల పద్ధతి. విద్యారణ్యస్వామి, హాదివిద్యాను పాటించేవారు వృత్తత్రయమును షోడశదళము భూపురత్రియముల మధ్య గీయరు. అక్కడఒకే వృత్తమును గీస్తారు. శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకర సంప్రదాయములో వృత్తత్రయమనగా పదునాలుగు కోణముల ఆవృత వృత్తము, అష్టదళ ఆవృతవృత్తము, షోడశదళ ఆవృతవృత్తములే వృత్తత్రయము. శ్రీ విద్యారణ్యులు పోతపోయించిన శ్రీచక్రమునకు ఇదేవిధంగా వృత్త త్రయమున్నది. అంతేకాక షోడశదళం తరువాత వేరుగా మూడు వృత్తములు లేవని

వాటిస్థానములను గూర్చి ఏ మాత్రము అనుమానము కలుగుటకు ఆస్కారము లేకుండ శ్రీవిద్యారణ్యులు శ్రీచక్ర ఉద్ధారశ్లోకములో సెలవిచ్చారు.

**బిందు త్రికోణ కాష్టా అవతారయుగ లోకపత్ర వృత్తయుతం।**
**వసుదళ వృత్త కళాదళ వృత్త త్రిమహీగ్రహం భజే చక్రమ్॥**

- శ్రీ విద్యారణ్యులు -

బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణము దశకోణము, చతుర్దశ కోణము, వృత్తము, అష్టదళము, వృత్తము, షోడశదళము, వృత్తము భూపురత్రయము గలదే శ్రీచక్రము.

సంకల్ప సహితమైన మహాబిందువు శ్రీకలాయంత్రమైనది. దానినుండి కారణ రూపము శ్రీమండలముగాను, కార్యరూపము శ్రీనవావరణ శ్రీచక్రముగాను రూపుదిద్దుకొన్నవి. అంటే శ్రీచక్రమునకు మూలము శ్రీకలాయంత్రము.



శ్రీచక్రవములో కోణభాగవము, దళభాగవము గలవు. శ్రీచక్రవమునందలి కోణభాగమంతయు శ్రీకలాయంత్రములోని లోకతార (VI) వృత్తము లోపలి యంత్రభాగ పరిణామము శ్రీచక్రములోని అంతర్వృత్తములో 5 త్రిభుజములు ముందు ముఖముగా, 4 త్రిభుజములు వెనుక ముఖంగా ఉన్నవి. 5 త్రిభుజములు శివా (శక్తి) త్రిభుజములు, 4 త్రిభుజములు శివత్రిభుజములు అవి పరస్పరము ఖండించుకొని ఉభయాత్మకమైన (శివా—శివ) 43 త్రిభుజములు ఏర్పడుచున్నవి

శ్రీకలాయంత్రములోని లోకతార (VI) వృత్తము శ్రీచక్రములోని కోణభాగమునకు ఆవృతముగానున్నది. దీనిమీదనే అష్టదళమేర్పడినది. అష్టదళంలోని ప్రతిదళ కేంద్రము అంతర్వృత్తము (లోకతార) పైనే ఉండును. అష్టదళమును ఆవృతము చేస్తు ఉన్న వృత్తమే శ్రీకలాయంత్రములోని సదాశివ వృత్తము. దీనిపైననే షోడశదళము లుండును. ప్రతిదళము కేంద్రము సదాశివ వృత్తపరిధిపైననే ఉండును. షోడశదళ ఆవృత వృత్తమునకు కల్యాణ వృత్తమని పేరు.

ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మబ్రహ్మ అను నాలుగు మహావాక్యములు ప్రజ్ఞాన ఘన బ్రహ్మమును తెల్పును శ్రీకలాయంత్రములో కేంద్రము నుండి లోకతారవృత్తము వరకుగల భాగము ప్రజ్ఞానఘన బ్రహ్మము. లోకతార దహర వృత్తముల మధ్యభాగము ఈక్షత్యాత్మక ప్రథమ సంకల్పము కార్యరూపాము చెందుటకు పూర్వము ఉన్న స్థితిని తెల్పును. లోకతార సదాశివ వృత్తముల మధ్య భాగము జగత్తుగా పరిణామము చెందిన భాగము.

శ్రీచక్రమందలి కోణభాగ రచన అంతయు లోకతార వృత్తముమీద ఆధారపడి యున్నది. అందువలన లోకతారవృత్తము అధిష్ఠానము. దాని పరిధిపై అష్టదళము లుండును. కావున అష్టదళములకు లోకతార వృత్తమే అధిష్ఠానము. అష్టదళ ఆవరణశక్తుల క్షేత్ర వ్యవధి సదాశివవృత్తము. షోడశదళములు సదాశివవృత్తముపైన ఉండును. కావున షోడశ దళములకు సదాశివవృత్తము అధిష్ఠానము. షోడశదళ ఆవరణశక్తుల క్షేత్ర వ్యవధి ఆవృత వృతమైన కల్యాణ వృత్తము. ఈ మూడు వృత్తములే శ్రీచక్రమునకు సర్వాధిష్ఠా నములు. బిందువు వృత్తత్రయం లేకుండా శ్రీచక్రములోని కోణములకు,

దళములకు ఉనికి లేదు. కాని కోణములు, దళములు లేకుండ బిందు, వృత్తత్రయములకు స్థితి కలదు.

శ్రీచక్రములోని వృత్తత్రయము కేంద్రబిందువు నుండి ఉద్భవించినవి. బిందువునకు వృత్తమునకు అభేదమని చెప్పుకొన్నాము. కావున శ్రీచక్రమందలి ఏకకేంద్ర వృత్తత్రయమునకు కేంద్రబిందువుకు అభేదము. లోకతార, సదాశివ, కల్యాణ వృత్తముల (వృత్తత్రయం) పైనే కోణ, దళభాగములు అధ్యస్థములు. కావున బిందువు, వృత్తత్రయము కామేశ్వరరూపము. కోణదళ భాగములు శక్తి భాగములు. అనగా కామేశ్వరీ స్వరూపము.

ఇక శ్రీచక్రములోని నవావరణలను గూర్చి క్లుప్తముగా చెప్పుకొందాము. మొదటి భాగములో కొంత చెప్పుకొన్నాము. మరల కొంత ఇక్కడ చెప్పుకొందాము. ఇది ఎంత చెప్పినా ఇంకా ఉంటూనే ఉంటుంది. అయితే రెండుచోట్ల ఎందుకు అనే ప్రశ్న వస్తుంది. ఈ వ్యాసము శ్రీచక్రమును గూర్చి ఏమీ తెలియని వారికోసము ఉద్దేశింప బడినది. కొన్ని వియషయములు పునరావృత్తమైనవి. ఇటువంటి మహత్తర విషయ మును ఒక సామాన్యుడు ఇంకొక సామాన్యునికి చెప్పేటప్పుడు ఇది తప్పదు. ఇక అసలు విషయానికి వద్దాము. కొందరు ప్రముఖులు శ్రీచక్రోద్ధారమును గూర్చి వ్రాసిన శ్లోకములు క్రింద ఇవ్వబడినవి.

## 1. త్రిపురతాపిన్యోపనిషత్తు :

బిందు త్రికోణ వసుకోణ శరీరయుగ్మ
మన్వస్త్ర నాగదళ షోడశపత్ర యుక్తం।
వృత్తత్రయం చ ధరణీ సదనత్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయః॥

దీనిలోని వృత్తత్రయం అను పదమునకు గీర్వాణేంద్ర సరస్వతీ అను ప్రాచీనుడు ఈక్రింది విధముగా అర్థము చెప్పారు.

తత్రైతత్కల్పకారమతే వృత్తత్రయం చేత్యత్రోక్త వత్త త్రయం తు మన్వస్ర నాగదళ షోడశార మర్యాదాకరణ వృత్తత్రయమేవ నపృథక్ వృత్తాత్రయమ్॥

(ప్రపంచసార సంగ్రహమ్)

## 2. గౌడపాదచార్యైస్సుభగోదయే

త్రికోణై రష్టారం త్రిభిరపి దశారం సముద భూ
ద్దశారం భూవేశ్మదపి చ భువనాశ్రం సమభవత్।
తతో ఽభూన్నాగారం నృపతిదళమస్మాత్త్రివలయం
చతుర్ద్వాః ప్రాకార త్రితయ మిదమేవాంబ శరణమ్ ॥ (సుభగోదయమ్)

## 3. శ్రీశంకర భగవత్పాదాచార్యైః

చతుర్భిః శ్రీకంఠైశ్శివ యువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభిశ్శంభోర్నవ భిరపి మూలప్రకృతిభిః
చతుచత్వారింశ ద్వసుదళ కళాత్రివలయ
త్రిరేఖాభిస్సార్ధం తవశరణ కోణాః పరిణతాః ॥ (సౌన్దర్యలహరి)

## 4. శ్రీకల్యాణానంద భారతీ

తత్తబిన్దు త్ర్యష్ట దశదశ మన్వస్ర నాగస్వరం
దళవృత్తత్రయ భూపురాత్మకంహి శ్రీచక్రమితి విజ్ఞాయతే ॥ (బ్రహ్మకలా)

## 5. శ్రీవిద్యాశంకర భారతి (విద్యారణ్యులు)

బిందుత్రికోణకాష్టా అవతారయుగ లోకపత్ర వృత్తయుతం।
వసుదళవృత్త కళాదళ వృత్త త్రిమహీగృహం భజే చక్రమ్ ॥

ఈ శ్లోకములలో కొన్ని పదముల సంకేతములు, మను = మనువుల సంఖ్య 14; స్వర= అచ్చుల సంఖ్య 16; నాగ = నాగముల సంఖ్య 8; వసు = వసువుల సంఖ్య 8.

**బిందువు :** శ్రీచక్రములోని కేంద్రబిందువు నిర్గుణ అవ్యక్తబ్రహ్మము. సత్యము, జ్ఞానము, అనంతము దాని లక్షణములు. ఈ బిందువు ఈక్ష్యత్యాత్మకమైనపుడు అనగా తాను రెండుగా అగుదును అను సంకల్ప స్థితిని చెందినపుడు శివశక్త్యైక్యరూపము. అంటే కామ కామేశ్వర రూపము. అప్పుడు సత్యము, జ్ఞానము, అనంతము అను బ్రహ్మము యొక్క లక్షణములు ఒక్కొక్కటి రెండుగా విడిపోవును. అవి :

1. అలుప్తత, స్వతంత్రత - సత్యము యొక్క లక్షణములు
2. సర్వజ్ఞత, అనాది బోధలు - జ్ఞాన లక్షణములు
3. అనంతత, నిత్యతృప్తత - అనంత లక్షణములు

వీనిలో అలుప్తత, సర్వజ్ఞత, అనంతత కామేశ్వరుని లక్షణములు. మిగిలిన మూడు స్వతంత్రత, అనాదిబోధ, నిత్యతృప్తత కామేశ్వరీ లక్షణములు. ఈ ఆరు బింద్వావరణ లో పూజింపబడుచున్నవి.

ఈక్ష్యత్యాత్మక బిందువు అంటే కామ కామేశ్వరీ ఉభయ రూపాత్మకమైన బిందువు. దాని నుండే మిగిలిన శ్రీచక్రభాగములైన కోణములు దళములు పుట్టినవి. కావున అందలి శక్తులన్నియు కామకామేశ్వరీ విభూతులే.

శ్రీచక్రములోని ఒక్కొక్క ఆవరణకు (1) ప్రకృతి, (2) బీజం, (3) శక్తి, (4) ప్రభ, (5) వర్ణం, (6) యోగినీదేవత, (7) ముద్ర, (8) చక్రేశ్వరి, (9) ఫలము అని తొమ్మది లక్షణములుండును.

శక్తి—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అని మూడు విధములు సృష్టికి మొట్టమొదట పరతత్త్వములో కలుగు స్పందనమే ఇచ్ఛాశక్తి. ఇదియే సృష్టికి భగవానుని సంకల్పము. సృష్టికి కావలసిన సామగ్రి సంపాదనకు చేయు వ్యాపారమే జ్ఞానశక్తి. విశ్వమును రూపొందించు శక్తియే క్రియాశక్తి. ఇట్టి క్రియాశక్తి పంచ కృత్యములను [1. సృష్టి కర్తృత్వము; 2. గోప్తృత్వము, 3. సంహారత, 4. తిరోధానత, 5. అనుగ్రహిత్వం] నిర్వహించు చున్నది. ఈ ఇచ్ఛాశక్తియే శ్రీదేవి యొక్క తాత్త్వికరూపము. ఇచ్ఛ, కామ, సంకల్ప పదములు సమానార్థకములు. కావున కామాత్మకమగు శక్తిలోగల పరమేశ్వరుడు కామేశ్వరుడు. ఆ శక్తియే కామేశ్వరి. ఈ ఆవరణకు సర్వానంద చక్రమని పేరు. ఈ ఆవరణ బిందుప్రకృతిక; పరాపర రహస్యయోగిని, సర్వయోనిముద్ర; శాంతి రసము; ఈక్షత్యాత్మకశక్తి; ప్రభ—ఉద్యత్సూర్య సహస్రాభ (ఉదయ సూర్యుని సహస్రకాంతి); వర్ణం '0' (బిందువు) మహాకామేశ్వర్యంబ చక్రేశ్వరి; ఫలితము - సర్వానందము.

ఇక్కడే (బిందువు) కామేశ్వరి కామేశ్వరునితో సర్వానందముతో నుండును (వారిద్దరిలో ఒకరు లేక ఇంకొకరు లేరు కావున). అనగా బిందువు శివశక్త్యాత్మకము. ప్రకాశవిమర్శ సామరస్యరూపమగుట వలన సర్వానంద చక్రమైనది.

**2. త్రికోణచక్రము :** శ్రీచక్రములో బిందువు తరువాత ఉన్న ఆవరణ త్రికోణ చక్రము. త్రికోణము త్రిగుణములను తెల్పును 1) సత్త్వగుణము, 2) రజోగుణము, 3) తమోగుణము ఈ మూడు గుణముల కలయికే ప్రకృతి. కనుక ఇది సమబాహు త్రిభుజి (సమబాహు త్రిభుజము మూడు భుజములు సమానము). ఇది వేదాంత ప్రకృతిని తెల్పును. త్రిభుజము ప్రకృతియందలి విక్షేపమును తెలుపును. విక్షేపము అవిద్య లేక మాయ యొక్క ఒక శక్తిరూపము. విక్షేపమనగా సద్వస్తువునందు పట్టుచిక్కక చిత్తము అన్యాయత్తమగుట లేక చెదరిపోవుట అని అర్థము. సృష్టి, స్థితి, లయములకు మూలకారణము సంకల్పము ఇవి మాయా లక్షణములు. ఎండ మావిలో నీరు చూచుటకు, తాడును పాము అనుకొనుటకు అవిద్యయే కారణ ము జ్ఞానము కలిగి నపుడు (అవిద్య తొలగినపుడు) ఎండమావియందలి నీరు, తాడు లోని సర్పభ్రాంతి లయమగుచున్నవి. కావున కామేశ్వరీ దేవత యొక్క, లేనిదానిని ఉన్నట్లు భావన కలుగచేయు (భ్రాంతిని కలుగచేయు) సామర్థ్యమును విక్షేపము అందురు.

మహాబిందువునందు సంకల్పము లేదు. సంకల్పము చేత గుణము ఏర్పడును. గుణ సహిత బిందువే వృత్తము. వృత్తము ఏకగుణాత్మకము. దీనినుండే త్రిగుణాత్మక (గుణం=కోణం) మైన త్రిభుజము పుట్టినది ఈ త్రికోణం మూలముగానే అన్ని చక్రములు ఏర్పడినవి. కావున త్రిభుజము మాయయొక్క మొట్టమొదటి యంత్ర సంకేతము.

నాదము త్రిగుణాత్మకము. అంటే నాదమునకు యంత్ర సంకేతము త్రికోణము. నాద రూపమైన త్రికోణము మాతృకారూపము. అందుకే అహమాత్మకమందురు.

నాదము నోటినుండి వర్ణరూపములో వెలువడుటకు ముందు నాలుగు స్థితులను పొంది ఉండును. అవి పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరి. ఉచ్చారణ స్థితిలో ఉంటుంది. ఈ నాలుగు రూపములకు జన్మస్థానమేది అన్న విషయములో స్వల్పాభిప్రాయ భేద మున్నది. ఈ విషయము ప్రథమ భాగములో చర్చించబడినది. వాగ్దేవతకు పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి అని నాలుగు స్థానములు. వీనిలో మూడు గుప్తముగా నున్నందున మనము తెలుసుకొనలేము. నాల్గవది అగు వైఖరి మాత్రము వాక్కుచే ఉచ్చరింపబడుచు

న్నది. ఉచ్చారణకు సంకల్పము మూలాధారమందు పరా అను స్థితిలో నుండును అని కొందరు, సహస్రారము అని మరి కొందరు అందురు. ఈనాదము పశ్యంతీ, మధ్య మారూపములలో పరిణామము చెంది వైఖరీస్థితిలో నోటి నుండి వర్ణరూపములో వెలు వడుతుంది. అందుచే ప్రతి వర్ణమునకు మొదలు మూలాధారమందలి పరానాదమే. మూలా ధారమునకు యంత్ర సంకేతము త్రికోణము. కనుక నాదము త్రికోణాత్మకము; త్రిగు ణాత్మకము అనగా నాదమునకు యంత్ర సంకేతము త్రికోణము.

త్రికోణ చక్రమును యోనిచక్రమని, శక్తి చక్రమని, జీవచక్రమని కూడా అందురు. త్రికోణ చక్రమునకే గేయ చక్రమని సంజ్ఞ కలదు. త్రికోణము సత్త్వరజస్తమో గుణ ములను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలను, వాగ్భవకామ రాజశక్తి కూటములు, లోకత్రయం, అవస్థాత్రయం, శరీరత్రయం (స్థూల, సూక్ష్మ కారణ శరీరములు) కాలత్రయం ఇలాంటి త్రికూటములుగా భావింపవచ్చును.

ఈ ఆవరణకు సర్వసిద్ధిపద చక్రమని పేరు. ఈ ఆవరణ నాదప్రకృతి; అతిరహస్య యోగిని; సర్వబీజముద్ర; అద్భుతరసం; త్రిగుణాత్మక శక్తి; ప్రభ-బంధూక కుసుమం; వర్ణం అః, (అహమాత్మకము); త్రిపురాంబా చ్రకేశ్వరీ! ఫలితము - సర్వసిద్ధిప్రదము

త్రికోణము సృష్టి, స్థితి, సంహారక హేతువగుట వలన సర్వసిద్ధిమయ చక్రమని పేరు.

త్రికోణము యొక్క అగ్రకోణమునుండి వామావర్తంగా శ్రీమహాకామేశ్వరీ, శ్రీ మహావజ్రేశ్వరీ, శ్రీమహాభగమాలినీ అనుననవి కోణదేవతలు. త్రికోణమునకు బయట నాలుగు దిక్కులందు (పశ్చిమాది దిక్కు క్రమేణ) బాణశక్తి, ధనుశ్శక్తి, పాశశక్తి, అంకుశశక్తి అను ఆయుధదేవతలు ఉందురు.

బిందు, త్రికోణదేవతలు నలుగురిని కలిపి చతుస్సమయ దేవతలందురు. బిందు త్రికోణ ఆవరణలను రెండిటిని కలిపి బిందు చక్రమందురు.

## వసుకోణము (అష్టకోణము) :

త్రికోణము తరువాత వసుకోణము. వసువులు ఎనిమిది మంది. అందుచే వసుకో ణమంటే ఎనిమిది కోణములని అర్థము. ఈ ఎనిమిది కోణములు అష్ట ప్రకృతులను సూచించును. అష్టప్రకృతులు 1) భూమి, 2) నీరు, 3) అగ్ని, 4) వాయువు, 5) ఆకాశము, 6) మనస్సు, 7) బుద్ధి, 8) అహంకారము.

వసుకోణము అష్టప్రకృతులనే కాక సృష్టిలోని అష్ట విధాత్మకమయిన అన్ని విధము లైన ప్రకృతులను సూచించును.

శ్రీయాగంలో అష్టమూర్త్యాత్మకము అని ఉన్నది. అష్టమూర్తి అంటే శివుడు. అష్ట మూర్తులు పంచభూతములు, సూర్యుడు, చంద్రుడు, పురుషుడు. ఈ విధంగా కూడ వసుకోణములను చెప్పుకొనవచ్చును.

ఈ ఆవరణకి సర్వరోగహర చక్రమని పేరు. ఈ ఆవరణ కకారప్రకృతి; రహస్య యోగిని; సర్వఖేచరీ ముద్ర; హాస్యరసం; అష్టమూర్త్యాత్మక శక్తి; ప్రభ-పద్మరాగ; వర్ణం-య నుండి హ వరకు; త్రిపురా సిద్ధాంబ చక్రేశ్వరి; ఫలితము సర్వరోగహరము.

స్వాభిముఖకోణము నుండి వామావర్తముగా కోణదేవతలు: 1) వశినీ, 2) కామేశ్వరీ, 3) మోదినీ, 4) విమలా, 5) అరుణా, 6) జయినీ, 7) సర్వేశ్వరీ, 8) కౌలినీ.

ఈ ఆవరణకు సర్వరోగహర చక్రమని పేరు. భేదము లక్షణముగా గలవియు, షట్త్రింశ తత్త్వాత్మకమైన దంతయు 'రోగ' శబ్దముచే తెలుపబడును. అభేదప్రతీతి ద్వారా భేద లక్షణమును హరించునది గాన ఇది సర్వరోగహరచక్రము.

ఈ వసుకోణ చక్రము కిరిచక్రమను సంజ్ఞ కలది. (కిరిచక్రరథారూఢ దండనాథా పురస్కృతా - ల.ర.స్తోత్రం). మహాత్రికోణము యొక్క నైరృతి కోణమున అర్చింపబడు భగమాలినీదేవి వారాహి సంజ్ఞకలది. వారాహి అమ్మ యొక్క దండనాయకి.

బిందు, త్రికోణ, వసుకోణ చక్రములను కలిపి సృష్టి చక్రమందురు.

## 4. అంతర్దశారము :

అష్టకోణము తరువాత అంతర్దశారము అను పదికోణముల చక్రము. ఇది పదిప్రాణములకు సంకేతము. అవి 1) ప్రాణ, 2) అపాన, 3) వ్యాన, 4) ఉదాన, 5) సమాన, 6) నాగ, 7) కూర్మ, 8) కృకర, 9) దేవదత్త, 10) ధనంజయ.

ఈ ఆవరణ రేఫ ప్రకృతి; నిగర్భయోగిని; సర్వమహాంకుశ ముద్ర; రౌద్రరసము; దశకలాత్మక శక్తి; ప్రభ-జపాకుసుమం; వర్ణం-ట నుండి న వరకు; త్రిపురమాలినీ దేవి చక్రేశ్వరి; ఫలితము-సర్వరక్షాకరము.

స్వాభిముఖ కోణమునుండి వామావర్తముగా కోణదేవతలు 1) సర్వజ్ఞ, 2) సర్వశక్తి, 3) సర్వైశ్వర్యప్రదా దేవి, 4) సర్వజ్ఞానమయి, 5) సర్వవ్యాధి వినాశినీ, 6) సర్వాధారా స్వరూప, 7) సర్వపాపహరీ, 8) సర్వానందమయీ, 9) సర్వరక్షా స్వరూపిణి, 10) సర్వేప్సితార్థప్రదా.

ఈ ఆవరణకు సర్వరక్షాకర చక్రమనిపేరు. ప్రతికూల పదార్థమును విడుచుటయే రక్షణము. షట్త్రింశత్ తత్త్వాత్మకమైన దంతయు సాధకునికి ప్రతికూలమే. షట్త్రిం శత్ తత్త్వాత్మకమైన ఈ ప్రపంచము నుండి 'శివో ఽహం' (నేను పరదేవతా స్వరూపుడ ను) అను భావనా లక్షితమైన రక్షణమును చేయునదిగాన సర్వరక్షాకర చక్రము.

## 5. బహిర్దశారము :

అంతర్దశారము తరువాత బహిర్దశారము అను మరల పదికోణముల చక్రము. ఇది పది ఇంద్రియములకు సంకేతము. అవి ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియ ములు. జ్ఞానేంద్రియములు. 1. చర్మము, 2. చక్షువు (కన్ను), 3. శ్రోతం (చెవి), 4. జిహ్వ (నాలుక), 5. ఘ్రాణ (ముక్కు). కర్మేంద్రియములు 1. వాక్కు, 2. పాణి, 3. పాదం, 4. పాయువు, 5. ఉపస్థ.

ఈ ఆవరణకు సర్వార్థసాధక చక్రమని పేరు. ఏకార ప్రకృతి; కులయోగిని; సర్వోన్మాదినీ ముద్ర; భీభత్సరసము; దశావతారశక్తి ప్రభ-సిందూరం, వర్ణం-క నుండి ఞ వరకు; త్రిపురాశ్రీ చక్రేశ్వరి; ఫలితము సర్వార్థ సాధకం.

స్వాభిముఖ కోణమునుండి వామావర్తముగా కోణదేవతలు 1) సర్వసిద్ధి ప్రదాదేవి, 2) సర్వసంపత్ప్రదాదేవి, 3) సర్వప్రియంకరీ దేవి, 4) సర్వమంగళకారిణీ దేవీ, 5) సర్వకామ ప్రదాదేవి, 6) సర్వదుఃఖ విమోచనీ దేవి, 7) సర్వమృత్యు ప్రశమనీ దేవి, 8) సర్వవిఘ్న నివారణీ దేవీ, 9) సర్వాంగసుందరీ దేవి, 10) సర్వ సౌభాగ్యదాయినీ దేవీ.

## 6. మన్వస్రం (చతుర్దశారము) :

బహిర్దశారము తరువాత మన్వస్రం. మనవులు పదునాలుగు మంది. అందువలన మన్వస్ర చక్రమంటే 14 కోణములని అర్థము. ఇది పదనాలుగు లోకములను

తెలుపును. అవి: 1) భూలోకము, 2) భువర్లోకము, 3) సువర్లోకము, 4) మహర్లోకము, 5) జనోలోకము, 6) తపోలోకము, 7) సత్యలోకము. ఈఏడు ఊర్ధ్వ లోకములు, 8) అతల, 9) వితల, 10) సుతల, 11) మహాతల, 12) తలాతల, 13) రసాతల, 14) పాతాళం అను ఈ ఏడు అధోలోకములు.

ఈ ఆవరణకు సర్వసౌభాగ్య చక్రమని పేరు. ఈ కారప్రకృతి; సంప్రదాయ యోగిని; సర్వవశంకరీ ముద్ర, భయానక రసం; చతుర్దశ భువనాత్మకశక్తి, ప్రభ-దాడిమీ కుసుమం. వర్ణం-'అ' నుండి 'ఔ' వరకు హ్రస్వములు, 'ప' నుండి 'మ' వరకు; త్రిపుర వాసినీ దేవి చక్రేశ్వరి; ఫలితము - సౌభాగ్యప్రదము.

స్వాభిముఖము నుండి వామావర్తముగా పదునాలుగు కోణదేవతలు.

1) సర్వసంక్షోభిణ్యంబా, 2) సర్వవిద్రావిణ్యంబా, 3) సర్వాకర్షిణ్యంబా, 4) సర్వాహ్లాదిన్యంబా, 5) సర్వ సమ్మోహిన్యంబా, 6) సర్వస్తంభిన్యంబా, 7) సర్వజృంభిణ్యంబా, 8) సర్వవశంకర్యంబా, 9) సర్వరంజన్యంబా, 10) సర్వోన్మాదిన్యంబా, 11) సర్వార్థ సాధిన్యంబా, 12) సర్వసంపత్తి పూరణ్యంబా, 13) సర్వమంత్రమయ్యంబా, 14) సర్వద్వంద్వ క్షయంకర్యంబా.

## 7. వసుదళము (అష్టదళము) :

చతుర్దశారము తరువాత అష్టదళమను ఎనిమిది దళముల చక్రము గలదు. చతుర్ద శారము వరకు కోణములు; శక్తిభాగశ్రీచక్రము, అష్టదళము నుండి దళములు శివ భాగము. శ్రీవిద్యా మూలమంత్రమందలి మూడుకోటములకు కారణమైన ల,స,హ,ఈ,ఏ,ర,క,మ్ అను ఎనిమిది వర్ణములను ఎనిమిది దళములు తెల్పును.

ఈ ఆవరణకు సర్వసంక్షోభణ చక్రమని పేరు. 'హ' కారప్రకృతి; గుప్త తరయోగిని; సర్వాకర్షిణీముద్ర; కరుణరసము; అష్టమూర్త్యాత్మక శక్తి; ప్రభ-జపాపుష్పం, వర్ణం-అష్ట వర్గులు అంటే క,చ,ట,త,ప,య,శ వర్గులు, ళ,క్ష,లు; త్రిపుర సందరి చక్రేశ్వరి; ఫలితము సర్వసంక్షోభణము.

ప్రాగ్దళములో ప్రారంభించి ప్రదక్షిణ రూపముగా ముందు దిక్కులు, తరువాత మూలలలో దళదేవతలు.

1. అనంగకుసుమాదేవి, 2) అనంగ మేఖలాదేవి, 3) అనంగ మదనాదేవి, 4) అనంగ మదనాతురాదేవి-వీరు నాలుగుదిక్కులందలి దేవతులు. మూలలు ఆగ్నేయము నుండి, 5) అనంగరేఖా దేవి, 6) అనంగవేగినీ దేవి, 7) అనంగాంకుశాదేవి, 8) అనంగమాలినీ దేవి

## 8. షోడశదళము :

అష్టదళము తరువాత షోడశదళం అను 16 దళముల చక్రము. ఇవి షోడశాక్షరీ మంత్రము యొక్క బీజములను తెల్పును.

ఈ ఆవరణకు సర్వాశాపరిపూరక చక్రమని పేరు. 'స'కారప్రకృతిక; గుప్తయోగిని; సర్వవిద్రావిణీ ముద్ర; వీరరసం; షోడశకలాత్మక శక్తి; ప్రభ-శరశ్చంద్ర; వర్ణం-అ నుండి అః వరకు, త్రిపురేశ్వరీ దేవి చక్రేశ్వరి; ఫలితము సర్వాశాపరిపూరకము.

స్వాభిముఖ కోణమునుండి వామావర్తముగా దళదేవతలు. 1) కామాకర్షిణీ, 2) బుద్ధ్యాకర్షిణీ, 3) అహంకారాకర్షిణీ, 4) శబ్దాకర్షిణీ, 5) స్పర్శాకర్షిణీ, 6) రూపాకర్షిణీ, 7) రసాకర్షిణీ, 8) గంధాకర్షిణి, 9) చిత్తాకర్షిణీ, 10) ధైర్యాకర్షిణి, 11) స్మృత్యాకర్షిణీ, 12) నామాకర్షిణీ, 13) బీజాకర్షిణీ, 14) ఆత్మాకర్షిణీ, 15) అమృతాకర్షిణీ, 16) శరీరాకర్షిణీ—వీరు గుప్తయోగినులు.

## 9. భూపురత్రయము :

షోడశదళముల తరువాత భూపురత్రయము. ఇది బిందువు యొక్క దిఙ్నిర్ణయ స్థితియే చతురస్రము. ఇవి నాలుగు దిక్కులందు ద్వారములు కలిగి మూడు చతురస్రములుగా నుండును. అదియే భూపురత్రయము. ద్వారములను గూర్చి కొంత అభిప్రాయ భేదమున్నది. భూపురత్రయము ఒకే ఆవరణము.

ఈ ఆవరణకు త్రైలోక్య చక్రమని పేరు 'ల'కార ప్రకృతి; ప్రకటయోగిని; సర్వసంక్షోభిణీ ముద్ర; శృంగార రసము; పృధివ్యాత్మకశక్తి; ప్రభ-ముక్తామణిక్యం వర్ణం-కాది, హాది విద్యలు; త్రిపురాదేవి చక్రేశ్వరి; ఫలితము-త్రైలోక్యమోహనం.

భూపురత్రయంలో అంతర్వీధియందు బయట స్వాభిముఖద్వారము మధ్యనుండి నాలుగు దిశలయందు ద్వారముల మధ్య భాగములలో 1) సర్వ సంక్షోభిణీ,

2) సర్వవిద్రావిణి, 3) సర్వాకర్షిణి, 4) సర్వవశంకరి అను నాలుగు ముద్రా దేవతలు. తరువాత వాయవ్యమునుండి వరుసగా నాలుగు మూలలందు. 5) సర్వోన్మాదిని, 6) సర్వమహాంకుశ, 7) సర్వఖేచరి, 8) సర్వబీజా ముద్రాంబా దేవతలను తరువాత స్వాభిముఖద్వారము లోపల కుడివైపున, 9) సర్వయోని ముద్రాంబా ఉత్తర ద్వారము లోపలి ఎడమవైపున, 10) సర్వత్రిఖండా ముద్రాంబ దేవతలను భావించవలెను.

ద్వితీయ భూపురములో స్వాభిముఖద్వారము బయట ఎడమవైపునుండి ప్రదక్షిణంగా నాలుగు దిక్కులందు 1) బ్రాహ్మ్యంబా, 2) మహేశ్వరంబా, 3) కౌమార్యంబా, 4) వైష్ణవ్యంబా దేవతలను వాయవ్య మూలనుండి ప్రదక్షిణంగా, 5) వారాహ్యంబా, 6) మహేంద్రబ్యా, 7) చాముండాంబా, 8) మహాలక్ష్యంబా దేవతలను భావింపవలెను.

బాహ్యాభూపురములో స్వాభిముఖద్వారము బయట కుడివైపునుండి నాలుగు దిక్కు ద్వార దక్షిణ భాగాలలో వరుసగా 1) అణిమా సిద్ధ్యంబా, 2) లఘిమాసిద్ధ్యంబా, 3) మహిమాసిద్ధ్యంబా, 4) ఈశిత్వసిద్ధ్యంబా దేవతలను తరువాత వాయవ్య మూల నుండి సవ్యంగా నాలుగు మూలలందు వరుసగా 5) వశిత్వసిద్ధ్యంబా, 6) ప్రాకామ్య సిద్ధ్యంబా, 7) భుక్తి సిద్ధ్యంబా, 8) ఇచ్ఛా సిద్ధ్యంబా దేవతలను తరువాత స్వాభి ముఖద్వారము లోపల కుడివైపున, 9) ప్రాప్తి సిద్ధ్యంబా ఉత్తర ద్వారములోపల ఎడమ వైపున, 10) సర్వకామ సిద్ధ్యంబా దేవతలను భావించవలెను.

శ్రీచక్రములో ప్రతి ఆవరణకు తొమ్మిది ప్రధాన లక్షణములుండును. అవి ప్రకృతి, శక్తి మొదలగునవి, వాటిని ప్రతి ఆవరణలోను చెప్పుకొన్నాము. వాటినే ఒక పట్టిక రూపములో పక్క పుటలో ఇవ్వబడినది.

శ్రీచక్రమందలి మహాబిందువు ప్రథమ సంకల్పముచే వృత్తమేర్పడినది. అది ఏక గుణాత్మకము. దానినుండి ద్విగుణాత్మక దీర్ఘవృత్త మేర్పడినది. దానినుండి త్రిగుణాత్మక త్రికోణమేర్పడినది. (సత్త్వ రజస్తమోగుణములు) త్రికోణము నుండియే, అష్టకోణము నుండి భూపురము వరకు గల శ్రీచక్ర మేర్ప డినది. అదియే సర్వాజగుత్తు. కాలగణన అష్టకోణము నుండియే ప్రారంభమగును. బిందువు విశ్వాతీతము అంటే సంకల్ప రహితము.

| సంఖ్య | ఆవరణ | ప్రకృతి (బీజం) | శక్తి | ప్రభ | వర్ణం | యోగిని | ముద్రా | రసం | చక్రేశ్వరి | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | బిందువు | బిందువు ఓం | ఈశ్వతి | ఉద్యత్సూర్య సహస్రాభా | బిందువు (0) | పరాపర రహస్య | సర్వయోని | శాంతరసం | కామేశ్వరి | సర్వానందం |
| 2 | త్రికోణం | నాదం | త్రిగుణాలు | బంధూక కుసుమం | అః౦ | అతి రహస్య | సర్వబీజ | అద్భుత రసం | త్రిపురాంబిక | సర్వసిద్ధి |
| 3 | అష్టకోణం | క | అష్ట మూర్తులు | పద్మరాగ సమప్రభ | య నుండి హ వరకు | రహస్య | సర్వఖేచరి | హాస్యరసం | త్రిపురా సిద్ధాంబ | సర్వరోగ హరం |
| 4 | అంతర్దశారం | ర | దశ కలాత్మకము | జపాకుసుమ | ట–వర్గం త–వర్గం | నిగర్భ | సర్వమహాం కుశ | రౌద్రరసం | త్రిపుర మాలిని | సర్వరక్షా కరము |
| 5 | బహిర్దశారం | ఏ | దశావతా రాత్మకం | సిందూరం | క–వర్గం చ–వర్గం | కుల | సర్వో న్మాదిని | భీభత్స రసం | త్రిపురాశ్రీః | సర్వార్థ సాధకం |
| 6 | మన్వస్రం | ఈ | చతుర్దశ భువనములు | దాడిమీ కుసుమం | అ–ఔ ప్రాస్వములు | సంప్రదాయ | సర్వ వశంకరి | భయానక రసం | త్రిపుర వాసిని | సర్వసౌభాగ్య ప్రదం |
| 7 | అష్టదళం | హ | అష్ట ప్రకృతులు | జపా పుష్ప | క,చ,ట,త,ప య,శ వర్ణములు క్ష | గుప్త తర | సర్వాకర్షిణి | కరుణ రసం | త్రిపుర సున్దరి | సర్వ సంక్షోభణం |
| 8 | షోడశ దళం | స | షోడశ కలాత్మకము | శరచ్చంద్ర | అ – అః | గుప్త | సర్వ విద్రావిణి | వీర రసం | త్రిపురేశీ | సర్వాశా పరిపూరకం |
| 9 | భూపుర త్రయం | ల | పృథ్వి | ముక్తామాణి క్యాభ | కాది హాది విద్యలు | ప్రకట | సర్వ సంక్షోభిణి | శృంగార రసం | త్రిపుర | త్రైలోక్య మోహనం |

ఇంతవరకు శ్రీచక్రములోని కోణములు, దళములు, భూపురములోని దేవతలను గూర్చి చెప్పుకొన్నాము. శ్రీచక్రములో వీరేకాక పరివార దేవతలు గలరు. వారికి శ్రీచక్రములో ఆవరణలలో స్థానము లేదు. కాని ఇవిగూడ బిందువునకు భూపుర మునకు మధ్యగల అవకాశమునందే ఉన్నవి. అవి: I) షడంగదేవతలు, II) నిత్యా మండలము, III) గురుమండలము, IV) పంచపంచికలు, V) ఆమ్నాయదేవతలు.

షడంగ దేవతలను గూర్చి ఇదివరకే చెప్పుకొన్నాము. ఇక ఇప్పుడు నిత్యామండల మును గూర్చి చెప్పుకొందాము.

## II. నిత్యామండలము :

జగద్గురు శ్రీకల్యాణానంద భారతీస్వామి వారు తమ బ్రహ్మకలలో బిందువును నవా వరణలలో ఒకటిగా పరిగణింపరాదని అన్నారు. అయితే అప్పుడు తొమ్మిదవ ఆవరణ ఏది అని ప్రశ్న వచ్చును దానికి వారు శ్రీచక్ర ఆవరణలలో అత్యంత రహస్యమైన మహత్తర త్రిభుజమున్నది (ఇది శ్రీచక్రములోని త్రిభుజముకాదు). అదే నిత్యాదేవతల స్థానము. ఆ మహత్తర త్రిభుజమే తొమ్మిదవ ఆవరణ. ఇది శ్రీచక్రములోని బిందువునకు సమతలములో బిందుత్రికోణముల మధ్యలో ఉన్న ఊహా త్రిభుజము. అదే తొమ్మిదవ ఆవరణ. అదే కల్యాణ శ్రీచక్రము.

శ్రీకల్యాణానంద భారతీస్వామి వారు చెప్పిన దానికి అనుగుణంగా శ్రీ ఆదిశంకరు ల సౌన్దర్యలహరిలో కనబడుచున్నది.

**చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పంచభిరపి**
**ప్రభిన్నాభిః శంభోర్నవ భిరపి మూలప్రకృతిభిః**
**చతుశ్చత్వారింశద్వసుదళ కలాశ్ర త్రివలయ**
**త్రిరేఖాభిః సార్ధం తవశరణ కోణాః పరిణతాః ॥** (సౌన్దర్యలహరి-11)

తల్లీ! నీకు నిలయమైన శ్రీచక్రమునందు శివకోణములు నాలుగును, శక్తి కోణములు ఐదును, శ్రీచక్రమునకు మూలకారణమగు తొమ్మిది మూల ప్రకృతులచేతను, అష్టదళ, షోడశదళ, త్రివలయ భూపురత్రయముల చేతను 44 కోణములు గలది అని పై శ్లోకము భావము.

అయితే శ్రీచక్రమున త్రికోణ, అష్టకోణ, దశకోణద్వయము, మన్వస్రం కలిసి 43 అగును. మరి ఈ శ్లోకములో 44 కోణములు చెప్పబడినవి. కావున 44వది నిత్యామండల త్రిభుజమనియే భావన.

పైన చెప్పిన ఊహామహా త్రిభుజమును స్వాభిముఖంగా భావించాలి. ఆ త్రిభుజములో వామావర్తంగా ఒక్కొక్క భుజమునందు 5 నిత్యల చొప్పున 15 నిత్యలకు పూజ అనియు బిందువునందు 16వ నిత్య శ్రీవిద్యావిశ్వమాతృకా నిత్యకు స్థానమని స్వామివారి నిర్ణయము.

ఈ మహాత్రిభుజ అగ్రకోణము నుండి

**దక్షిణరేఖమీద :** 1) కామేశ్వరీ నిత్యా, 2) భగమాలిని నిత్యా, 3) నిత్యక్లిన్నానిత్యా, 4) భేరుండానిత్యా, 5) వహ్నివాసిని నిత్యా.

**పూర్వరేఖమీద :** 6) మహావజ్రేశ్వరీనిత్యా, 7) శివదూతినిత్యా, 8) త్వరితా నిత్యా, 9) కులసుస్దరీనిత్యా, 10) నిత్యానిత్యా.

**ఉత్తరరేఖమీద:** 11) నీలపతాకనిత్యా, 12) విజయనిత్యా, 13) సర్వమంగళానిత్యా, 14) జ్వాలామాలినికా నిత్యా, 15) విచిత్రానిత్యా.

పదునారవది విశ్వమాతృకానిత్యను బిందువు మీద పూజించవలెను. విశ్వమాతృకే పరదేవతా (కామేశ్వరీ) రూపము. ఈమె నిత్యామండలాధి దేవత. ఆమెయే నిత్యామండల చక్రేశ్వరి. వర్ణము-త్రికోణములోని నిత్యలకు అ నుండి అం వరకు, విశ్వమాతృకా నిత్యకు అః.

## III. గురుమండలము :

శ్రీచక్రమందలి త్రికోణము లోపలగా బిందువుచుట్టూ ఒక ఊహా త్రిభుజము—నిత్యా మండలము—ఉన్నదని చెప్పుకొన్నాము. ఆ త్రిభుజము పరివృత్తముపై స్వాభిముఖంగా ప్రారంభించి ప్రాదక్షిణక్రమంలో గురుమండల పూజ చేయవలెను. గురుమండలములో కారణగురువైన శ్రీమేధాదక్షిణామూర్తి నుండి ప్రస్తుత పీఠాధిపతివరకు అర్చించి తరువాత గురుత్రయమును అర్చించవలెను. వీరందరు భారతీ సంప్రదాయ

యతులు. వారికే పాదుకాంత దీక్షనిచ్చే అధికారమున్నది. మిగిలిన వారికి ప్రణవో పాసనకు మాత్రమే అధికారము.

శ్రీవిద్యా సంప్రదాయ గురుమండలము నారాయణునితో ప్రారంభమై ప్రస్తుత పీఠాధి పతితో పూర్తి అగును. ఇది దక్షిణాచార సంప్రదాయము. శ్రీ ఆదిశంకరులు దక్షిణా చార సంప్రదాయ పద్ధతిలోనే పీఠములను స్థాపించారు. మనకు ఆదిశంకరుల సంప్రదా య గురుపరంపరే ఆచరణీయము. అందులకు అనుగుణముగానే జగద్గురు శ్రీకల్యా ణానంద భారతీ స్వామివారు శ్రీదేవీ ఖడ్గమాలను సంస్కరించినారు. మనకు అదే ఆచరణీయము.

## IV. పంచపంచికలు :

కూటమికి 5 చొప్పున 5 కూటములు 25 పరదేవతలను పంచపంచికలు అందురు. వీరికి బిందువునుండి భూపురము వరకు ఉన్న అవకాశములో పూజ జరపాలి. భూపురము నుండి ఐదు చతురస్రములను ఒకదానికంటే ఒకటి చిన్నదిగా పైపైకి ఊహించాలి. మొదటి చతురస్రం భూపురము దగ్గర ఉన్నది. దానిలో బిందువు తరువాత వాయవ్య, ఈశాన్యం, ఆగ్నేయం, నైఋతి మూలలలో దేవతలు చెప్పబడినవి. అట్లే మిగిలిన చతు రస్రములలో పూజించవలెను. పూజ బిందువునకు బాహ్యంగా ఉన్న చతుర్భుజము నుండి పూజింపవలెను.

### A. పంచ కోశాంబులు :

1) విద్యాకోశాంబ, 2) పరంజ్యోతీ కోశాంబ, 3) పరానిష్కలా కోశాం బ, 4) అజపా కోశాంబ, 5) మాతృకా కోశాంబ.

### B. పంచ లక్ష్యంబా కోశాంబలు :

1) శ్రీవిద్యా లక్ష్యంబా, 2) లక్ష్మీ లక్ష్యంబా, 3) మహాలక్ష్మీ లక్ష్యంబా, 4) త్రిశక్తి లక్ష్యంబా, 5) సామ్రాజ్య లక్ష్యంబా.

### C. పంచ కల్పలతాంబలు :

1) శ్రీవిద్యా కల్పలతాంబా, 2) పంచకామేశ్వరీ కల్పలతాంబా, 3) పారిజాతేశ్వరీ కల్పలతాంబా, 4) కుమారి కల్పలతాంబా, 5) పంచబాణేశ్వరీ కల్పలతాంబా

D. పంచ కామాదుఘాంబ కల్పలతాంబలు :

1) శ్రీవిద్యా కామదుఘాంబ, 2) అమృత పీఠేశ్వరి కామదుఘాంబ, 3) సుధాశ్రీ కామ దుఘాంబ, 4) అమృతేశ్వరీ కామదుఘాంబ, 5) అన్నపూర్ణా కామదుఘాంబ.

E పంచ రత్నాంబులు :

1) శ్రీవిద్యారత్నాంబ, 2) సిద్ధ లక్ష్మీ రత్నాంబ, 3) రాజమాతంగీ రత్నాంబ, 4) భువనేశ్వరీ రత్నాంబ, 5) వారాహీ రత్నాంబ.

## V. ఆమ్నాయ దేవతలు :

పరమేశ్వరుని ముఖమునుండి ఉద్భవించిన మంత్ర దేవతా సమూహమునకు అమ్నాయములని పేరు. పరమేశ్వరుని సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను అయిదు ముఖములనుండి పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వ అమ్నాయ దేవతలు ఉద్భవించినవి. ఆరవది అయిన అనుత్తరామ్నాయము పరమేశ్వరీ ముఖము నుండి ఆవిర్భవించినది. అంబికా పంచాయతనం గణపతితో ప్రారంభించి వాటితో పాటు ఆమ్నాయ దేవతలను పూజించవలెను. బిందువునందు ఊర్ధ్వామ్నాయ దేవత పరదేవత కనుక ఈశాన ముఖదేవతగా పూజించవలెను. గణపతి, సూర్య, విష్ణు, శివ, అంబిక దేవతలు పంచాయతన దేవతలు.

తంత్రాలలో శ్రీచక్రార్చనకు సంహారక్రమ పూజ ఒకటే చెప్పబడినది. భూపురము నుండి బిందువు వరకు ఆవరణ దేవతాపూజ సంహారక్రమ పూజ అందురు. కాని జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ స్వామివారు తమ యాగసూత్రంలో సృష్టిక్రమ, సంహార క్రమాలతో శ్రీచక్రార్చన చేయాలని నిర్ణయించారు. సృష్టిక్రమ పూజ అంటే బిందువు నుండి భూపురత్రయము వరకు ఆవరణదేవతా పూజ.

శ్రీ చక్రార్చనలో ముందు ప్రాణప్రతిష్ఠ, పాత్రా సాధన తరువాత సృష్టిక్రమ, సంహార క్రమ పూజలు చేయాలి. ఇదే పూర్ణోపాసన.

## మహాసుదర్శన యంత్రము

నవావరణ శ్రీచక్రము శిల్పికలో అపరరూప చక్రములు 1) నవావరణ శ్రీచక్రము 2) మహా సుదర్శన యంత్రము అను రెండు విధములని చెప్పుకొన్నాము. ఇంతవరకు

నవావరణ శ్రీచక్రమును గూర్చి కొద్దిగా చెప్పుకొన్నాము. ఇక మహాసుదర్శన యంత్రమును గూర్చి కొంచెము తెలుసుకొందాము.

వసుకోణ దశారయుగ్మ మన్వస్రాః సహస్రారస్య వికృతయః
సహస్రారంతు త్రికోణ స్యేతి రహస్యమ్! (బ్రహ్మకలా - 7-71)

నవావరణ శ్రీచక్రములోని అష్టకోణము దశ కోణయుగ్మము, చతుర్దశార కోణభాగములు సహస్రారమునుండి పుట్టినవి సహస్రారము శ్రీచక్రమందలి త్రికోణము నుండి ఉద్భవించినదని సూత్రార్థము.

అయితే సహస్రారము అంటే సహస్ర అరములు అని అర్థము. అరములు అనగా కోణములు కలదని అర్థము సంఖ్యాత్మక నిర్వచనమును బట్టి

స=7, హ=8; స్=7, ర=2
మొత్తము = 7+8+7+2=24 (అనుబంధము చూచేది)
సమిష్టి సంఖ్యా తంత్రముచే = 2+4=6 అగును

అంటే సహస్రారము అనగా ఆరు (6) కోణములు గల యంత్రరూపమని అర్థము. అదియే షట్కోణము. అది స్వాభిముఖ సమబాహు త్రికోణము, ఊర్ధ్వముఖ సమబాహు త్రికోణములు పరస్పరము ఖండించుకొనుట వలన ఏర్పడును. ఈ షట్కోణముల ప్రస్తార సంయోగములచే ఏర్పడునవి యే అష్టకోణ, దశకోణ, చతుర్దశ కోణ భాగములు.



శ్రీకలా యంత్రమునకు, సుదర్శన యంత్రమునకుగల సంబంధము క్రింద చూపబడినది.

శ్రీకలా యంత్రములోని సదాశివ వృత్తము (VII) పైనున్న (7854) బిందువులను వరుసగా కలుపుటచే చతురస్రమొకటి ఏర్పడినది.లోకతార వృత్తము (VI) పైనున్న (3162) బిందువులు కలుపగా మరియొక చతురస్రము ఏర్పడినది. దహర వృత్తము (I) పైనున్న (A52) బిందువులు కలుపగా ఊర్ధ్వముఖ సమబాహు త్రిభుజము ఏర్పడినది.

దహార వృత్తము పై నున్న (B47) కలుపగా అధోముఖ సమబాహు త్రిభుజము ఏర్పడినది. ఈ రెండు సమబాహు త్రిభుజములతో షట్కోణ మేర్పడు చున్నది.




7854 - చతురస్రము పెద్దది, 3162 - చిన్న చతురస్రము

A25 - ఊర్ధ్వముఖ సమబాహు త్రిభుజము } షట్కోణము
B47 - అధోముఖ సమబాహు త్రిభుజము



సుదర్శన యంత్రము

సదాశివ వృత్తము (VII) లోకతార వృత్తము (VI) దహర వృత్తములను అధివసించిన నాలుగు దిక్కులందలి వృత్తముల (II,III,IV,V) స్థానములో పైన ఏర్పరచిన రెండు చతురస్రములు, షట్కోణముచే సుదర్శన యంత్రము ఏర్పడినది. పై న శ్రీకలా యంత్రము నుండి శ్రీచక్రముద్భవించిన విధము చెప్పుకొన్నాము. అంటే శ్రీచక్రము సుదర్శన యంత్రములు రెండూ శ్రీకలా యంత్రము నుండే ఉద్భవించినవని తెలియుచున్నది. అదే శ్రీచక్ర, సుదర్శన యంత్రముల సామరస్యము.

షట్కోణమును సామాన్యముగా సుదర్శనముగా చెబుతారు. సుదర్శన చక్రము శ్రీకృష్ణభగవానుని కుడిచేతిలోనుండును. దర్శనమనగా వేదాంత సంబంధమైన సత్యముల మీద భాష్యము అని అర్థము. 'సు' అనగా స్పష్టము లేక పరిపూర్ణము అని అర్థము. కావున సుదర్శనము అనగా స్పష్టమైన లేక పరిపూర్ణమైన వేదాంత భాష్యమని అర్థము. ఈ సుదర్శనమే భగవాన్ శ్రీకృష్ణుడు ఎల్లప్పుడు తన కుడిచేతిలో ధరించే చక్రము. భగవద్గీత పదరూపములో శ్రీకృష్ణ పరమాత్మ యొక్క సంపూర్ణమైన దర్శన మయిన—సుదర్శనము దాని రేఖారూపము. అనగా భగవద్గీత అంతా షట్కోణ రూపమనే సామాన్య చక్ర భాష్యమే. అంతేకాదు షట్కోణము సంగ్రహ భగవద్గీత (Gita in a nutshell)

షట్కోణములోని స్వాధిముఖ త్రికోణము శివాశక్తిని, ఊర్ధ్వముఖ త్రికోణము శివశక్తిని సూచించును. అంటే షట్కోణము శివ—శక్తుల ఐక్యరూపము. ఈ షట్కోణమే పురుష సూక్తములో చెప్పబడిన పురుషుడు. అంటే పురుషుడు శివాశివుల సమ్మేళన రూపము. పురుష సూక్తములో వర్ణించిన విరాట్ పురుషుడే షట్కోణము.

## నారాయణుడు - నారాయణి

కూర్మ పురాణములో హిమవంతుడు దేవీరూపమును ఈక్రింది విధంగా స్తుతించాడు :

**సహస్రమూర్ధాన మనంత శక్తిం**
**సహస్రబాహుం పురుషం పురాణం**
**శయానమబ్ధే లలితే తవైవ**
**నారాయణాఖ్యాం ప్రణతోస్మి రూపం॥**

సహస్ర శీర్షములు, సహస్రబాహులు కలిగి అనంత శక్తి కలిగి జలధిపై శయనించిన పురుష రూపములో నారాయణ నామముగల లలితాంబకు ప్రణామము.

మమైవ పౌరుషరూపం గోపికాజన మోహనం (లలితోపాఖ్యానము)

గోపికలకు మోహన కారణమైన 'పురుష రూపము నేనే'' అని లలితాదేవి అన్నది.

యాతస్య పార్శ్వగా బాలా పార్వత్యంశజో హరిః । (శివపురాణము)

మహేశ్వరుని ప్రక్కనున్న నారాయణుడు పరమేశ్వరీ స్వరూపమే.

ఆద్యాశక్తిర్మహే శస్య పుంరూపా మదాత్మికా (హరి వంశము)

మహేశ్వరుని ప్రక్కనున్న ఆదిశక్తియొక్క పురుష రూపమును నేనే అని నారాయణుడు వీరభద్రునితో చెప్పెను.

నారాయణి సహచరాయ నమశ్శివాయ ।

నారాయణీ దేవతా సహిత శివునకు నమస్కారము అని అప్పయ్య దీక్షితులు వారు శివస్తుతి చేశారు.

వీనిని బట్టి శివుని యొక్క పురుషరూపమే నారాయణుడని తెలియుచున్నది.

అంతేకాక రహస్య నామస్తోత్రంలో పద్మనాభసహోదరీ - పద్మనాభునకు లలితాంబకు ఒకే ఉదరమని చెప్పుటే సహోదరత్వము. ఇంతేకాక యోగేశ్వరేశ్వర (భ.గీ.) పదం నారాయణుని నామమైతే యోగేశ్వరేశ్వరి (రహస్య నామస్తోత్రం) పరదేవతా నామము. నారాయణుడు విష్ణు నామమైతే నారాయణి లలితాదేవి నామము.

శ్రీకలా యంత్రమే నవావరణ శ్రీచక్రమునకు, సుదర్శన చక్రమునకు మూలము. పైన శ్రీదేవికి, నారాయణునికి నామసాపత్యము చూశాము.

పూర్తి సుదర్శన చక్రములో బిందు, షట్కోణ వృత్త చతురస్రవృత్త చతురస్ర వృత్తములు ఉండును. సుదర్శనము లోను వృత్త త్రయము ప్రధాన భాగము. ఇవే కోణభాగములకు ఆధారము. వీటివలన శ్రీచక్ర (నారాయణీ - శివా) సుదర్శన యంత్ర విశేషములు కొంతవరకు అర్థమగును.

# శ్రీచక్ర ప్రస్తారములు

ప్రస్తారము అనగా పరచుకొను, విస్తరించు లేక విపులము చేయు అని అర్థము. అంటే నిర్ణీత ప్రదేశములలో వివిధ దేవతలను రేఖల సహాయముతో శాస్త్రానుసారముగా ఏర్పాటు చేయుటను ప్రస్తారమని చెప్పుకొనవచ్చును. శ్రీ చక్రప్రస్తారములు సామాన్యముగా రెండు రకములు అని చెబుతారు. అవి: 1)భూప్రస్తారము 2) మేరుప్రస్తారము. ఒక తంత్రములో నాలుగు ప్రస్తారములు చెప్పబడినవి. అవి: 1) భూప్రస్తారము 2) కూర్మప్రస్తారము 3) మేరుప్రస్తారము 4) పద్మప్రస్తారము.

## 1) భూప్రస్తారము :

శ్రీ చక్రమును పూర్తిగా చతురస్ర లేక గుండ్రని లోహపు పలక మీద చెక్కి అచ్చును తయారుచేస్తారు. దాని సహాయముతో, వేడి చేసిన బంగారు, వెండి, రాగి, మొదలగు లోహపురేకుల మీద శ్రీచక్రమును ఏర్పరచవచ్చును. దీనినే భూప్రస్తారము అందురు. దీనిలో అయిదు త్రిభుజములు అధోముఖముగను నాలుగు త్రిభుజములు ఊర్ధ్వముఖముగను ఉండును. విలువగల రాళ్ళమీద గాని, సామాన్యపు రాళ్ళమీదగాని భూప్రస్తారముగా శ్రీచక్రమును చెక్కవచ్చును.

## 2) మేరు ప్రస్తారము :

i) మేరు ప్రస్తారములో శ్రీచక్రములోని తొమ్మిది చక్రములు ఒక దానిపై ఒకటి వచ్చునట్లు చేయుదురు. క్రింద భూపురత్రయము చివరకు పైన బిందువువచ్చు నట్లు క్రమములో ఆవరణలు వచ్చునట్లు లోహముతో పోత పోస్తారు, లేక రాయిని గాని క్వార్ట్జును గాని చెక్కుతారు. అది శంకువు ఆకారములో వచ్చును.

ii) శ్రీ చక్రమును మూడు భాగములుగా పోత పోయుదురు. (1) భూపురత్రయము, షోడశదళము, అష్టదళము ఒక భాగముగాను (2) చతుర్దశారము, దశారద్వయము

రెండవ భాగముగను (3) అష్టకోణము, త్రికోణము బిందువు మూడవ భాగముగను తయారు చేయుదురు. తరువాత భూపుర త్రయ భాగము నుండి క్రమములో మూడు భాగములను ఒకదానిపై ఒకటి ఉంచి అతికి ఒకటిగా చేయుదురు.

iii) ఇంకొక పద్ధతిలో భూపురత్రయము ఒక భాగముగాను, షోడశదళము, అష్టదళం రెండవ భాగముగాను మిగిలిన శ్రీ చక్ర భాగము, బిందువు మూడవ భాగముగను పోత పోసి ఒక దానిపై ఒకటి క్రమములో పేర్చి అతికి ఒకటిగా చేయుదురు.

IV) ఇంకొక పద్ధతిలో తొమ్మిది ఆవరణలను విడివిడిగా పోత పోసి క్రమములో ఒక దానిపై ఒకటి ఉంచి అతికి ఒకటిగా చేయుదురు.

మేరు ప్రస్తారములో 5 కోణములు మనవైపునకు 4 కోణములు వెనకకు ఉండును. మేరు ప్రస్తారము పొడవు, వెడల్పు ఎత్తులు సామాన్యముగా 9:9:1 నిష్పత్తిలో ఉండును.

భూప్రస్తార శ్రీ చక్రమును రేకు మీద మధ్యలో అర్ధవృత్తాకారము గా పైకి వచ్చునట్లు చేసిన గాని లేక శివలింగము మీద చెక్కిన గాని అది మేరుప్రస్తారముకాదు.

## 3) కూర్మప్రస్తారము :

ఇది రెండు విధములు. తాబేలు వీపు మీద పొరలు వలె శ్రీ చక్రములోని తొమ్మిది చక్రములను ఒకదాని కంటె ఒకటి కొంచెము ఎత్తుగా ఉండునట్లు చేయుదురు. ఇది చిన్న చక్రమైన భూప్రస్తారము వలె అచ్చును తయారు చేసి శ్రీ చక్రములను చేయవచ్చును. చక్రము పెద్దది అయిన రాయి మీదగాని, లోహపు పలకల మీద గాని చెక్కుదురు.

కొన్ని చోట్ల కూర్మప్రస్తార శ్రీచక్రమును తాబేలు వీపుమీద పెట్టినట్లు చేయుదురు. అది పురాణములలో చెప్పిన ఆది కూర్మమని అర్థము ఈ విశ్వమును కూర్మము తన వీపున మోయును. శ్రీచక్రము విశ్వమునకు ప్రతీక.

చెన్నైలోని కామాక్షి దేవాలయము ఒకదానిలో 12X12"X4" కొలతలు గల పంచలోహముతో చేసిన కూర్మప్రస్తార శ్రీచక్రము అమ్మవారికి ఎదురుగా నున్నది. అది ఆది శంకరులు ప్రతిష్ఠించినదని ప్రసిద్ధి.

దక్షిణ భారతదేశములోని దేవాలయములలో అర్ధమేరువని ఇంకొక రక ప్రస్తారము కనబడును. దీనిలో భూపురత్రయము, షోడశదళము, అష్టదళము, ఒక దానిపై ఒకటి ఏర్పరచి వానిపైన మిగిలిన శ్రీచక్ర భాగమును భూప్రస్తారములో వలె చెక్కిన లేక పోతపోసిన లోహపురేకును ఉంచుదురు. పంచలోహములతో చేసిన అర్ధమేరు శ్రీచక్రము శ్రీకాళహస్తిలో జ్ఞానప్రసూనాంబ దేవాలయములో గలదు.

ఒక పత్రికలో ఒక రచయిత 8 రకముల ప్రస్తారములను వాటిని పూజించుట వలన ప్రాప్తించు భోగభాగ్యములు వ్రాశాడు. ఆ ప్రస్తార వివరములుగాని తాను చెప్పిన విషయములకు ప్రమాణమేదో పేర్కొనలేదు. చమత్కారము కొరకు వాటి పేర్లు పూజించుట వలన కలిగే ఫలితములు క్రింద ఇవ్వబడినవి.

(1) మేరు ప్రస్తారము - విడిచి విడిచి వచ్చే సంపద

(2) కూర్మప్రస్తారము - దారిద్ర్య నిర్మూలనము; సర్వతోముఖాభివృద్ధి.

(3) ధారాప్రస్తారము - ప్రాపంచిక సుఖములకు

(4) మత్స్యప్రస్తారము - అద్భుతాభివృద్ధికి

(5) ఊర్ధ్వప్రస్తారము - అష్టలక్ష్మల సిద్ధికి

(6) మాతంగ ప్రస్తారము - తొమ్మిది రకముల అభివృద్ధి సాధనకు

(7) నవనిధియ ప్రస్తారము - సంపూర్ణాభివృద్ధికి

(8) వారాహ్య ప్రస్తారము - భూసంబంధిత ఆస్తి అభివృద్ధికి

ఇంత వరకు మొదటి రెండు భాగములలో నవావరణ శ్రీ చక్రము దాని ప్రస్తారములను గూర్చి రేఖామాత్రముగా తెలిసికొన్నాము. ఇది పూర్తిగా అర్ధమగుటకు ఇంకా ఇతర విషయముల జ్ఞానము అనుబంధములుగా ఇవ్వబడినది. మొదటి రెండు భాగములు, అనుబంధములు అంతాకలిసే ''నాకు తెలిసిన శ్రీ చక్రము'' పుస్తకము అగును.

# అనవసర విషయములు

నిర్గుణ బ్రహ్మము (పరమాత్మ) లో సంకల్పము కల్గెను. బ్రహ్మము నేను అనేకముగా అగుదును అని అనుకొనెను. అదే కామకల. అనేకముగా అగుదును అను ఛాయామాత్ర సంకల్పముతో నున్న బ్రహ్మమే హిరణ్యాగర్భుడు. ఆయనే సగుణ బ్రహ్మము. శ్రీ చక్రములోని వృత్తత్రయము నిర్గుణ బ్రహ్మములోని నాలుగు పాదములలో అవ్యక్త నిర్గుణ బ్రహ్మము యొక్క మూడు పాదములను తెల్పును. కామకల చేత ఈ విశ్వస్సృష్టి జరుగు సమయములో ఆత్మలో నాలుగు పాదములు ఏర్పడినవి అవి . 1) బ్రహ్మము లేక పరమాత్మ—విశ్వస్సృష్టికి పూర్వమున్నది. ఈ విశ్వము సృష్టించుటకు ముందు ఉన్నది ''సత్'' ఒక్కటే అంటే Absolute Truth అనగా బ్రహ్మము- ఒకేఒక బ్రహ్మము. అద్వితీయ బ్రహ్మము. 2) కామకల 3) మార్పులేని బ్రహ్మము - వృద్ధిక్షయములు లేనిది. 4) త్రిగుణాత్మకమైన విశ్వము (సత్వ,' రజస్సు తామస గుణాత్మకమైనది). ఈ నాలుగు పాదములు ఉపమేయములు అనగా పోల్చబడిన పదార్థములు.

శ్రీ చక్రము ఈ సర్వబ్రహ్మాండమునకు ప్రతీక. సగుణ బ్రహ్మము ఒక పాదము మాత్రమే. ఇది బాహ్యాపూజకు నిర్ణయింపబడినది. శ్రీచక్రము చేత తెలుపబడే ఈ పాదము చంద్ర, సూర్య అగ్ని అని మూడు ఖండములుగా నున్నది. శ్రీ చక్రము యంత్రరాజము, పరబ్రహ్మమునకు ప్రతీక. శ్రీ చక్రము యంత్రరాజమగుటకు పూర్ణం భాగమునకు లేక మొదటి మూడు పాదములకు మరియు నిర్గుణ బ్రహ్మము విశ్వమంతటికి ఆధారమని తెలియుటకు శ్రీ చక్రములో అవకాశముండాలి. అదే వృత్తత్రయము. మూడు వృత్తములు శ్రీ చక్రములోని బిందువుయొక్క వ్యాకోచములు. వృత్తత్రయము నిర్గుణ బ్రహ్మము మూడు పాదములకు గుర్తు కనుక అవి పూజింపబడవు. వాటికి పూజావిధానము చెప్పబడలేదు. నిర్గుణ బ్రహ్మము జ్ఞేయమే కాని బాహ్యాపూజలేదు.

అయితే ఇప్పుడు ప్రశ్న శ్రీచక్రములో ఈ వృత్తత్రయ స్థానమెక్కడ? కొందరు షోడశదళము భూపురత్రయమునకు మధ్యలో ఉండాలని అంటారు. మరికొందరు చతుర్దశారము, అష్టదళము. షోడశదళముల చుట్టు మూడు వృత్తములను వృత్తత్రయముగా తీసికొన వలెనని చెప్పిరి. ఇంకొందరు షోడశదళమునకు భూపురత్రయమునకు మధ్య మూడు వృత్తములకు సరిపడు చోటు లేదు కనుక షోడశదళము చుట్టూ ఉన్న వృత్తమే మూడు వృత్తములను తెలుపును అని అన్నారు. మొట్టమొదట వృత్తత్రయము శ్రీచక్రములోని మూడు ఖండములను వేరుచేయు మర్యాదా వృత్తములుగా ఉండేవి. కొంతకాలానికి అది మరచి షోడశదళ భూపురత్రయముల మధ్య మూడు వృత్తములుగేయుట మొదలైనదని బరోడా ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ డైరెక్టరు డా॥ జాని అభిప్రాయము. కాని స్వామి ప్రణవానంద దానిని తన పుస్తకములో వ్యతిరేకించారు. స్వామి ప్రణవానంద మొదలగువారు షోడశదళము భూపురత్రయము మధ్య మూడు వృత్తములు ఉండాలని వారి వాదన.

ఆది శంకరుల తరువాత ఆయనంతటి వాడని ప్రసిద్ధి గాంచిన విద్యారణ్యులు అనుమానమునకు ఆస్కారము లేకుండ శ్రీ చక్రద్ధార శ్లోకములో వృత్తత్రయ స్థానములను చెప్పారు. అదేవిధముగా ఆయన శ్రీ చక్రములను నిర్మింపచేశారు. ఆయన విద్యానగర నిర్మాణముతోపాటు నిర్మింపచేసిన శ్రీ చక్రము గుంటూరులోని శ్రీ శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠ స్థానమైన శ్రీ సదనము (4/2 అరండల్ పేట) లో నేటికిని చూడవచ్చును. దానిలో షోడశదళమునకు, భూపురత్రయమునకు మధ్య ఒకే వృత్తమున్నది.

ఇక భూపురత్రయము ఎట్లాఉండాలి? అవి మెట్లుగా ఉండాలా? లేక ఒకే తలములో ఉండాలా? భూపురత్రయమునకు నాలుగు వైపులా ద్వారములు ఉండాలా? అక్కరలేదా? ద్వారములు ఉంటే అవి మూసి ఉండాలా? లేక తెరచి ఉండాలా? దళములు ఎట్లాఉండాలి? అర్ధ వృత్తాకారముగానా లేక అవి మీసాల బ్రాకెట్టు ఆకారములోనా? అనే ప్రశ్నలు ఉన్నవి.

భూపురత్రయమును సామాన్యముగా మెట్లుగానే శ్రీ చక్రములో చూపుతారు. కాని కొందరు భూపురము ఒకే తలములో ఉండే మూడు ఏకకేంద్ర చతురస్రములుగా ఉండాలంటారు.

భూపురత్రయములో నాలుగు దిక్కులందు ద్వారములు ఉండాలని కొందరు అక్కరలేదని కొందరు సౌన్దర్యలహరి 11వ శ్లోకములో ద్వారములను గూర్చిన ప్రసక్తి లేదు. 6వ శతాబ్దము తరువాత వచ్చిన సౌన్దర్యలహరి వ్యాఖ్యానకర్త లక్ష్మీధరుడు శ్రీచక్ర ఉద్ధార శ్లోకములో కొంచెము మార్పుచేసి ద్వారములు ఉండాలని చెప్పాడని శ్రీ ప్రణవానందస్వామి తమ పుస్తకము "Treatise on Srichekra"లో పేర్కొన్నారు. దీని విషయములో అనుకూలముగాను, ప్రతికూలముగాను ఎన్నో విషయములు ఎంతోమంది చెప్పారు. శ్రీచక్రమందలి నాలుగు ద్వారములు చతుర్వేద రూపములు, ద్వారప్రవేశము వలననే పరదేవతా సాక్షాత్కారము కలుగును అని కొందరందురు.

పైన పేర్కొన్న ప్రశ్నలన్నిటికి మన నిర్ణయమేమిటి? మనము ఒక గురువు ద్వారా ఏదో ఒక సంప్రదాయములో ఉంటాము. ఆ సంప్రదాయము, గురువు అనుసరించే పద్ధతే మనము అనుసరించాలి. అది మన విద్యుక్త ధర్మము. ఇతర వాటిని హేళన చేయుటగాని, విమర్శించుటగాని తగదు.

పూజచేసే శ్రీ చక్రములో బీజాక్షరములు ఉండరాదు. ఈ మధ్యకాలములో భూపురత్రయములోని ఖాళీ ప్రదేశములలో యంత్రమును ఆకర్షణవంతము చేయుటకు అర్థములేని డిజైనులు చెక్కుచున్నారు. అది సరియైన పద్ధతి కాదు. ఇంక అనుమానము లేని విషయములలో శ్రీచక్రమును గీయుటలో దొర్లిన పొరపాట్లను గూర్చి ముచ్చటించు కొందాము.

సౌన్దర్యలహరి వ్యాఖ్యానకర్తలు, అనువాదకులు శ్రీ చక్రములోని త్రికోణములను అనేక పద్ధతులలో చూపారు. వానిలో కొన్ని చెప్పుకొందాము.

(1) అయిదుశక్తి కోణములు అధోముఖముగాను నాలుగు శివకోణములు ఊర్ధ్వముఖముగాను ఉండి బిందువును అధోముఖ త్రికోణము మధ్యలో ఉంచారు. ఇది సరియైన పద్ధతి. భారతదేశమంతా ఆచరణలో ఉన్న పద్ధతి.

(2) అయిదు త్రిభుజములు అధోముఖముగాను నాలుగు త్రిభుజములు ఊర్ధ్వ ముఖముగాను చూపి బిందువును చతురస్రములో ఉంచారు.

(3) నాలుగు త్రిభుజములు అధోముఖముగాను అయిదు త్రిభుజములు ఊర్ధ్వముఖముగాను చూపి బిందువును చతురస్రములో ఉంచారు.

(4) నాలుగు త్రిభుజములు అధోముఖముగాను అయిదు త్రిభుజములు ఊర్ధ్వ ముఖముగాను చూపి బిందువును ఊర్ధ్వముఖ త్రికోణములో ఉంచారు.

మొదటిది సరియైన పద్ధతి. మిగిలినవికావు. శ్రీ చక్రము గీయుటలో ఈ పొరపాట్లు జరుగుటకు చాల కారణములు ఉండవచ్చు. వాటిలో కొన్ని చెప్పుకొందాము.

(1) శ్రీ చక్రముగీసే ఆర్టిస్టుకు శ్రీ చక్రమును గూర్చిన సరియైన అవగాహన లేకపోవుట

(2) శ్రీ చక్రమును గీయించేవారు ఆర్టిస్టుకు సరిగా బోధపరచలేక పోవుట

(3) ఆర్టిస్టు శ్రీ చక్రమును గీచిన తరువాత దానిని ముద్రింప చేసేవారికి శ్రీ చక్రమును గూర్చిన జ్ఞానములేక పోవుట; ఉన్నా తగిన శ్రద్ధ లేకపోవుట. ఇట్లా ఇంకా ఎన్నో కారణములు.

షోడశదళమునకు భూపురత్రయమునకు మధ్య ఒక వృత్తమా లేక మూడు వృత్తములా అను విషయమును మనము పైన పేర్కొన్నాము. శ్రీవిద్యాను గూర్చి చాలా పుస్తకములను వ్రాసిన ఆర్థర్ అవలాన్ (Arthur Aovlon) అను విదేశీయుడు తను వ్రాసిన శ్రీవిద్యకు సంబంధించిన పుస్తకములన్నిటిలోను నాలుగు వృత్తములు పెట్టాడు.



# ముగింపు

మనము ముందు మాటలో శ్రీశ్యామలా కృష్ణ మండలి, నందగోకులము అనుబంధ సంస్థ చిన్తామణి ముక్తి ధామ్ వారు ప్రతి పూర్ణిమకు ఒక శ్రీ చక్రార్చన చొప్పున 108 అర్చనలు చేయాలని అనుకొని బామ్మగారి (వారణాసి మహాలక్ష్మి సుబ్బారావు) ఆధ్వర్యములో క్రియారూపములో పెట్టారని చెప్పుకొన్నాము.

అష్టోత్తర శతపూర్ణిమ శ్రీ చక్రార్చన బహుధాన్య పుష్యశుక్ల పూర్ణిమ (2-1-99) నాడు శ్రీ అహోబిల మఠము, దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ, బాగ్ అంబరుపేట, హైదరాబాదులో శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధిపతులు శ్రీ శివకాల్యాణానంద భారతీస్వామి వారి ఆధ్వర్యములో జరిగినది. ఈ ఉత్సవము మూడు దినములు జరిగినది.

మొదటగా విఘ్నేశ్వర పూజాదికములు, తరువాత శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిచే శ్రీ చక్రార్చన. అప్పుడే 102 మంది సువాసినులను శ్రీ చక్రాకారములో కూర్చున పెట్టి సృష్టి క్రమములో ఆవరణార్చన చేశారు. ఒక్కొక్క సువాసినికి ఆసనము పళ్ళెము, చీరె, రెవిక, వివిధ ఫలములు, పూలు, పసుపు, కుంకుమ, మండలి వారు సమర్పించారు. ఈ పూజలో శ్రీ శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠ కార్యదర్శి శ్రీ చెవుకుల రామకృష్ణ శర్మగారు, కోశాధికారి శ్రీ సరిపల్లె సుబ్రహ్మణ్య సోమయాజులు గారు ఇంకా ఎందరో పాల్గొన్నారు

సాయంత్రము 6గం॥లకు శ్రీదేవి ఎదురుకోల ఉత్సవము,

3-1-99 ఉదయము శ్రీమహాకామేశ్వరీ మహాకామేశ్వరుల కళ్యాణము. సాయంకాలము శ్రీవిద్యమీద ఉపన్యాసము,

4-1-99 ఉదయము శ్రీ మహాకామేశ్వర్యంబా శ్రీ మహాశ్రీచక్రనగర సామ్రాజ్ఞీ శ్రీ మహారాజరాజేశ్వరీ శ్రీ మహాత్రిపుర సున్దరీ ప్రతాపభారతీ పరదేవత సామ్రాజ్య పట్టాభిషేకము.

సాయంత్రము శ్రీ జె. ఈశ్వర ప్రసాదుచే రుక్మిణీ కళ్యాణము నాట్యప్రదర్శన మొదలైన కార్యక్రములు జరుపబడినవి.

ఈ మూడు దినములు వచ్చిన వారందరికి కాఫీ ఫలహారములు, రెండు పూటల వివాహ భోజనములు పెట్టి మహావైభవముగా శ్రీ శ్యామలా కృష్ణమండలివారు ఉత్సవము జరిపిరి. ఉత్సవమునకు వచ్చిన పెద్దలు కొందరు ఇటువంటి పూజ నభూతో నభవిష్యతి అన్నారు. రాలేని వారు ఆలస్యముగా తెలిసినవారు ఇటువంటి పూజ చూడలేక పోయినందుకు చాల విచారించారు.

శ్రీ శ్యామలాకృష్ణ మండలివారు దీక్షతో నిర్విఘ్నముగా 108 శ్రీ చక్రార్చనలు చేశారు. కావున దాని శాంతి ఇంకా 11 అర్చనలు చేయాలని నిర్ణయించుకొన్నారు. దానిలో 8 అర్చనలు శ్రీ శ్యామలాకృష్ణ మండలి సూత్రధారి అయిన బామ్మగారింటిలో చేశారు. మిగిలిన మూడిటిలో ఒకటి బృందావనములోను రెండు వారణాసిలోను చేశారు కాశీలో 100మంది వేదపండితులను శ్రీ శివకళ్యాణానంద భారతీస్వామి వారి సమక్షములో సన్మానించారు. ఒక్కొక్క వేద బ్రాహ్మణునికి ఆసనము, ధోవతుల చాపు పండ్లు రూ॥ 101 దక్షిణా ఇచ్చారు.

అమ్మవారిని షహనాయి మేళముతో గంగానది మీద ఊరేగింపుచేసి మండలి వారు తమ దీక్షను విరమించారు.

శ్రీచక్రార్చనతో ముల్లోకములలోను సాధించలేనిది ఏదీలేదు అంటే అన్నీ సాధించవచ్చును శ్రీచక్రార్చన, లలితా రహస్యనామ పారాయణము, శ్రీవిద్యోపాసన సామాన్య తపస్సుకాదు. చివరి జన్మలోనే మూడు లభ్యమగునని అందురు.

శ్రీ చక్రములోని బిందువు- రాజరాజేశ్వరీ ప్రభా భట్టారిక స్వరూపము. త్రికోణము- త్రిగుణముల ప్రతీక. అష్టకోణము-అష్ట ప్రకృతులను తెలుపును. అంతర్దశారము - అగ్ని యొక్క దశకళలను తెలుపును బహిర్దశారము-దశావతారముల తత్వమును తెల్పును. చతుర్దశారము -14 లోకములను తెల్పును. అష్టదళము-మహామాయా స్వరూపము. షోడశదళము - షోడశ చంద్రకళలను తెల్పును.

చాలామంది అనుకొనునట్లు శ్రీచక్రము ఉగ్రమైనది కాదు. చాల సౌమ్యమైనది. శ్రీచక్రముతో ఆదిశంకరులు విగ్రహములలోని ఉగ్రత్వమును పోగొట్టి సౌమ్యత్వము వచ్చుటకు ఆదేవతా విగ్రహముల ముందు శ్రీ చక్రములను ప్రతిష్టించారు. అందులో శ్రీశైలములోని భ్రమరాంబిక, కంచీపురములోని కామాక్షి, విజయవాడలోని కనకదుర్గమ్మ కొన్ని ఉదాహరణలు మాత్రమే.

శ్రీ చక్రము సౌమ్యాతి సౌమ్యమైన యంత్రము. దాని పూజకు మించిన పూజ లేదు కొందరు శ్రీ చక్రమును తాయత్తుగను, చెవిపోగులలోను, లోలాకులుగాను తలుపుల మీద, కర్మాగారములలోను కార్లకు, వాహనములకు కట్టవచ్చని అంటారు. అట్లాగే మరి కొందరు శ్రీ చక్ర భూప్రస్తారమును బంగారు, వెండి, రాగి మొదలగు రేకుల మీద ముద్రించి ధరించవచ్చు అంటారు రోగ నివారణకు ఆరోగ్యమునకు నల్లతాడుతోను; వ్యాపారము, సంపద, ఈతి బాధల నివారణకు ఎర్రతాడుతోను; విద్యా, జ్ఞానములకు తెల్లతాడుతోను శ్రీచక్రమును ధరించవచ్చు అని చెబుతారు.

ఒక విషయమును మనము గ్రహించుకోవాలి:

అమ్మ (శ్రీదేవి) అనుగ్రహముంటేనే నీవుపూజచేస్తావు. నీచేతిలో ఏమీలేదు. నీకేమీ తెలియదు. నీకేమీ లేదు. నీవు ఏమీ చేయలేవు. నీలోని ''నేను'' అను దానిని లేకుండ చేసికొని ఎల్లప్పుడు సాధారణత, నమ్రతలతో ఉండుట అలవరుచుకో. ఎప్పుడు ఎవరిని దూషించుటగాని, ద్వేషించుటగాని, విమర్శించుటగాని చేయరాదు. ఏపూజను విమర్శించరాదు ఇంతవరకు జరిగింది, జరుగుచున్నది, జరుగబోయేది అంతా అమ్మ ఇచ్ఛానుసారమే. అనేకత్త్వమునుండి ద్వ్యైవత్వము దానినుండి చివరకు ఏకత్వమును పొందుము.

అమ్మ దయా ధర్మముల కొరకు కోట్లాది త్రిమూర్తులు వారి భార్యలతో అమ్మదగ్గర వేచివుందురు. ఇక సామాన్యుల పరిస్థితి ఊహించుకోవలసినదే. ఏది ఏమైనా మనము అచంచల విశ్వాసముతో శ్రీ మహాకామేశ్వర్యంబా శ్రీమహాశ్రీచక్రనగర సామ్రాజ్ఞీ శ్రీ మహారాజరాజేశ్వరి మహాత్రిపుర సున్దరి పరదేవత యొక్క పాదములను ఆశ్రయించుట తప్ప భోగభాగ్యములకు ముక్తికి మనకు వేరు మార్గము లేదు, లేదు, లేదు.

అమ్మ పూజకు భక్తి, సమర్పణ భావము, శరణాగతి ముఖ్యమైనవి అందువలన అమ్మపూజాదికములు మనశక్తి కొలదే చేయాలే తప్ప ఎవరో, అమ్మపూజకు నవకాయ పిండి వంటలు, తొమ్మిది రకముల పూలు, తొమ్మిది రకముల ఫలములు, షడ్రసోపేత మహానైవేద్యము చేశారు. అట్లా అంతా చేయాలని లేకపోతే శ్రీమాత కరుణించదని అనుకొనుట శుద్ధ అవివేకము, ఈ సందర్భములో జగద్గురు శ్రీకృష్ణస్వామి అర్జునునకు చెప్పిన విషయములను జ్ఞప్తికి తెచ్చుకొనుచు "నాకు తెలిసిన శ్రీ చక్రము"నకు శాంతి పలుకుదాము.

పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

యత్కరోషి యదశ్నాసి య జ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ। తత్కురుష్వ మదర్పణమ్॥

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాస యోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥

(భగవద్గీత - 9అ- 26, 27, 28)

పరిశుద్ధాంతః కరణతో భక్తి పూర్వకముగా ఆకునుగాని, పువ్వునిగాని, పండునుగాని, జలమునుగాని నాకు సమర్పించిన స్వీకరింతును అన్నారు శ్రీకృష్ణ పరమాత్మ.

విదురుడు, ద్రౌపది పత్రమును, గజేంద్రుడు తోయమును భక్తితో భగవంతునికి అర్పించి కృతార్థులైరను సంగతి మనకు తెలిసినదే.

ఓ అర్జునా। నీవు ఏమి చేసినను, తినినను, హోమము చేసినను, దానము చేసినను ఇంత యేల సకలము నాకర్పణ చేయుము. అందువలన పుణ్యపాపఫల రూపములైన కర్మబంధములనుండి విడువ బడుదువు. అప్పుడు నీవు నన్ను పొందగలవు.

ఓం సహనావవతు। సహనౌ భునక్తు। సహవీర్యం కరవావహై। తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై॥ ఓం శాంతిః శాంతిః శాంతిః॥

# అనుబంధము - 1
# పూర్ణమ్

శ్రుతి, స్మృతి, పురాణములు, ఇతిహాసములు ఆర్యావర్తనమందలి ఆధ్యాత్మిక విజ్ఞాన భాండాగారములు. బ్రహ్మమును తెలిసికొన్నవాడు జీవితములో పరమోన్నత ఆశయమును సాధించిన వాడని అవి ఘోషించుచున్నవి. బ్రహ్మము జ్ఞానేంద్రియములతోను, మనస్సుతోను తెలిసికొనలేనిది; అద్వితీయమైనది. (ఏకమేవాద్వితీయము - one only without a second). మానవాతీత జ్ఞానముతో (Supreme intelligence) సద్గురుని సహాయముతో సాధించవలసినది — ''బ్రహ్మము''. సద్గురుని పరంపర మొదటి జగద్గురువైన భగవాన్ నారాయణునితో ప్రారంభమగును. ఆయనే తొమ్మిదిమంది ప్రజాపతులను, ప్రవృత్తి ధర్మమును, అయిదుగురు పవిత్ర ఋషులను, నివృత్తిధర్మమును ప్రసాదించెను. ప్రవృత్తి ధర్మమునే యోగము లేక కర్మ అని అందురు, నివృత్తి ధర్మమునే సాంఖ్య లేక జ్ఞానము అందురు. ఈ రెండు ధర్మములు నిజమైన సాధకులను బ్రహ్మజ్ఞానులుగా చేయును.

బ్రహ్మము బుద్ధికి అందనిది, భావింప శక్యముకానిది. ఎంత భావోన్నత పదములైనను (మాటలు), శ్రోతలను బ్రహ్మమును తెలుసుకొనునట్లు చేయలేవు. అందుకే భగవానుడు తన అనునయులకు నిజమైన జ్ఞానము (బ్రహ్మము) తెలియుటకు ఎన్నో పవిత్ర సాధనలను వారి ముందుంచెను. ఈ జ్ఞాన పద్ధతులన్నిటిని శాస్త్రీయముగా నాలుగు విధములుగా విభజింప వచ్చును (1) పదము (word), (2) బీజము (root cause), (3) సంఖ్యా (Number), (4) రేఖా (figure).

వీనిలో పదభాగము జ్ఞానమనే కల్పవృక్షము. దాని ప్రధానశాఖలు నాలుగు వేదాలు; ఉపశాఖలు స్మృతి; ఆకులు, పూలు, పురాణములు, ఇతిహాసములు; ఫలములు దర్శనములు. బీజము అంటే పవిత్రమంత్రము, అదే మూలకారణము; విత్తనము. దాని నుండే జ్ఞానమనే గొప్పవృక్షము ఉద్భవించును. సంఖ్య అంటే జ్ఞానమునకు ప్రాతినిధ్యము వహించే పవిత్రమైన అంకె (Holy number). రేఖ అంటే పవిత్ర ధ్యాస యొక్క పవిత్ర చిత్రము

(పటము) దానిని పారిభాషికముగా యంత్రము లేక చక్రము అందురు దానిని పూజింపబడే వస్తువుగా భక్తిభావముతో చూస్తారు సరియైన అవగాహన కొరకు ఇక్కడ సంఖ్యను బీజమును వేరుగా తీసికొన్నను అవి రెండూ ఒక్కటే, అవి కార్యరూపములో అతి సన్నిహిత సంబంధము గలవి

నిజమైన బ్రహ్మజ్ఞానాభిలాషికి పదము, బీజము, సంఖ్య, రేఖ అను ఈ నాలుగు శాఖలు జ్ఞానమునకు తాళం చెవులవంటివి.

ప్రతిబ్రహ్మచారికి మంత్రోపదేశము తరువాత పూజార్థము యంత్రమొక టివ్వబడును తరువాత వేదాధ్యయనము చేయవలెను మంత్రములో బీజము సంఖ్య వచ్చును పదము, మంత్రము, రేఖా శాస్త్రములలోని రహస్యములను తెలిసికొనుటకు మూడు శాస్త్రములు అభివృద్ధి చేయబడి పదిలపరచుటకు బ్రహ్మ ఋషులకు ఆధీనము చేయబడినవి అవి సామాన్యులకు అర్థముకాని నిగూఢ రహస్యములు ఆ మూడు విజ్ఞానములను పారిభాషికముగా పదశాస్త్రము, మంత్రశాస్త్రము, యంత్ర శాస్త్రమని అందురు పదశాస్త్రము పాణిని వ్యాకరణమునకు, మంత్ర శాస్త్రము సంఖ్యావిజ్ఞానమునకు, బీజగణితమునకును, రేఖా శాస్త్రమునకును, యంత్ర శాస్త్రము రేఖాగణితమునకు, వక్రరేఖా గణితమునకు, త్రికోణమితికిని పుట్టుక స్థానములైనవి. ఈ మూడు శాస్త్రములు పొందిక గలిగి బ్రహ్మమును తెలుపుటే తమ అంతిమ లక్ష్యముగా నున్నవి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ మూడు శాస్త్రములు ఒకే మూలము నుండి బయలుదేరిన మూడు అతికాంతివంతమైన రేఖలు లేక ఒకే బిందువు వద్ద కేంద్రీకృతమైన మూడు అసాధారణ కాంతిగల రేఖలు.

**వేద సాహిత్యము :-** బ్రహ్మర్షి వరుణుడు తన కుమారుడు భృగువునకును, బ్రహ్మర్షి ఉద్దాలకుడు తన కుమారుడు శ్వేతకేతునకు చేసిన ఉపదేశముల సారాంశము వేద సాహిత్యము యొక్క అంత్య లక్ష్యముగా నున్నది. వీరి బోధనలు వేద విజ్ఞానములోని ప్రాథమిక సిద్ధాంతములను క్రమపద్ధతిలో తెల్పును. నానావిధ ప్రాణులు ఒకే ఒక్క అద్వితీయమైన మూల కారణమువలన వికసించుచున్నవని ఈ రెండు బోధనలు నిష్కర్షగా చెప్పుచున్నవి. జీవితము యొక్క అత్యున్నత ధ్యేయమును సఫలపరచుకొనుటకు ఆ మూల కారణమును తెలిసికొనుట ఎంతైన అవసరము. ఆ సర్వశ్రేష్ఠమైన మూల కారణ జ్ఞానము వలన మనకు ప్రతి ఒక్క విషయమునకు సంబంధించిన జ్ఞానము కలుగును.

**దృశ్య ప్రపంచము :-** ఈ దృశ్య ప్రపంచము ఎంతో వైవిధ్యముతో కనుబడినప్పటికీ అది నామము, రూపము అను రెండు విధములుగా మాత్రమే ఉన్నది పదము, బీజము, సంఖ్య అను మూడు నామము క్రింద వచ్చును రూపమే రేఖ. ఈ నామము, రూపము అనునవి ఒకే వస్తువు యొక్క వివిధ దశలు మాత్రమే

ఈ దృశ్యమాన విశ్వమునకు మూల కారణము అద్వితీయమైన బ్రహ్మమే అని వేద విజ్ఞానము తెల్పుచున్నది ఈ దృశ్యమాన విశ్వము యొక్క వివిధ దశలను శాస్త్రీయ పరిశీలన చేసి వేద విజ్ఞాన సూత్రమందలి సత్యమును సరిచూద్దాము. ఈ దృశ్య విశ్వము పద, బీజ, సంఖ్య, రేఖ అను నాలుగే నాలుగు దశలను కలిగియున్నది అట్లు మనముందు పద ప్రపంచము, బీజా ప్రపంచము, సంఖ్యా ప్రపంచము, రేఖా ప్రపంచము అని నాలుగు ప్రపంచములున్నవి ఒకదాని తరువాత ఒకటి పరిశీలించెదము

**రేఖా ప్రపంచము :-** ఈ నాలుగు ప్రపంచములలోను ముందుగా పరిశీలించవలసినది రేఖా ప్రపంచము. ఎందుకనగా అది దృశ్య ప్రపంచమును తెలిపెడి రూపమునకు ప్రతినిధి. కనబడెడు ఆకారమును పారిభాషికముగా రూపమందురు రూపము యొక్క రేఖా చిత్రమును సామాన్యముగా చక్రము (పటము) అందురు. వేదములను పూజించేవారు అనేక చక్రములకు ప్రతిదినము పూజ చేయుట అందరికి తెలిసిన విషయమే. ఆ చక్రములు వారు పూజించు దేవతారూపములే. ఇట్లా పూజింపబడే అనేక చక్రములనే రేఖా ప్రపంచమందురు బ్రహ్మమును పొందుటకు ప్రధాన మార్గము రేఖా ప్రపంచమే. ప్రతి ఒక్కరికి అందుబాటులోనున్న అతి సామాన్య చక్రములలోని రహస్యములను తెలిసికొందము. బిందు చతుష్టయము, పంచకోణము, షట్కోణము అనునవి సామాన్య చక్రములు. వాటిని ఆవరించి వృత్త మొకటి ఉండును. ఆ వృత్తమును మర్యాద వృత్తమందురు. ఈ చక్రములు రేఖారూపంలో తెలిపే రహస్యజ్ఞానము అర్థమగుటకు తైత్తిరీయోపనిషత్తు తెలిసి ఉండవలెను.

**తైత్తిరీయోపనిషత్తు సారము :-** బ్రహ్మర్షి వరుణుడు తన కుమారుడు భృగువునకు ఈ విధముగా బోధించాడు. ''ఈ కనబడే జీవులు (భూతాని) బ్రహ్మ (ప్రజాపతి) నుండి స్తంభా (జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ) వరకు వాటి జన్మను బ్రహ్మము

నుండి పొందును'' బ్రహ్మవల్లి పురుష వికాసమును ఈ విధముగా చెప్పుచున్నది - బ్రహ్మము (ఇంకొక విధంగా ఆత్మ అంటారు) నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు; వాయువు నుండి ఆపః (నీరు), ఆపః నుండి పృథ్వి (భూమి); పృథ్వి నుండి మూలికలు; మూలికల నుండి అన్నము; అన్నము రేతస్సుగాను; రేతస్సు చర్మము, తల, చేతులు, మొండెము, కాళ్ళుగల పురుషుడుగా మారెను. బ్రహ్మము (ఆత్మ) నుండి క్రమ పరిణామములో చిట్టచివరకు ఏర్పడినది పురుషుడని అందురు. స్పష్టత కోసము శ్రుతి పురుషభాగములను ఈ విధముగా నిర్దేసించి చూపుచున్నది ఇది తల; ఇది కుడి పక్షము, ఇది ఎడమ పక్షము; ఇది పుచ్ఛము. పురుష శరీరమును పక్షి శరీరముగా పోల్చబడినది. గూడు చెడిపోతే ఎగిరిపోయే పక్షిలా శరీరము విడిచిపోవు జీవుని ధర్మము పరోక్షముగ చెప్పబడినది.

**మానవరూపము యొక్క అమరిక** :- ఒక పెద్ద విశాల ఇసుక ప్రదేశమునకు పోయి తల తూర్పునకు, కాళ్ళు పడమరకు ఉండునట్లు వెల్లకిలా పడుకొని చుట్టూ గణిత శాస్త్ర దృక్పథముతో పరిశీలించుము. దిక్చక్రము పరిధిగా గల వృత్తకేంద్ర బిందువుగా నీవు ఉండునట్లు నీకు తోచును.

ఇపుడు నీ కుడి అరచేతిని కుడి తుంటి మీదను, ఎడమ అరచేతిని ఎడమ తుంటి మీదను ఉంచి అరికాళ్ళు ఒక దానికొకటి ఆనునట్లు చేయుము. ఇపుడు బ్రహ్మరంధ్రము (తల మధ్యభాగము) దగ్గర మొదలుపెట్టి ఎడమ బాహుమూలము ఎడమ భాగమును ఎడమ మోకాలు చిప్ప, పాదముల మధ్యవేళ్ళు, కుడి మోకాలి చిప్ప, కుడి భాగము, కుడి బాహుమూలము గుండా బ్రహ్మరంధ్రమును కలుపుచు ఒక రేఖ గీయుము. అది ఒక 'ఎలిప్స్ (Elipse)' ఆకారములో ఉండును. మరల మెడ మధ్యభాగము నుండి మొదలు పెట్టి ఎడమ భుజము, ఎడమ మోచేయి, ఎడమ అరచేయి, లింగమును తాకుచు కుడి అరచేయి, కుడి మోచేయి, కుడి భుజము మెడ మధ్యభాగము కలుపుచు ఒక రేఖను గీయుము. ఇది కూడ ఒక 'ఎలిప్స్ (Elipse)' ఆకారములో నుండును.

ఇట్లా ఏర్పడిన రెండు ''ఎలిప్సులు'' లంబముగా ఒకదాని నొకటి ఖండించుకొనును ఆ పటము ఈ క్రింది ఆకారములో ఉండును




ఇట్లేర్పడిన ఆకారములో స్పష్టముగా (1) తల, (2) కుడి పక్షము, (3) ఎడమ పక్షము, (4) మొండెము, (5) తోక - అను అయిదు భాగములు కనబడును.

**బిందు చతుష్టయ చక్రము :-** ఇది అన్నమయ కోశము లేక స్థూల శరీరము యొక్క రేఖాపటము. ఈ పటమే మిగిలిన కోశముల యొక్క రేఖాపటమే అగును ఎందుకనగా శ్రుతి కోశము లన్నిటిలోను ఒకే భాగములను చెప్పినది. బ్రహ్మవల్లిలో చెప్పినట్లు ఇంకా ఇతర కోశములను గూర్చి చింతన చేసిన క్రమేణా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములను మరచి ఆనందమయ కోశముతో తాదాప్యత పొందుతాము. అప్పుడు మనము నాలుగు ప్రధాన బిందువులనే తలతుము. ఒకటి బ్రహ్మరంధ్రము, రెండు, మూడు కుడి ఎడమ మోచేతుల చివరి బిందువులు, నాలుగు, పాదముల మధ్య వేళ్ళు కలియుచోట ఉన్న బిందువు. మన రూపము చాల పెద్దదిగా ఊహిస్తే ఈ నాలుగు బిందువులు దిక్చక్రము పరిధిగా కలిగిన వృత్తము మీద ఉన్నట్లు తోచును. ఇదే బిందు చతుష్టయ చక్రము. ఇదే బ్రహ్మవల్లిలో చెప్పిన సూక్ష్మ ప్రపంచ (పురుష) రేఖా చిత్రము. సూక్ష్మ ప్రపంచమంటే జగత్తు యొక్క సంగ్రహ రూపము. ఈ జగత్తే పురుష సూక్తములో చెప్పబడిన పురుషుని పూజించుటకు అర్హతగలవారు పూజించే చక్రమని నిర్దేశించారు.

ఇట్లే వేరువేరు భంగిమలలో పడుకొని రేఖలు గీచిన పంచకోణము ఏర్పడును. పురుషుని శివరూపములో కొల్చువారు ఈ చక్రమును పూజింతురు.

**షట్కోణము :-** షట్కోణము శ్రీకృష్ణ పరమాత్మ కుడిచేతిలో నుండు సుదర్శన చక్రమును తెల్పును. వేదాంత సత్యము మీది భాష్యమును దర్శనమందురు. ''సు'' అనగా స్పష్టము లేక పరిపూర్ణము అని అర్థము. కావున సుదర్శన మంటే స్పష్టమైన లేక పరిపూర్ణమైన వేదాంత భాష్యమని అర్థము. ఈ సుదర్శనమే భగవాన్ శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ కుడిచేతిలో ధరించే చక్రము. భగవద్గీత పదరూపములో శ్రీకృష్ణ భగవానుని స్పష్టమైన దర్శనమని చెప్పకయే చెప్పుచున్నది కాని ఆయన

కుడిచేతిలోని చక్రము రేఖారూపములోని దర్శనము కావున భగవద్గీత అంతా షట్కోణమనే ఈ సామాన్య చక్రభాష్యమే అంతేకాదు షట్కోణమంటే సంక్షిప్తముగా భగవద్గీత అని (Gita in a Nutshell) అదే అనాది కాలము నుండి పూజింపబడే పవిత్ర చక్రముల గొప్పతనము

ఈ పవిత్ర యంత్రములన్నీ గణిత సిద్ధాంతములతో పొందిక గలిగి, గణిత సంబంధమైన పటముల కలయిక వలన ఏర్పడినట్లు తెలియుచున్నది ఈ యంత్రములను గణితశాస్త్ర సిద్ధాంతపరముగా పరిశీలించిన వేదాంత విద్యార్థి క్లిష్ట వేదాంత సమస్యలను స్పష్టముగా సులభముగా తెలిసికొనగలడు. అందుకు కారణము గణిత శాస్త్రజ్ఞులు తమ గణిత సిద్ధాంతములను మొదట ఈ చక్రముల నుండి వేదాంత సత్యముల నుండియే ఏర్పరచుకొనిరి. ఒక్క మాటలో చెప్పాలంటే రేఖా గణితమంతా షట్కోణము (సుదర్శనము) నుండి వృద్ధి చెందినది వక్ర రేఖాగణిత శాస్త్రము (Conics) పంచకోణము నుండి ఉద్భవించినది.

వేదాంత భావనల నుండే గణిత సంబంధమైన పటములు ఏర్పడినవి. దానికి కొన్ని ఉదాహరణములను పరిశీలిద్దాము. (1) బిందువు, (2) సరళరేఖ, (3) కోణము, (4) సమబాహు త్రిభుజము, (5) చతురస్రము, (6) వృత్తము. (7) పెరాబొల, (8) హైపర్బొలా, (9) ఎలిప్స్ - వీటిని కానిక్స్ అంటారు. శంఖువు (Cone) సమతలముచే ఖండింపబడినపుడు ఖండిత తలములచేత ఏర్పడు పటములను కానిక్స్ అందురు. మొదటి క్షేత్రగణిత శాస్త్రజ్ఞుడు తన సిద్ధాంత నిర్మాణమునకు అవసరమగు పటములను ఏర్పరచుకొనుటకు అతడు ఉపయోగించిన శంఖువు ఏదనగా అనాదికాలము నుండి ఆర్యావర్తములోని మహానుభావులచే పూజింపబడే దివ్యమైన పవిత్ర శంకువు — అదే అదే పూజ్యమైన శ్రీ చక్ర మేరు ప్రస్తారము. దీనిని బట్టి గణిత శాస్త్ర పటము లన్నిటికి మూలము శంకువని తెలియుచున్నది కానిక్స్ నిర్వచనము గూడ పై విషయమునే దృఢపరచుచున్నది. ఉత్కేంద్రత ఒకటి అయిన పెరాబొ గా; ఒకటికంటే తక్కువైన ఎలిప్స్; సున్న అయిన వృత్తము అగును

ప్రాజెక్టివ్ జామెట్రి నుండి పరిశీలించిన కానిక్స్, సమతల పటములు అన్నీ గూడ వృత్తము నుండే ఏర్పడినవని ఇంకొకటి లేదని తెలియుచున్నది ఈ ఒక్క విషయమును వేద విజ్ఞానాభిలాషులు గ్రహించిన వారు బ్రహ్మము - అదే పూర్ణము - అన్నిటికి మూలకారణమని తెలిసికొందురు.

(1) బిందువు, (2) సరళరేఖ, (3) కోణము, (4) సమబాహు త్రిభుజము, (5) చతురస్రము, (6) వృత్తము ఏ వేదాంత సత్యాములను తెలుపుచున్నవో తెలిసికొందము.

**(1) బిందువు** :- బిందువు అవిద్యను సూచించును. అవిద్య అంటే మిథ్య అని తలంపవచ్చును. మిథ్యకు నిశ్చయమైన ఉనికి లేదు; కాని అప్పటికి మాత్రము ఉన్నట్లు కనబడును. బిందువుకు భాగములుగాని, పరిమాణముగాని లేవు. బిందువుకు విజ్ఞాన శాస్త్రములో అనేక విధములైన ఉపయోగములున్నవి. పటముల యొక్క ఏ ధర్మము బిందువునకు లేదు. కావున బిందువునకు గణిత సంబంధమైన రూపం వేదాంతపరమైన అవిద్య, మిథ్య యొక్క ప్రతిధ్వనిగా మాత్రమే. ''సున్న'' వ్యాసార్థముగాగల వృత్తమే బిందువు అను సమీకరణము గూడ వేదాంత సిద్ధాంతమును ధ్రువపరచుచున్నది

**(2) సరళరేఖ** :- సరళరేఖ గుణమును తెలుపును. గుణమంటే వింటి నారి అని అర్థము. వేదాంతములో గుణమంటే సత్వ, రజో, తామస త్రిగుణములలో ఒకటి. ఈ త్రిగుణములు ప్రకృతి యొక్క అంశీభూతములు. వేదాంతి యొక్క అధ్యాస నియమమునకు సరళరేఖ ప్రాథమిక ఉదాహరణ.

**అధ్యాసము (superimposition)** : దిక్చ్రక్రము వృత్తాకారముగా కనబడును. దిక్చ్రక్రములోని ఏ భాగమైన వక్రలేఖలోని భాగము కావున - సహజముగా వక్రరేఖగా వుండును. దిక్చ్రక్రం మీది ఏ రెండు సమీప బిందువుల మధ్యనైన సరళరేఖగా కనబడును. ఈ పరిశీలనే వృత్తము N భుజములు గల బహుభుజి అని సిద్ధాంతీకరించుటకు ఉపయోగపడినది. ఒకే ప్రదేశము వక్రరేఖచే పరివృతమై (దిక్చ్రక్రము) ఉండుట మరియు N సరళరేఖలుగా నుండుట అసంభవము. ఒకటి సత్యమైన రెండవది అసత్యమగును. దిక్చ్రక్రము ఒకే వక్రరేఖ (వృత్తము) అనునది సత్యము, N భుజములు అనునది కేవలము అధ్యాసము (Superimposition).

అధ్యాసము అంటే అధిష్ఠానము ఆక్రమించుట అని అర్థము అధ్యాసమునకు ఉపయోగమున్నది అది సత్యముతో కలిసిమెలిసి వ్యవహారికము (worldly life) నకు పారమార్థిక (The Reality) రహస్యములను తెలిసికొనుటకు ఉపకరించును.

సరళరేఖ, బహుభుజిల అధ్యాసము వలననే వక్రరేఖాత్మక పటముల వివిధ కొలతలను పొందగలము

**3. కోణము :-** కోణము వేదాంత గుణమును తెల్పును. కోణము రెండు సరళరేఖల మధ్యనున్న వాలును తెలుపును సరళరేఖలు గుణములను (త్రిగుణము) తెల్పును. కోణము నుండి గ్రీకు భాషలోని గొనియ అను పదము పుట్టినది. కోణము వేదాంతపరమైన గుణమును తెల్పును గొనియము అను గ్రీకు పదము గుణ అను సంస్కృత పదము నుండి పుట్టినదని గూడ అనుకొనవచ్చును.

**4. సమబాహు త్రిభుజము :-** త్రిగోన్ (Trigon) అను గ్రీకు పదము దాదాపు త్రిగుణము అను సంస్కృత పదమునకు సమానార్థకము. త్రిగుణము అనగా సత్వ, రజో, తమో గుణముల కలయిక. ఈ మూడు గుణములతో కూడినదే ప్రకృతి. కావున సమబాహు త్రిభుజి వేదాంత ప్రకృతిని తెల్పును. (మూడు భుజములు సమానముగా నున్న త్రిభుజిని సమబాహు త్రిభుజమందురు)

**5. చతురస్రము :-** బిందు చతుష్టయ యంత్రములోని ప్రధాన బిందువులను తెలుపునది చతురస్రము. చతురస్రమును భూపురమందురు భూపురమనగా నిర్ణీత కొలతలు, సరిహద్దులు గల ప్రదేశము మీదు క్షేత్రము.

**6. వృత్తము :-** అన్ని పటములకు ప్రాథమిక కారణము వృత్తమందురు. కావున అది బ్రహ్మము అనగా పూర్ణమును తెలుపును. దిక్చక్రము పరిధి (సరిహద్దు)గా గలిగి పూర్తి కనుచూపు మేరలో నుండు భూమి మీదు గరిష్ఠ క్షేత్రమును వృత్తమందురు. ఈ ప్రదేశమునే ఆకాశమందురు. ఈ కనబడే ఆకాశమే శరీరముగా గలవాడే బ్రహ్మము (ఆకాశ శరీరం బ్రహ్మ) అని తైత్తిరీయోపనిషత్తు చెబుతున్నది. ఇంకొక శ్రుతి బ్రహ్మను ''గగన సదృశం'' (ఆకాశమును పోలియుండుట) అని అంటున్నది. కనబడే (దృశ్యమానమైన) ఆకాశమే వృత్తము. కావున వృత్తము దృశ్యబ్రహ్మము (Brahma the visible). అందుకే సంస్కృతములో వృత్తమును పూర్ణమందురు. పూర్ణము అను పదము బ్రహ్మమునకు సమానార్థకము.

తత్ ఉహం నామ్యాభవత్'' - బ్రహ్మ విరాట్ ప్రజాపతిగా సృష్టమైన తరువాత ప్రజాపతి 'అహమస్మి' - 'నేను వున్నాను' అని అనుకొన్నాడు. అందుచేతనే అతడు ''అహం'' అనే పేరు కలవాడైనాడు. మొదటి వ్యక్తిగత నామవాచకము (Proper Noun) ప్రపంచకములో మొట్టమొదటి సర్వనామమైనది (Pronoun). మొదటి పురుషుడైన ప్రజాపతి పేరు ''అహం'' అదే (అహం) మొదటి పురుషుని యొక్క సర్వనామమైనది.

అహం - అ, హ, ం - అను మూడు అక్షరముల కలయిక. సంస్కృతవయాకరణి దృష్టిలో అహం అనగా 'అ'తో మొదలై బిందువుతో కూడిన 'హ'తో అంతమయ్యే 49 లేక 42 అక్షర సమామ్నాయమును లఘువుగా చెప్పే పద్ధతి. ప్రజాపతి తన శరీరము వర్ణ సమామ్నాయముతో చేయబడినదని గ్రహించి ''అహం'' అని పలికెను ఈ వేదరహస్యము వెనుక ఉన్న రహస్యమును మంత్రశాస్త్రములోని మాతృకాన్యాసము వలన తెలియును.

ఈ అక్షరములు నానా విధములుగా నున్నప్పటికీ అవి ఒకే అక్షరము యొక్క మార్పులు. అది భాషాపరిమితులకు అతీతమైనది. అదే ''సంవృత అకారము'' వేదమాత ''సంవృతము''ను ఈ విధంగా చెప్పింది : ''అకారో వయి సర్వ వాక్ శేషస్య స్పర్శాంతస్థోష్మ భిర్వ్యజయమాన భవి నానారూపా''. శ్రీకృష్ణ భగవానుడు గూడ ఇదే ఇట్లు చెప్పినాడు : '' అక్షరాణామకారో ఽస్మి'' (భ.గీ.10-32) అక్షరములలో 'అ' కారమును అయి వున్నాను.

పాణిని వ్యాకరణమును సునిశితముగా పరిశీలించిన ఈ అకారము యొక్క విశేషము తెలియును. పాణిని వ్యాకరణము మహేశ్వర సూత్రములతో ఆరంభమై ''అ అ'' అను సూత్రముతో పూర్తి అగును (పా 8-4-68) పాణిని వ్యాకరణము 'అ' - అచ్చు (స్వరం) తో మొదలై, 'అ' అచ్చు (స్వరం) తో పూర్తి అగును. ఇట్లు గ్రంథము మొత్తమును రెండు ఒకే అచ్చుల మధ్యలో ఇముడ్చుట వేదము యొక్క అమరికను అనుకరించుటే. వేదముకు గూడ అదే స్వరములు మొదలు చివర ఉన్నవి శ్రుతి ఇట్లు చెప్పుచున్నది .

ప్రమాణములు. వేదములన్నీ ''ఓం'' అను ఏకాక్షరము యొక్క అర్థమే అని శ్రుతి చెప్పుచున్నది. ''ఓం'' అంటే బ్రహ్మము అని సర్వము అని అందురు. (ఓం ఇతి బ్రహ్మ; ఓ మితిదమ్ సర్వమ్).

ఆర్యావర్త పవిత్ర సాహిత్యమైన శ్రుతి, స్మృతుల అంత్య లక్ష్య మెల్లప్పుడు ''బ్రహ్మమే'' అని భగవాన్ కృష్ణద్వైపాయన భారతీ వేదవ్యాసుల వారి వేదాంతదర్శనము చాటుచున్నది. ''అథాతో బ్రహ్మజిజ్ఞాస'' అనునది వేదాంత దర్శనము ప్రారంభ సూత్రము.

శ్రీకృష్ణ పరమాత్మ తన విశ్వ విఖ్యాత స్మృతి భగవద్గీతలో సర్వ వేదముల ప్రధాన లక్ష్యము ''అహం'' అని చాటి చెప్పెను. (వేదైశ్చ సర్వైరహమ్ మేవ వేద్యో, వేదాన్త కృద్వేద విదేవచాహమ్ - భ.గీ 15-15). ఆ బ్రహ్మము ''ఓమ్'', ''తత్'', ''సత్'' అను మూడు పదముల చేత తెలియబడుచున్నది. (ఓమ్ తత్సత్ ఇతి నిర్దేశో బ్రహ్మనాహ త్రివిధాహస్మృతః)

పైన పేర్కొనిన విషయమును, అట్టివే అయిన ఇతర శ్రుతి, స్మృతులలో చెప్పిన విషయములను నిశితముగా పరిశీలించిన మన ప్రధాన గమ్యము ప్రత్యేకముగా ఓమ్, బ్రహ్మ, అహం అను మూడు పవిత్ర పదములుగాను, ఇంకా ఎన్నో ఇతర పదములచేతను తెలుపబడుచున్నది. వానిలో ముఖ్యమైనవి క్రింద ఇవ్వబడినవి అవి :

(1) పురుష (2) సర్వమ్ (3) ఆనంద, (4) దహర, (5) శరీర , (6) రస, (7) గతి, (8) శివ, (9) ప్రణవ, (10) పద, (11) అజ, (12) ఆత్మ, (13) సత్, (14) భూమ, (15) కర్త, (16) ఇష్టే , (17) గర్భ, (18) యజ్ఞ, (19) స్వపితి, (20) పురీషియ, (21) ప్రజాపతి, (22) తారక, (23) తత్, (24) పూర్ణమ్, (25) తురీయ, (26) పరమ్, (27) గాయత్రీ, (28) యంత్ర, (29) చక్ర, (30) సుదర్శనము.

ఇవన్నీ బ్రహ్మము లేక ఓమ్ అను వానికి సమానార్థక పదములు. వాని అర్థములు చెప్పుటకే శ్రుతి, స్మృతులు ఏర్పడినవి

★★★

# బీజాప్రపంచము

బీజమనగా మంత్రమనియు, నామము యొక్క రూపమనియు చెప్పుదురు. నామము నుండే పద ప్రపంచము ఏర్పడినది. శ్రుతి, స్మృతుల యొక్క అంత్యాగమ్యము ''ఓం'', గాయత్రి అను రెండు పవిత్ర మంత్రములని చెప్పిన ఆశ్చర్యములేదు. ''ఓమ్ ఇతి ఇదమ్ సర్వమ్'' — ''గాయత్రీవ ఇదమ్ సర్వమ్'',''ఓమిత్యేకాక్షరమ్ బ్రహ్మ''.

**నామము యొక్క ఆరంభము :-** పద, బీజ ప్రపంచముల పరస్పర ప్రాధాన్యత ఏమైనను అవి రెండు సంస్కృతవర్ణముల (అక్షర సమామ్నాయము) కలయిక వలన ఏర్పడినవే. అక్షర సమామ్నాయము నారాయణ సమామ్నాయము, మహేశ్వర సమామ్నాయము అని రెండు విధములు. నారాయణ సమామ్నాయములో అ, క, చ, ట, త, ప, య, స అను ఎనిమిది వర్గములుండును. వానిలోని అక్షరములు :

| | | | |
|---|---|---|---|
| (1) | అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ<br>ఏ ఐ ఓ ఔ అం అః | - | అ - వర్గము |
| (2) | క ఖ గ ఘ ఙ | - | క - వర్గము |
| (3) | చ ఛ జ ఝ ఞ | - | చ - వర్గము |
| (4) | ట ఠ డ ఢ ణ | - | ట - వర్గము |
| (5) | త థ ద ధ న | - | త - వర్గము |
| (6) | ప ఫ బ భ మ | - | ప - వర్గము |
| (7) | య ర ల వ శ ష | - | య - వర్గము |
| (8) | స హ క్ష | - | స - వర్గము |

- ఇవి అ-తో ప్రారంభించి క్ష-తో అంతమగు 50 అక్షరములు.

మహేశ్వరుడు పాణిని కిచ్చినది మహేశ్వర సమామ్నాయము. దానిలో ఈక్రింది 14 సూత్రములున్నవి.

(1) అ ఇ ఉ ణ్। (2) ఋ ఌ క్। (3) ఏ ఓ ఙ్। (4) ఐ ఔ చ్।

(5) హయవరట్ । (6) లణ్ । (7) ఞమఙణనమ్ । (8) ఝ భ ఞ్ । (9) ఘఢధష్ । (10) జబగడదశ్ । (11) ఖఫఛఠథచటతవ్ । (12) కపయ్ । (13) శషసర్ । (14) హల్ ।

మహేశ్వర సమామ్నాయములోని వర్ణమాల : అ ఇ ఉ । ఋ ఌ ॥ ఏ ఓ । ఐ ఔ ॥ హయవర । ల ఞ మ ఙ ణ న । ఝ భ । ఘ ఢ ధ । జ బ గ డ ద । ఖ ఫ ఛ ఠ థ చ ట త । క ప । శ ష స హ ॥

ఇందులో అచ్చులు అ - తోను, హల్లులు హ - తోను ప్రారంభింపబడినవి. అందువలన మహేశ్వర సమామ్నాయమునకు ''హాది'' మాతృక అని పేరు. దీని మీదనే పాణిని వ్యాకరణము.

ఈ రెండు సమామ్నాయములకు అక్షరముల వరుస ఏర్పాటులోను చాల వ్యత్యాసమున్నప్పటికి సారూప్య మొకటి ఉన్నది. అది రెండింటిలోను మొదటి అక్షరము ''అ'' చివరిది ''హ'' అగుట. రెండింటిలోను మిగిలిన అక్షరములు వీటి మధ్యనున్నవి. దీనిని బట్టి వర్ణ సమామ్నాయము ''అహం'' యొక్క ప్రత్యాహారమని తెలియుచున్నది. ప్రత్యాహార మనగా వర్ణ సంగ్రహమని అర్థము.

''అహం'' అంటే ఏమిటి ? ''అహం'' ఉత్తమ పురుష ఏకవచనమని లోకానికి తెలుసు. వేద భాషలో ''అహం'' ను సర్వ నామమందురు. సర్వ నామమనునది ''సర్వం'', ''నామము'' అను రెండు పదముల కలయిక వలన ఏర్పడిన సమాసము. ''సర్వం'' అనగా అన్నీ అని, ''నామం'' అనగా పేరు అని అర్థము. అంటే అన్నిటి పేరు అని. కాని వేదభాషలో ''సర్వమ్'' అనగా బ్రహ్మము లేక జగత్ అని అర్థము కావున సర్వనామము అనగా బ్రహ్మము యొక్క నామము లేక జగత్ యొక్క నామము అని అర్థము. అనగా ''అహం'' అనుపదము బ్రహ్మమును లేక జగత్తును తెలుపును.

''అహం'' బ్రహ్మము పేరగుట వలన దానిని సర్వనామమనిరి బృహదారణ్యకోపనిషత్తు ఈ విధంగా చెప్పుచున్నది, ''సోఽహమస్మీత్యగ్రే వ్యాహరత్,

తతో ఉహం నామాభవత్'' - బ్రహ్మ విరాట్ ప్రజాపతిగా సృష్టమైన తరువాత ప్రజాపతి 'అహమస్మి' - 'నేను వున్నాను' అని అనుకొన్నాడు. అందుచేతనే అతడు ''అహం'' అనే పేరు కలవాడైనాడు. మొదటి వ్యక్తిగత నామవాచకము (Proper Noun) ప్రపంచకములో మొట్టమొదటి సర్వనామమైనది (Pronoun). మొదటి పురుషుడైన ప్రజాపతి పేరు ''అహం'' అదే (అహం) మొదటి పురుషుని యొక్క సర్వనామమైనది.

అహం - అ, హ, ం - అను మూడు అక్షరముల కలయిక. సంస్కృతవయాకరణి దృష్టిలో అహం అనగా 'అ'తో మొదలై బిందువుతో కూడిన 'హ'తో అంతమయ్యే 49 లేక 42 అక్షర సమామ్నాయమును లఘువుగా చెప్పే పద్ధతి. ప్రజాపతి తన శరీరము వర్ణ సమామ్నాయముతో చేయబడినదని గ్రహించి ''అహం'' అని పలికెను. ఈ వేదరహస్యము వెనుక ఉన్న రహస్యమును మంత్రశాస్త్రములోని మాతృకాన్యాసము వలన తెలియును.

ఈ అక్షరములు నానా విధములుగా నున్నప్పటికీ అవి ఒకే అక్షరము యొక్క మార్పులు. అది భాషాపరిమితులకు అతీతమైనది. అదే ''సంవృత అకారము''. వేదమాత ''సంవృతము''ను ఈ విధంగా చెప్పింది : ''అకారోవయ సర్వ వాక్ శేషస్య స్పర్శాంతస్తోష్మ భిర్వ్యజయమాన భవి నానారూపా''. శ్రీకృష్ణ భగవానుడు గూడ ఇదే ఇట్లు చెప్పినాడు : '' అక్షరాణామకారోఽస్మి'' (భ గీ.10-32) అక్షరములలో 'అ' కారమును అయి వున్నాను.

పాణిని వ్యాకరణమును సునిశితముగా పరిశీలించిన ఈ అకారము యొక్క విశేషము తెలియును. పాణిని వ్యాకరణము మహేశ్వర సూత్రములతో ఆరంభమై ''అ అ'' అను సూత్రముతో పూర్తి అగును (పా. 8-4-68). పాణిని వ్యాకరణము 'అ' - అచ్చు (స్వరం) తో మొదలై, 'అ' అచ్చు (స్వరం) తో పూర్తి అగును. ఇట్లు గ్రంథము మొత్తమును రెండు ఒకే అచ్చుల మధ్యలో ఇముడ్చుట వేదము యొక్క అమరికను అనుకరించుటే. వేదముకు గూడ అదే స్వరములు మొదలు చివర ఉన్నవి. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది :

యోవేదో స్వర ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్టితః ।
తస్య ప్రకృతి లీనస్య యః పరస్స మహేశ్వరః ॥

పాణిని చివరి సూత్రములో చెప్పదలచినది ఒకే ఒక్క అకారమున్నదని -- అదే సంవృత అకారము అది భాషాపరిమితికి అతీతమైనది. ఆ అకారము (సంవృత) భాషకు మూలము. కాదు బీజము. ఈ సంవృత అకారము బ్రహ్మమును తెలుపు వర్ణమా ! బ్రహ్మమునకు విశ్వమునకు గల సంబంధమెట్టిదో సంవృత అకారమునకు భాషకు గల సంబంధమట్టిది బ్రహ్మము విశ్వములోని వస్తువులన్నిటికి అతీతుడు; కాని వాటితో కలిసి వాటికి స్థిరత్వమిచ్చును. అదే విధంగా ఈ అకారము (సంవృత) భాషలోని మాటల నుండి వేరుగా ఉంటూ అక్షరములకు ఉచ్చారణలో స్థిరత్వమునకు కావలసిన బలమును (Potency) ఇచ్చును. ఈ 'అ' (సంవృత అకారము) సహాయము లేకుండ భాషలోని ఏ అక్షరమును సరిగా పలుకలేము ఒక్క అక్షరము (సంవృత అకారము) వర్ణ సమామ్నాయములోని వివిధ వర్ణముల పుట్టుకకు కారణమగుట అద్భుతము; ఆశ్చర్యము ఈ అక్షరముల వివిధ రకముల కలయిక వలన ఎన్నో మాటలు ఏర్పడినవి. అవి పవిత్ర శ్రుతి, స్మృతుల శరీరమైనవి అదే విధంగా ఈ విభిన్న విశ్వమునకు బ్రహ్మమే ప్రాథమిక కారణమని చెప్పవచ్చును

సంవృత అకారము పరమేశ్వర రూపమని ఈక్రింది శిష్ట స్మృతిచేత తెలియుచున్నది.

అకారః సర్వ వర్ణాగ్ర్యః ప్రకాశః పరమేశ్వరః ।
ఆద్య మన్యేన సంయోగాదహ మిత్యేవ జాయతే ॥

**బిందువు (ం) విసర్గ (ః)** :- సంస్కృతములో బిందువు, విసర్గ అను రెండు స్వరములను ఎటువంటి పరిస్థితులలోను వాటి రూపములలో ఉచ్చరించలేము వాటిని ఉచ్చరించుటకు తప్పనిసరిగా 'అ' సహాయము కావలెను. 'అ' సహాయము లేకుండ అవి ఏమీ కావు; కాని, 'అ'తో అద్భుత ప్రక్రియను చూపును. అందువలన అవి — బిందువు, విసర్గ — ప్రకృతి, వికృతులను తెల్పును. అహం అను పదము అకార, విసర్గ, బిందువు (అ, ః ం) అను మూడు స్వరముల కలయిక అని కాదు. 'అహం' అనునది బ్రహ్మము, ప్రకృతి, వికృతుల సమ్మేళనమని అనుకొనవచ్చును.

# సంఖ్యాప్రపంచము

నామ ప్రపంచము యొక్క సాధారణ రూపము సంఖ్యా ప్రపంచము పద, రూప ప్రపంచములను సంఖ్యా ప్రపంచము కలుపును వివిధ రకముల రూపములను నామములతో పోల్చి సంఖ్యాప్రపంచము వివరించును ఒక్క మాటలో చెప్పాలంటే సంఖ్యా, ఆకృతి వ్యాక్తిల మధ్యమార్గములో నుండును, అది (సంఖ్యా) కార్యకారణములను విశదపరచును. వేదభాష చాల భావగర్భితమైనది దాని ప్రతి మాటకు - లేదు - ప్రతి అక్షరమునకు విశేషమైన సంఖ్యాసంబంధ విలువ గలదు సంఖ్యలను చెప్పుటకు ఉపయోగింపబడు పదములు కొన్ని అందరికి తెలిసినవే. కాని పదములోని ప్రతి అక్షరమునకు ఒక అంకె ఉండును అక్షరములకు అంకెలకు గల సంబంధమును తెలుపు వరరుచి చెప్పిన సూత్రములు కొన్ని ఉదాహరణగా చూద్దాము.

ఉదా కాది నవ, టాది నవ, యాద్యష్ట, పాది పంచ

ఈ సూత్రములు సహజమైనవి, శాస్త్రీయమైనవి ఈ విలువలను ఉపయోగించి వేరువేరు పదముల సమానార్థకములను తేలికగా తెలుసుకొనవచ్చును సంస్కృత అక్షరములకు అంకెలకు గల నిగూఢ సంబంధముతో వేద సాహిత్యము యొక్క దేవ సంబంధమైన ఔన్నత్యమును తలిసికొనగలము. వేద సాహిత్యము సంఖ్యా ప్రపంచముల సంబంధము విడదీయలేనిది. వేదమును ఛందస్సు అని అందురు. ఛందస్సుకు వేదములో అర్థము సంఖ్యా అని. ప్రతి మంత్రమునకు ఛందస్సు ఒకటి ఉండును. అది (ఛందస్సు) ఆ మంత్రము యొక్క సంఖ్యాసంబంధమైన ప్రాధాన్యతను తెలుపును. కావున సంఖ్యా ప్రపంచము యొక్క మర్మముల పరిశోధనకు వేదాంత క్షేత్రములో విశేష ప్రాముఖ్యత ఉన్నది. సంఖ్యా లక్షణములు ఎంతవరకు వేదాంత సిద్ధాంతములను ధ్రువపరచునో పరిశీలిద్దాము

గణిత సంబంధమైన పటములకు ప్రధాన కారణము వృత్తము. పద ప్రపంచమంతా 'ఓం' మీద కేంద్రీకృతమై ఉన్నది. అదే విధముగా సంఖ్యలన్నిటికి మూల కారణమైన సంఖ్యను తెలిసికొన్న మన ధ్యేయము నెరవేరినట్లే.

---

సంఖ్యాప్రపంచమంతా 9 అంకెలు, సున్న యొక్క మార్పులే అని చెప్పుటకు ఏ నిరూపణ అవసరము లేదు. అనంతము (Infinity) అనే ఇంకొక సంఖ్య కలదు. అది ఎంత పెద్దదో చెప్పలేము. దీనిని పరమ్ లేక ఆర (ara) అని అందురు. ఆ పదములు బ్రహ్మమును తెలుపును. పరమ్ అను పదమునకు సంస్కృతములో ఒక ప్రత్యేకమైన స్థానము గలదు. దానిని మూడు లింగములలో (పుంలింగము, స్త్రీ లింగము, నపుంసక లింగము) ప్రత్యేక ప్రాధాన్యతతో ఉపయోగించెదరు.

**పుంలింగము** : పరాహ అంటే పురుషుడు. (The man) అతడు తనను అహంగా భావించును. అతడిని వేదఋషులు 'ప్రణవ' మని పిలుస్తారు.

**స్త్రీలింగము** : పరా అనేది అనంతమను సంఖ్య (infinity) ను తెలుపును.

**నపుంసక లింగము** : పరమ్ అనగా వృత్తము.

వీటి అన్నిటిపైన వేద సంబంధమైన పరమ్ అనునది పరబ్రహ్మమును (The Brahma Supreme) తెల్పును. కావున అనంత సంఖ్య (infinity) బ్రహ్మమును సూచించును.

**పురుష** :- ఋషులు పురుషుని ప్రణవమని అన్నారు. దానికి కారణము పురుషున్ని ''నవాహ'' అన్నది. (నవో నవో భవతి జయ మానహ). నవాహ యొక్క నపుంసక లింగము ''నవ''. నవ అనగా తొమ్మిది కావున తొమ్మిది సంఖ్య పురుషున్ని ప్రజాపతిని, ఈశ్వరుని, మొదటి మనిషిని తెల్పును. పురుషుడు తాను అహం అనుకొనును అహం అనే పదములో ''అ, హ, ం'' (అ, హ, బిందువు) అనే మూడు అక్షరములున్నవి. వాటిలో 'అ' ఒకటి (1)ని, 'హ' ఎనిమిది (8) ని బిందువు సున్న (0)ను సూచించును. కావున అహం 180కి సమానము. (అహం = 180) (సంఖ్యా అనుబంధము చూడుడు). ''అహం'' ఏ విధముగా నేను అకారము నుండి ''హ'' కారము వరకు బిందువుతో సహా వర్ణరూపమును అని సూచించునో, అదే విధంగా అహం నేను బిందువుతో పదునెనిమిదికి సమానము అని కూడ సూచించును. ఆ విధముగా ''అహం'' సంస్కృత వర్ణమాలకు అంకెలకు ఉత్పత్తి స్థానముగా నున్నది ''అహం''కు రెండు విశేషములున్నవి. ఒకటి పదముగాను, రెండవది అక్షరముగాను సంస్కృతములో 'అహంకార' అనే పదము వాడుకలో

ఉన్నది 'అహంకార' అంటే 'అహం' అనే అక్షరము అప్పుడు అహం ఒకే అక్షరముగా పరిగణింపబడినది అదే విధంగా ''ఓమ్'' ఓమ్ అక్షరము, పదము గూడ. ఓమ్‌ను ఓంకార మందురు. ఓమ్‌ను పదముగా తీసికొన్నప్పుడు అది మూడు అక్షరముల (అ, ఉ,మ్) కలయిక. అప్పుడు దాని సంఖ్యాపరమైన విలువ 135 (అ=1, ఉ=3, మ్=5). అది తొమ్మిదికి సమానము (1+3+5=9) ఓమ్ అక్షరముగా తీసికొన్న అప్పుడది 'పరా' అగును. పరా విలువ అనంతము. అదే విధంగా అహం సంఖ్యాపరంగా 180 కి సమానమని చెప్పుకొన్నాము. ఈ 180 పరార్థ (అర్ధగోళము) యొక్క కోణము $180^0$ అని. వృత్తకోణము $360^0$ అను దానికి కారణమైనది.

***ఇతర అంకెలు :-*** ఈశ్వరుని సూచించే అంకె తొమ్మిది (9) అని అనుకొన్నాము. ఇతర అంకెలు ఏర్పడిన విధము తెలిసికొందాము. సృష్టి ప్రారంభమునకు ముందు ఈశ్వరుడు (బ్రహ్మము) ''నేను అనేకముగా అగుదును'' అని అనుకొనును (సొకామయత బహుస్యామ్) ఈశ్వర సంఖ్య తొమ్మిదిని ఈశ్వర సంఖ్యతో గుణించుకొనుచుపోతే అంకెలన్నీ ఒకదాని తరువా ఒకటి వస్తాయి లేక అహం (18) ని విడగొట్టిన విధముగా తొమ్మిదిని విడగొట్టిన మనకు ఎనిమిది జతల అంకెలు వచ్చును. దానిలో ఎనిమిది అంకెల పరిణామము తెలియును.

ఆధ్యాత్మికముగా ప్రతి అంకె తొమ్మిది యొక్క అధ్యాసనమే. అందువలననే ప్రతి అంకె వెనుక తొమ్మిది ఉనికిని గుర్తించవచ్చును. ఈ విషయము ఉదాహరణతో అయితే బాగా తెలియును.

అహం సంఖ్యా విలువలు రెండు విధములు. అహం పదముగా తీసికొన్న దాని సంఖ్యావిలువ 9 (180 or 90 or 9) . అది అక్షరమైన దాని సంఖ్యావిలువ 9 మాత్రమే. అహం యొక్క ఈ విలువ శ్రుతి చెబుతున్న ''నవో నవో భవతి జయ మానహ'' కు స్మృతి చెబుతున్న ''తస్యవాచకహ ప్రణవహ''కు పొందుకుదురుచున్నది.

**సంఖ్యాశాస్త్రాభివృద్ధి :** అహం సంఖ్యాపర విలువ 180. ఇది గణితశాస్త్ర సామాన్య సూత్రముల పుట్టుకకు కారణమైనది. దానికి కొన్ని ఉదాహరణలు చెప్పుకొందాము. 18 స్థానములుండే ఆర్యన్ సంఖ్యా పద్ధతి (Aryan Numerical Notation) పుట్టుకకు 18 సంఖ్య కారణమైనది. ఆర్యన్ సంఖ్యా పద్ధతిలొని స్థానముల పేర్లు : (1) ఏక, (2) దశ, (3) శత, (4) సహస్ర, (5) అయుత, (6) లక్ష, (7) ప్రయుత, (8) కోటి, (9) అర్బుదము, (10) అబ్జ, (11) ఖర్వ, (12) నిఖర్వ,

(13) మహాపద్మ, (14) శంకః (15) జలధి, (16) అంత్యమ్, (17) మధ్యమ్, (18) పరార్ధమ్ – దశాధిక పద్ధతి

ఒకటి తరువాత 17 సున్నాలు పెడితే వచ్చే సంఖ్య పరార్థమ్.

ఒకటి తరువాత 35 సున్నాలు పెడితే వచ్చే సంఖ్య పరా. దీనిలో 36 స్థానములుండును పరా సంఖ్యలోని స్థానముల సంఖ్య 36. 1 నుండి 8 వరకు గల అంకెల మొత్తము (1+2+3+4+5+6+7+8 = 36).

ఉదాహరణ '2' తీసికొందాము. దానిని దాని అంశీభూతములుగా విడగొట్టిన రెండు 1,1 కు సమానమగును. 11 = 9+2. ఈ విధంగా రెండు వెనుక 9 ని చూస్తాము. ఇదే విధంగా ప్రతి అంకె వెనుక '9' ఉన్నదని నిరూపించవచ్చును.

3 - 1, 2 లేక 2, 1 కి సమానము

12 = 9+3 లేక 21 = 9+9+3 అంటే 9తో భాగించిన 3 శేషముగా వచ్చును.

4 = 1,3 లేక 3,1 లేక 2,2. వీటిని తొమ్మిదితో భాగించిన 4 శేషముగా వచ్చును.

1 = 1, 0 కు సమానము. తొమ్మిదితో భాగించిన ఒకటి శేషము వచ్చును

ఈ పద్ధతి శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో బోధించిన,

''ఈశ్వర సర్వభూతానామ్ హృద్దేశేఽర్జున తిష్ఠతి'' (భ.గీ. 18-61) అను దానితో సరిపోవును.

ఓ అర్జునా! ఈశ్వరుడగు నారాయణుడు సర్వభూతములను యంత్రములను అధిష్టించిన వారిని వలె చలింపచేయుచు సమస్త ప్రాణుల యొక్క హృదయమున వెలయుచున్నాడు.

దీనిని అంకెలతో అన్వయము చెప్పుకొందాము. ఇక్కడ సమస్త ప్రాణులలో ఈశ్వరుడు ఉండి వారి ఉనికికి కారణమగుచున్నాడు. అట్లాగే అంకెలన్నిటి వెనుక ఈశ్వరుడు (9) ఉండి తక్కిన అంకెలకు కారకుడగుచున్నాడు (9- కారణమగుచున్నది. 9 - ఈశ్వర సంఖ్య.)

**సున్న :-** దీనిని సామాన్యముగా శూన్యము అందురు. దానికి రెండు విధములైన అర్థమున్నది ఒకటి (ఏ మాత్రము లేకుండుట) పరమ శూన్యము. రెండవది లెక్కకు రాని పరిమాణము. రెండు విలువలు సున్న భావమునకు యుక్తమైనవే. సున్న అంటే ఏ మాత్రము లేకుండుట - కావున సున్న అవిద్యను సూచించును. ఎందుకనగా పారమార్థికముగా అవిద్య అంటే పరమశూన్యము. సున్న అంటే తార్కికముగా లెక్కలోనికి రానిది అనేది రెండవది.

**కొన్ని సమీకరణములు :**

(1) ఓమ్ = 9, 12, 18, 19

(2) 9 = యంత్ర, చక్ర, తారక, పురుష, శివ, ఆది, జప, అహం, ఆనంద, శరీర, రస, గతి, పద, అజ, భూమ, కర్త, ఇష్టి, యజ్ఞ, పురీషియ, తురీయ.

(3) 18 = బ్రహ్మ, ప్రజాపతి, విశ్వమ్, సర్వం, దహర, స్వపితి.

(4) 12 = చిత్, తత్, జీవ, దేవ, ఆత్మ.

**ముగింపు :** పద, బీజ, రేఖా, సంఖ్యా అను ఈ నాలుగు శాస్త్రములను జాగ్రత్తగా పరిశీలించిన వాటి అన్నిటి ఉనికికి ఒకే ఒక్క కారణము పరమ్ - బ్రహ్మము - పూర్ణమ్ అని తెలియును. అదే (1) వృత్తము, (2) అనంతము, (3) అ, (4) ఓమ్ అనే నాలుగు రూపములలో రూపుదిద్దుకొన్నది. క్రమ పరిణామములో చివరకు ఏర్పడునది వృత్తము లేక అనంతము. క్రమ పరిణామము కాని దానిలో చివరకు ఏర్పడునది బిందువు లేక సున్న. వీటన్నిటికి నిజమైన కారణము పూర్ణము.

ఈ ప్రపంచమును పూర్ణముగా తెలిసికొందురు. బాహ్యముకాని సత్యమైన పూర్ణము యొక్క ఫలితమే ఈ బాహ్యమైన పూర్ణము. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ స్థూల ప్రపంచమే పూర్ణంగా సూక్ష్మ ప్రపంచమని చెప్పవచ్చును. (Microcosm the Macrocosm in a nutshell, can as well be said to be purnam). సూక్ష్మ స్థూల ప్రపంచముల రెండింటిని నిజమైన పూర్ణం స్థాయికి తీసికొని వెళ్ళిన అపుడు శ్రుతి చెప్పినట్లు అవి రెండూ పూర్ణంతో అద్వితీయమైన ఒకే పూర్ణమగును.

ఓం పూర్ణమిదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావ శిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

**ఫలితము :** శ్రుతి ఈ విధంగా చెబుతున్నది

''బ్రహ్మ విత్ బ్రహ్మైవ భవతి''

పూర్ణంను తెలిసికొన్నవాడు పూర్ణంతో కలిసి ఒకటియై శాశ్వత బ్రహ్మాందమును అనుభవించును.

(శ్రీ క.భా.వారి పూర్ణమీమాంస ననుసరించి).

★★★

# అనుబంధము - 2

# సంఖ్యామాత్రుక

**సంఖ్యా మాత్రుక :-** అకారాది నవ ( అ, ఇ, ఉ, ఋ, ఌ ౡ , ఏ, ఓ, ఐ, ఔ)

కకారాది నవ ( క ఖ గ ఘ జ చ ఛ జ ఝ)

పకారాది నవ (ట ఠ డ ఢ ణ త థ ద ధ)

పకారాది పంచ (ప ఫ బ భ మ)

యకారాది అష్ట ( య ర ల వ శ ష స హ)

- అను అక్షరములకు సంఖ్యలకు అనుబంధిత రూపమే ఈ సంఖ్యామాత్రుక. దీనిలో తొమ్మిది అంకెలకు వర్ణములు చెప్పబడినవి. క్రింది పట్టిక అంకెలకు వర్ణములకు సమన్వయ పరచే సంఖ్యా మాత్రుక రూపము. ప్రతి అంకెకు దాని విలువ వరుసలో ఉన్న వర్ణములకు పరస్పర అవినాభావ సంబంధము. ఞ, న, క్ష అను సున్న క్రింద చూపవలెను.

**పట్టిక :-**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఇ | ఉ | ఋ | ఌ | ఏ | ఓ | ఐ | ఔ | - |
| క | ఖ | గ | ఘ | జ | చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | | క్ష |

ఈ సంఖ్యా తంత్రము ప్రధానంగా సమిష్టి సంఖ్యా తంత్రము, వ్యష్టి సంఖ్యా తంత్రము అని రెండు విధములు. సమిష్టి సంఖ్యా తంత్రములో ఒక పదములోని అక్షరములు సూచించే అంకెలు లేక అంకెల మొత్తమును బట్టి అంకెను నిర్ణయించే పద్ధతి.

అహంలో అ = 1; హ = 8, ం = ం

అహం = 180 = 90 = 9 కూడగా చివరకు వచ్చినది "9".

అంటే "9" అహంకు సంకేత సంఖ్య ఓమ్ = అ ఉ మ్

(ఓమ్‌లోని అక్షరములకు అంకెలు వేసినచో)

అ = 1; ఉ = 3; మ్ = 5

ఓమ్ = 1+3+5 = 9 అంటే ఓమ్ కు సంకేత సంఖ్య 9.

శ్రీం = శ ర ఈమ్ (అక్షరములు)

శ్రీం కు సంకేత సంఖ్య 7.

బ్రహ్మ = బ ర హ మ = 3+2+8+5 = 18 = 1 + 8 = 9

సంఖ్యాసమానత గల పదములు సామరస్యత గలవిగా చెప్పవలెను. అంటే పై ఉదాహరణలలో ఓమ్, బ్రహ్మ, రెండింటికి 9 సంకేత సంఖ్య. అందువలన ఆ రెండు పదములకు ( ఓమ్, బ్రహ్మ) సామరస్యము. వ్యష్టి సంఖ్యా తంత్రము ప్రస్తుతము మనకు అవసరము లేదు.



# అనుబంధము - 3
# మాతృక

శుద్ధ స్ఫటిక సంకాశం సచ్చిదానంద విగ్రహమ్ ।
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే ॥
కామేశ్వరీం పరామీడే కాదిహాది స్వరూపిణీమ్ ।
మాతృకా వర్ణలిప్తాం గీం మహాశ్రీ చక్ర మధ్యగామ్ ॥

అక్షర సమామ్నాయమును తెలిసికొని విమర్శించి తత్త్వమును తెలిసికొనినచో అక్షరరూపమగు బ్రహ్మభావము లభించును. దానిచే పరమ పురుషార్థమగు మోక్షము చేకూరును..

అక్షర సమామ్నాయమనగా 'అ' కారము ఆదిగా కల్గి 'క్ష'కార మంతముగా కల్గిన అక్షర సముదాయమని.

అక్షమాలికోపనిషత్తునందు తెలియవచ్చెడి అక్షర సమామ్నాయము :-

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ , ౡ , ఏ, ఐ, ఓ, ఔ, అం, అః । — 16 అచ్చులు.

క ఖ గ ఘ ఙ । చ ఛ జ ఝ ఞ ।
ట ఠ డ ఢ ణ । త థ ద ధ న । ప ఫ బ భ మ ।
య ర ల వ శ ష స హ ళ క్ష ॥

ఇందులో అకారము నుండి 'ళ' కారాంతముగా 50 వర్ణములను ప్రత్యేకముగా ఏబది అంకెలచే లెక్కింపబడి "క్ష" కారము మాత్రము ఏ అంకె చేత గూడ లెక్కింపబడక వర్ణింపబడినది. లోకంలో అ నుండి క్ష వరకు గల వర్ణ సముదాయమును

వర్ణించునపుడు ఏబది వర్ణములుగానే చెప్పుచున్నారు. కాని నిజమునకు 51 అక్షరములున్నవి

భాషతో సంబంధించిన వర్ణములను లెక్కించినచో అవి

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ

క ఖ గ ఘ చ ఛ జ ఝ ప ఫ బ భ ట ఠ డ ఢ త థ ద ధ ఙ ఞ మ ణ న హ య శ వ ర ష ల స - అను 47 వర్ణములు.

అను రెండు వర్ణములకు భాషయందు ప్రచారము లేదు. అప్పుడు భాషయందు వ్యవహరింపబడు వర్ణములు 45. ఆ ఈ ఊ ౠ అను దీర్ఘాక్షరములు గూడ క్రమముగా అ ఇ ఉ ఋ అను వర్ణముల యొక్క విశేషములే అగుట చేసి అ ఇ ఉ ఋలు గ్రహింపబడినచో గతార్థములే అగుచున్నవి. కావున దీర్ఘాక్షరములను గ్రహింపక పోయినచో అక్షర సమామ్నాయములో 41 వర్ణములుండును.

ఇట్లు 41 అక్షరములతో అక్షర సమామ్నాయముచే భాష చరితార్థమగుచుండ భాషాతత్త్వ విశారదుడగు వరరుచి ---

ద్విధాऽక ఏచోऽనుస్వారో విసర్గష్షోడశ స్వరాః

స్పర్శా అంతస్థశో ష్మాణశ్చతుస్త్రి శద్దలః స్మృతాః ॥

అని అక్షర సమామ్నాయమును చెప్పెను.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః।

క ఖ గ ఘ ఙ। చ ఛ జ ఝ ఞ। ట ఠ డ ఢ ణ। త థ ద ధ న॥

ప ఫ బ భ మ। య ర ల వ శ ష స హ ళ - అను వర్ణములు సంస్కృత భాషా నిష్పాదకములని చెప్పియున్నాడు. అంతేకాక ఇది సిద్ధక్రమమే అనియు, అట్టి క్రమముచే

భాష యందలి శబ్దములకు తత్పార్థ కధనమునందు గల అన్యోన్య సంబంధమును బోధించు సంఖ్యా సంకేతముతో కూడియున్నదని చెప్పెను.

''కాదినవ, టాది నవ, పాది పంచ, యాద్యష్ట'' అను వాక్యముచే ఉపదేశించి యున్నాడు. అంటే -

| | |
|---|---|
| గ ట ప య - 1 | చ త ష - 6 |
| ఖ ఠ ఫ ర - 2 | ఛ ధ స - 7 |
| గ డ బ ల - 3 | జ ద హ - 8 |
| ఘ ఢ భ వ - 4 | ఝ ధ - 9 |
| జ ణ మ శ - 5 | ఞ న - 0 |

బోధించునని అర్ధము.

ఇందు క్ష కార ప్రసక్తి ఏ మాత్రము లేదు. ఇందుకు కారణము అక్షమాలికోపనిషత్తునందు 'క్ష' కారము ప్రత్యేకముగా ఉపదేశింపబడుటయే.

వైయాకరణ సార్వభౌముడగు పాణినికి మహేశ్వరానుగ్రహము వలన ఒక అక్షర సమామ్నాయము లభించెను. అందు 14 సూత్రములున్నవి.

**మహేశ్వర సమామ్నాయము :**

(1) అ ఇ ఉ ణ్ (2) ఋ ఌ క్ (3) ఏ ఓ ఙ్ (4) ఐ ఔ చ్

(5) హ య వ ర ట్ (6) ల ణ్ (7) ఞ మ ఙ ణ న మ్ (8) ఝ భ ఞ్

(9) ఘ ఢ ధ ష్ (10) జ బ గ డ ద శ్ (11) ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్

(12) క ప య్ (13) శ ష స ర్ (14) హ ల్.

అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ అనునవి.

**నారాయణ సమామ్నాయము (ప్రాచీన అక్షర సమామ్నాయము) :**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః।
క ఖ గ ఘ ఙ। చ ఛ జ ఝ ఞ। ట ఠ డ ఢ ణ। త థ ద ధ న।
ప ఫ బ భ మ। య ర ల వ శ ష స హ ళ క్ష ॥

51 అక్షరములలో ళ, లకు భేదము లేదు. కనుక ఒక అక్షరము తగ్గును క్షను క, షల కలయికగా లెక్కింతురు. అపుడు మనకు 49 అక్షరములగును. కాని క్షను అట్లు పరిగణించుట సరికాదు అక్షమాలికోపనిషత్తులో క్ష ప్రత్యేకంగా వర్ణింపబడినది. శ్రీచక్ర బిందువునందు 'క్ష' వర్ణమును భావింపవలెను

యతోఽస్య క్షకారస్య గగన బీజత్వం దేవతా చ శ్రూయతే శాస్త్రే।
తస్మాత్ క్ష కారస్యైకత్వమేవ।
నహి తత్ర సంయుక్త వర్ణస్య బీజత్వం పృథక్
దేవతా చ శ్రూయతే క్షకారస్యతు శ్రూయతే।
తత ఏతత్సిద్ధం భవతి క్షకార ఏక ఏవ వర్ణం ఇతి ॥

ఇది శ్రీ జగద్గురు కల్యాణానంద భారతీస్వామివారి అక్షరదర్శనములోని 8వ సూత్రము.

క్ష కారము గగన బీజము. మంత్రశాస్త్రంలో క్ష కారమునకు ఒక దేవత కూడ చెప్పబడినది. అంతేకాని సంయుక్తాక్షరంగా ఏడి ఏడి దేవతా బీజముల కలయిక కాదు. అందుచే క్ష కారము ఒకే వర్ణమని 'అక్షర దర్శనమున ' శ్రీ కల్యాణానంద భారతీ స్వామివారు వివరించియున్నారు కావున క్ష ఏకవర్ణమే; సంయుక్త వర్ణము కాదు. దానిని బిందువునందు భావింపవలెను



# అనుబంధము - 4
# భారతీయ వాఙ్మయము

ప్రతి దేహము ప్రకృతి భాగము, పురుష భాగము అను రెండు భాగముల కలయిక.

**I. ప్రకృతి భాగము :** (1) చర్మము, మాంసాది సప్తధాతువులు, (2) చక్షువు మొదలగు దశేంద్రియములు, (3) బుద్ధి, (4) ప్రాణము అని నాల్గింటి సముదాయము ప్రకృతి భాగము. ఇది అసత్యము, పరాధీనము; జడము, దుఃఖరూపము, దేశకాలాది పరిచ్ఛిన్నము మొదలగు లక్షణములు గలది ఇదియే మాయ. దీనినే దృశ్యము, దేహము; క్షేత్రము మొదలగు పేర్లతో చెప్పుదురు.

**II. పురుషభాగము :** ఆహారమును సప్తధాతువులుగాను, దశేంద్రియ, బుద్ధి, ప్రాణ, వ్యాపారరూపముగాను పరిణమింపచేయు చైతన్య విశేషము పురుషభాగము. ఇది మానవుని వలన సాధ్యపడని పని. ఆ చైతన్య విశేషము సత్యము, స్వతంత్రము, జ్ఞానరూపము, ఆనంద రూపము, దేశకాలాది పరిచ్ఛేద రహితము, అనంతము మొదలగు లక్షణములు గలది. దేవుడు, ఆత్మ, దేహి, దృక్కు, క్షేత్రజ్ఞుడు, అనంతము, భగవంతుడు మొదలగు పేర్లతో చెప్పబడునది.

పురుషుడే సర్వ ప్రపంచమునకు అధిష్ఠానము దీనియందు నామరూపాత్మక సర్వ ప్రపంచము ఆరోపితము. ప్రకృతి, పురుష భాగముల విచక్షణ జ్ఞానము లేక దేహేంద్రియ బుద్ధి ప్రాణ సముదాయమే తామని తలచి వ్యవహరించు వారే జీవులు. అంటే ప్రకృతి భాగమే తామని తలచే వారే జీవులు. జీవులు తమ సత్యభాగమగు పురుష భాగమును విస్మరించి దేహాది ప్రకృతి భాగమును మాత్రమే తాముగా నిశ్చయించి,

నిరంతరము తమ అభీష్టముల సిద్ధి కొరకు ప్రయత్నములు చేయుచుందురు. దీనినే కర్మ అందురు. తమ అభీష్టము నెరవేరని ప్రతి దశకును దేశకాలాదులను ఇతర జీవులను దూషించుచు వాటి యందు ద్వేషమును, లోభమును, ఈర్ష్యాదులను పొందుచున్నారు ఈ ఫలములను అనుభవించుటయే భోగము అనబడును. ఇది కేవలము మానవ యత్న సాధ్యము కాదని సర్వానుభవసిద్ధము. మరణ పర్యంతము ఇట్టి వివిధ కామ, ఉపాయ, సాధన, ప్రయత్నరూప కర్మ యున్నందున ఈ దేహమును విడిచి కర్మానురూపమగు దేహాంతరమును పొందుచున్నారు. ఇట్లు కర్మ చేయుట కొరకు భోగము, భోగము కొరకు కర్మయను చక్రబంధమే జనన మరణ ప్రవాహరూపమగు సంసారమనబడును. దీని నివృత్తి కొరకు శ్రుతి, స్మృత్యాది భారతీయ వాఙ్మయ మంతయు ఏర్పడినది. దానిలో జీవుల స్వరూపము, దేవతా స్వరూపము, దేవతకు జీవులకు గల సంబంధము, ఎట్లు జీవుని రాగద్వేషాది నివృత్తి కల్గి జీవునకు దేవతా సంబంధము అభివృద్ధియగునో, దయాసత్యాది సద్గుణాభివృద్ధి కల్గునో, జీవుడే ఎట్లు పరమాత్మ రూపుడగునో మొదలగు అనేకానేక విషయములు చెప్పబడినవి.



# అనుబంధము - 5

## త్రిగుణములు

త్రిగుణములను గూర్చి తనకు తెలియదని బ్రహ్మ నారదునికి చెప్పెను. దానిని బట్టి మనము వాటిని గూర్చి ఏ మాత్రము చెప్పుకొనగలమో ఊహించవచ్చును కాని త్రిగుణములు లేనిదే సృష్టి లేదేమో ! శ్రీచక్రములో త్రికోణము త్రిగుణములను తెల్పును. దానితో సృష్టి క్రమము ప్రారంభమగును. త్రిగుణములంటే సత్త్వ గుణము, రజోగుణము, తమోగుణము.

సత్, చిత్, ఆనందము అనెడు ఆత్మ యొక్క స్వరూపత్రయము సృష్ట్యాది యందు మూలప్రకృతియందు ప్రతిఫలింపగా అవిక్రమముగా రజసత్త్వస్తమో గుణములుగా పరిణమించెను. అందుచేత త్రిమూర్త్యాత్మకుండగు ఈశ్వరుడు జగములను సృష్టించునపుడు రజోగుణప్రధానుడగు బ్రహ్మగాను, రక్షించునపుడు సత్త్వగుణ ప్రధానుడగు విష్ణువుగాను, ఉపసంహారము చేయునపుడు తమోగుణ ప్రధానుడగు మహాదేవుడుగాను ఒప్పును.

రుద్రుడు బహిస్సత్త్వము, అంతస్తమమును; విష్ణువు బహిస్తమము, అంతస్సత్త్వమును; బ్రహ్మ ఉభయత్ర రజోగుణప్రధానుడుగాను ఉందురు.

సత్త్వం రజోస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥

(భ. గీ. అ.14-శ్లో.5)

ప్రకృతి సంభవములైన సత్త్వ రజస్తమో గుణములు నిత్యమైన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి.

వీనిలో ప్రకాశమానమును నిరుపద్రవమునైన సత్త్వగుణము నిర్మలమగుట చేసి సుఖాభిలాష చేత, జ్ఞానాభిలాష చేత ఆత్మను దేహమందు బంధించుచున్నది.

విషయాసక్తి, విషయాభిలాష, విషయాభిమానము గల రజోగుణము కర్మాసక్తిచేత ఆత్మను బంధించుచున్నది.

అజ్ఞానము వలన కలిగిన తమోగుణము సకల భూతములకు అవివేకమును కలుగచేయుచు, ప్రమాదము, ఆలస్యము, నిద్రలతో ఆత్మను బంధించుచున్నది.

సత్త్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మములందును, తమోగుణము జ్ఞానము నావరించి ప్రమాదమునందు చేర్చుచున్నవి. సంస్కారము ననుసరించి ఆయా గుణములు ప్రధానమగుచున్నవి

**త్రిగుణముల స్వరూపము - వాని అవస్థలు :**

సత్త్వము ప్రీత్యాత్మకము. ఆర్జవము - (ఋజుభావము) - సత్యము - శౌచము - శ్రద్ధ - క్షమ - ధైర్యము - దయ - లజ్జ - శాంతి - సంతోషము అనునవి సత్త్వ గుణము యొక్క లక్షణములు. ఇది తెల్లని వర్ణము గలది ఇది ధర్మమునందు ప్రీతిని, సచ్ఛ్రద్ధను కలిగించి అసచ్ఛ్రద్ధను నివారించును తత్త్వదర్శనులగు మునులు ఈ శ్రద్ధను సత్త్వరజస్తమోభేదములచే మూడు విధముల పేర్కొనిరి.

రజోగుణము రక్తవర్ణము గలది. ఇది దుఃఖ సంయోగమున కలుగును. ఇది అద్భుతశక్తి గలది దుఃఖరూపమైనది. ఈ రజోగుణమునకు ప్రద్వేషము - ద్రోహచింత - మచ్ఛరము (ద్వేషము) - స్తంభము (మ్రానుపాటు) - ఉత్కంఠ - నిద్ర - అనునవి కలుగును. ఇది రాజసశ్రద్ధ. మదము - గర్వము - రజోగుణ లక్షణములు

తమోగుణము నల్లని వన్నె గలది. మోహము - విషాదము - అజ్ఞానము - ఆలస్యము - నిద్ర - దైన్యము - భయము - వివాదము - కృపణత్వము - కుటిలత్వము - వైషమ్యము - అతి నాస్తికత - పరదోష దర్శనము - ఇవన్నియు తమో లక్షణములు. తామస శ్రద్ధవలన తనకును, పరులకును మనోవ్యధ కలుగును. తనకు శుభము కోరుకొను మనుజుడు సత్త్వగుణమును ప్రకాశింప చేయవలెను. రజోగుణమును అట్టి అడుగున అణచి పెట్టవలయును. తమమును సంహరించ వలయును.

ఈ త్రిగుణములందు ప్రతిది రెండవ దానిని గడ్డిపోచగా కించపరచుచు వ్యతిరేకించు చుండును తమమును బాసి ఈ రెండింటిలో ఏఒక్కటీయు ఎప్పుడు మన జాలవు. అట్లే తమ మీరెండింటిని బాసి యొంటిగ నిలువజాలదు ఇవన్నియు మిథున ధర్మమున కలిసిననే తమ ప్రభావములు చూపగలవు.

ఈ త్రిగుణములు ఒకదాని నొకటి ఆశ్రయించుకొని యుండును ఇవి విడివిడిగా గడుపజాలవు. ఈ త్రిగుణములు జంటలుగా నేర్పడి లోక ప్రవర్తకములగును ఇవి దీపకాంతి లక్షణము గలవి కాంతి మనలను వస్తువులను చూచునట్లు చేయును వత్తి, తైలము, జ్వాల - ఇవి పరస్పర విరుద్ధములు కాని ఇవన్నియు ఒకచోట చేరి వస్తువులను చూచునట్లు చేయును. ఈ విధంగా గుణములన్నియు మూల సహజ ప్రకృతి నుండి కల్గును. ఇవన్నియు సంసార కారణములు.

గుణము లన్నిటిని కల్పించి విభజించి జగన్నాటక మాడించు ప్రకృతి **మహాశక్తి**. ఆమె అందరికి ఆరాధ్యదేవత. ఆదేవి గుణకార్యభేదము వలన నిర్గుణ, సగుణయై విలసిల్లుచుండును ఆమెయే పూర్ణ పురుషుడు - అవ్యయుడు - నిరీహుడు - అచ్యుతుడునగు పరమపావనుడు

## సృష్టి క్రమము

క త్రివిధాహంకారసము
ద్భవ మగు శక్తిత్రయంబు వరుసన్ జ్ఞానం
బవు సాత్త్వికిని గ్రియాత్మక
మవు రాజసి, ద్రవ్య శక్తి యగు దామసిచే.

సీ. వాని కార్యంబులన్ వాక్రుత్తు విను యథా
తత్త్వంబుగా నారదా। మహర్షి,
వందులో దామసాహంకార జాతమౌ
ద్రవ్యశక్తిని సముద్భవము లగును,
శబ్దంబు మఱియు స్పర్శము రూపరసగంధ
వాచ్యమౌ తన్మాత్ర పంచకంబు;
శబ్దగుణక మాకసము, స్పర్శ గుణకము
వాయువు, వహ్ని రూప గుణకమ్ము

వరుస రస గంధ గుణములు వారి పృథ్వి
లెఱుగుమివి సూక్ష్మములుగ, నీ యెల్ల వదియు
మిళితమై ద్రవ్యశక్తి సమ్మేళ మొంది
తదను వృత్తిక సర్గమౌ దామసమున.

సీ ప్రకృతియు పురుషుండు భావనీయులుగాని, దర్శనీయులుగారు తలపనెందు
నాదియు మధ్యంబు నంతంబువారికి, లేవు వేఱన్నెను లేకయుండు
వేదమార్గంబులు విశ్వసించినవారి, కభిముఖులౌదురు విభులువారు
చైతన్యరూపులై సర్వభూతములందు, వ్యాపించి తేజస్స్వభావమున

గీ భావ సప్తకమున సర్వ భావములను వెలియు లోనన నిండి వ్యాపించి తారు
లేని చోటిల్లెడల జాడ లేక యుండి, ప్రకృతి పురుషులు స్వస్వరూపమున నుంద్రు

ఈ పై మూడు పద్యములలోను మొదటి రెండు కవి సమ్రాట్ నోరి నరసింహ శాస్త్రిగారి శ్రీదేవీ భాగవతము లోనివి. 3వ పద్యము శ్రీములుగు పాపయారాధ్యులు వ్రాసిన శ్రీదేవీ భాగవతములోనిది వైవిధ్యము కొరకు ఉటంకించబడినవి.

ఈ సత్త్వరజస్తమో గుణములకు త్రివిధ శక్తులుండును. అవి జ్ఞానశక్తి, క్రియాశక్తి, అర్థశక్తి. జ్ఞానశక్తి సత్త్వగుణమునకును, క్రియాశక్తి రజోగుణమునకును, అర్థశక్తి (ద్రవ్యశక్తి) తమోగుణమునకు సంబంధించియుండును తమోగుణమగు ద్రవ్యశక్తి వలన తన్మాత్రలు కలుగును. శబ్దము - స్పర్శము - రూపము రసము - గంధము అనునవి తన్మాత్రలు. ఆకాశము యొక్క ధర్మము శబ్దము, వాయుగుణము స్పర్శము, అగ్నిగుణము రూపము, జలగుణము రసము, భూమిగుణము గంధము; ఇవి సూక్ష్మ తన్మాత్రలనబడును. ఈ భూతపంచకమును, తన్మాత్రలును మొత్తము పదియు ద్రవ్యశక్తితో కలిసియుండును ఇట్టి తామసాంకారవృత్తి వలన బ్రహ్మాండ సృష్టి జరుగును.

చర్మము - కన్ను - చెవి - నాలుక - ముక్కు - ఈ ఐదును జ్ఞానేంద్రియములనబడును నోరు - చేయి - కాలు - వాయువు - ఉపస్థ - అనునవి కర్మేంద్రియములు ప్రాణము - అపానము - వ్యానము - ఉదానము - సమానము అనునవి పంచవాయువులు ఈ పదునైదు (15) కలిసి రజోగుణము వలన ఉత్పన్నమగును వీని సాధనము లన్నియు క్రియాశక్తికి సంబంధించి యుండును వీని కన్నిటికిని చిద్వ్యాప్తి ఉపాదాన కారణమగును వాయువు, సూర్యుడు, దిశలు, వరుణుడు, అశ్వినులు అను దేవతలు సత్త్వగుణ సంభూతులు; జ్ఞానశక్తియుక్తులు. వీరు పంచ జ్ఞానేంద్రియములకు వరుసగా అధిష్ఠాన దేవతలు. చంద్రుడు, బ్రహ్మ, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు అనువారు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనువానికి అధిష్ఠాతృ దేవతలు ఇవన్నియు మనస్సుతో కలిసి పదునైదు అగును. వీరందరు సత్త్వ గుణ ప్రధానులగుట వలన దీనిని సాత్త్విక సృష్టి అందురు

పరమాత్మకు సూక్ష్మము, స్థూలము అను రెండు రూపములు గలవు మొదటిది నిరాకారము, జ్ఞానరూపము వివర్తనము లన్నిటికి కారణము రెండవది సాకారము, సగుణము

పరాధ్యానసమయమందు దేవి యొక్క దయామూర్తిని ఉపాసింపవలెను అది దేవి స్థూలరూపము ఆపరమాత్మునిలోని స్వరూపమును సూక్ష్మముగా నెరుగువలయును ఆ సూక్ష్మ శరీరమునే సూత్రాత్మకమందురు ఆ పరమాత్మయగు బ్రహ్మము యొక్క రెండవ రూపము స్థూల శరీరము భూత సూక్ష్మములగు తన్మాత్రలను పంచీకరణము వలన పంచభూతములు సద్భూతము లయ్యెను. పిదప ప్రతి భూతాంశమునందు చైతన్య శక్తి ప్రతి బింబించును. అపు డందుండి మనోమయమైన అహం ప్రవృత్తి ప్రకటితమగును అపుడా శక్తి ఆది నారాయణయగు వైశ్వానర భగవానుడుగా పిలువబడును ఇది సృష్టి క్రమము

ఈ విధముగ పంచీకరణముచే ఆకాశాది భూతపంచకము సుస్పష్టముగ ప్రజ్యోతమగును. ఏకైక గుణ వృద్ధిచే ఒక్కొక్క భూత స్వభావము స్థూలతరమగు చుండును. ఎట్లన ఆకాశమునకు ఒకే శబ్దగుణము, వాయువునకు శబ్ద స్పర్శములను రెండు గుణములు; అగ్నికి శబ్ద స్పర్శ రూప రసములను నాలుగు, భూమికి శబ్ద స్పర్శ రూప రస గంధములను ఐదు గుణములు గలవు. వీని పరస్పర సమ్మేళనమున

బ్రహ్మాండము ఉత్పన్నమైనది కనుక సకల జీవులు బ్రహ్మాండాంశ సంభూతులు, ఈ జీవజాతులు 84 లక్షలని చెప్పబడుచున్నవి

## శక్తితత్త్వము

జగముల కన్నింటికి త్రిగుణములే మూల స్తంభములు ఈ ప్రపంచమున ప్రతి వస్తువు త్రిగుణమయమై యుండును. ఈ సారహీన ప్రపంచమున నిర్గుణ తత్త్వమును చూచితి నన్నవాడు గాని, చూచువాడుగాని, చూడగలవాడుగాని లేడు. నిర్గుణుడు ఆ పరమాత్ముడు అతడు దృక్కేగాని దృశ్య తత్త్వము కాడు. శ్రీదేవి (అమ్మ) సృష్టికాలమున సగుణ, లయమున నిర్గుణ. ఆమె ఎప్పుడును కారణరూపమున నుండును, కార్యరూపమున ఉండదు కారణరూపమున నిర్గుణ. మహత్తత్త్వము - అహంకారము - శబ్దాది గుణములు - కార్యకారణరూపములు అను వానితో చేరి రేయింబవళ్ళు వ్యవహరించును ఆమె సదుద్భూతమైన అహంకార స్వరూప. కాన సర్వకారణురాలు, శివరూప

అహంకారము కార్యము. అది త్రిగుణములను కూడియుండును. అహంకృతి నుండి మహత్తత్త్వము కలుగును. అది బుద్ధి సమిష్టి అహంకారము కారణము. మహత్తత్త్వము కార్యము. ఆ అహంకృతి నుండి పంచతన్మాత్రలు కలుగును. వాని నుండి పంచ మహాభూతములు పుట్టును పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ మహాభూతములు, మనస్సు కలిసి 16 అగును ఇది కార్య కారణములగు షోడశాత్మక స్వరూపము. పరమాత్ముడు పురుషోత్తముడు - ఆద్యుడు - కార్యకారణ రహితుడు. ఈ విధముగా సృష్టి మొదట అమ్మవలన తరువాత వికారములు క్రమముగా కలుగుచుండును.

నిర్గుణ స్వరూపము ఎప్పుడు ఎవ్వరికి గోచరము కాదు. ఏలయన దృశ్యమంతయు మిథ్యయే, నిర్గుణమే. నిర్గుణ బ్రహ్మమే సత్యము. ఆ నిర్గుణశక్తి దుర్లభమైనది. ఆ నిర్గుణ పురుషుడు దుర్గముడు. వారు మనోవాక్కులకు గోచరించరు పరమ మునులు అహంకార మడచుకొని భావనచే జ్ఞానజ్యోతితో నిర్గుణ తత్త్వమును భాసింపచేసి కొందురు ప్రకృతి పురుషు లనాది నిధనులని వారిని ఆత్మ విశ్వాసము చేతనే గుర్తింపవలయును కాని కుదరని వాడెరుగ జాలడు సర్వభూతము

అందలి చైతన్యశక్తిని పరమాత్మశక్తిగా భావంపవలెను. ఆ సత్యతేజము సర్వ వ్యాపకము, నిత్యము అది పెక్కు రూపులు దాల్చును. ఆత్మ చైతన్యము - శక్తి - రెండు భిన్నములు. సర్వ వ్యాపకములు వీని యునికి లేక జగమందలి యే పదార్థమును లేదు. ఈ రెండును ప్రతి దేహమునందు కలిసి మెలిసి యుండును. ఈ రెండు ఒకే రూపము గలవి నిర్గుణములు, నిర్మలములు, సచ్చిదానంద స్వరూపములు

ఆ శక్తియే పరమాత్మ, పరమాత్మయే శక్తి వీరి భేదము ఎవరు ఎరుగజాలరు ఈ చరాచర జగములన్నియు అహంకార మమకార మయములు. కాని వీని ప్రభావమున నరుడు నూరు వేల కల్పములకైన అహంకృతిని బాయలేడు. సగుణము నిర్గుణమును కన్నులతో చూడజాలదు. కనుక నెమ్మదిగ సగుణరూపమును గూర్చి చింతించవలెను. గుణ వికారములు తొలగి పోనంత వరకు బ్రహ్మము దర్శనము (బ్రహ్మానుభూతి) అసంభవము అహంకారము తొలగిన వెంటనే చిత్తవికారములు అణుగును అపుడు ఆత్మ తేజము నేను నేనని తానుగ వెల్గుచుండును



# అనుబంధము - 6
# దుర్గోపాసనాతిశయము

నారాయణ సమారంభాం వ్యాస శంకర మధ్యమామ్ ।
కల్యాణానంద పర్యంతాం వందే గురుపరమ్ పరామ్ ॥

వేదమాతకును, దుర్గాదేవికిని అవినాభావ సంబంధమున్నది శ్రుతియందు పరమ ప్రామాణ్యము విజృంభించిన కాలములలో జనము లిహలోక భోగములందుచు స్వర్గాపవర్గ సాధకులై యుండిరి. నేటి కాలమున దుర్గోపాసన ఉత్తరదేశములో విశేషముగా నున్నను, అది వేద విరోధుల సంపర్కముచే అపమార్గముల త్రొక్కియున్నది అంతకంటె వైదిక నిష్ఠ కొంచె మెక్కువగా నిలిచియున్న దక్షిణ భారతములో దాని నిజ స్వరూపము చక్కగా భాసింపకుండుటచే దుర్గోపాసనమన్న నొకానొక భయము ప్రవేశించినది కావున దేశమంతటను అవైదిక మార్గముల నుండి దుర్గోపాసనము నుద్ధరించి దక్షిణ మార్గమును ప్రవర్తింపజేయుట వైదిక మతాభిమానుల ప్రధమ కర్తవ్యమై యున్నది దీనిని బహుకాలము క్రిందటనే గుర్తించి శ్రీ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ స్వాములవారు అనేక గ్రంథములు రచించి శ్రీ విద్యా పరిషత్తును స్థాపించి సూక్ష్మములగు ననేక విషయముల నుపదేశించి శిష్య సంతతి నభివృద్ధి చేయుచు లోకోద్ధరణ చేసి యున్నారు

ఏ స్మార్తకర్మ ప్రారంభింపబోయినను ముందు విఘ్నేశ్వర పూజ నిర్వర్తించుట అందరు నెరిగినదియే ఆ విఘ్నేశ్వర పూజకంటె కూడ ముందీ మంత్రములు నేటికిని పఠించుచున్నాము

''దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః
పశవో వదంతి సానో మంద్రేషు మూర్జం దుహానా దేనుర్వాగస్మానుపనుష్టుతైతు ''
''యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోస్సం స్మరణాత్పుంసాం సర్వతోజయమంగలమ్ ॥
సర్వమంగల మాంగల్యే శివే సర్వార్థ సాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే ॥

ఈ అనుక్రమణము అనూచారముగా పెద్దల నోట వచ్చుచున్నదే కాని ఒకరు కల్పించినది కాదు ఈ మంత్రములు దుర్గోపాసనలో అగ్రగణ్యములని నేడు పలువురు గుర్తింపలేకుండుట ఆశ్చర్యకరము

తైత్తిరీయోపనిషత్తులో నారాయణీయమను ప్రసిద్ధ నామముగల చతుర్థప్రశ్నలో ఈ సందర్భములో నీ క్రింది మంత్రములు గమనింపదగినవి.

''కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్ ॥

''జాతవేదసే సునవామ సోమ మరా తీయతో దిదహాతి వేదః,
సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురి తాత్యగ్నిః ॥

''తామగ్నివర్ణాం తపసాజ్వలం తీం వైరోచినీం కర్మ
ఫలేషు జుష్టామ్, దుర్గాం దేవీం శరణ మహం ప్రపద్యే
సుతర సితరసే నమః ॥

ఈ మంత్రములలో మొదటిది మూడవది స్పష్టముగా దుర్గామంత్రములే. శ్రీ విద్యారణ్యులు తమ భాష్యములో నవి రెండును వనదుర్గాదేవతా మంత్రములని నిర్దేశించియున్నారు మూడవ దానికి అవ్యవధానముగా ముందున్న ''జాతావేదసే'' ఇత్యాది మంత్రమును తర్వాత నున్న ''అగ్నే, త్వం పారయా'' ఇత్యాదిగా గల అనువాకములోని నాలుగు మంత్రములను అగ్నిపరముగా కనబడుచున్నను దుర్గామంత్రములుగనే భావింపవచ్చును. ఏమైనను, దుర్గాదేవి మహత్త్వ మొక్కించుక గోచరించును ఈ దుర్గాదేవత అగ్నివలె జ్వలించుచు శత్రుతాపన మొనర్చునది, స్వయం ప్రకాశమానమైనది. కర్మఫలములు కోరువారిచే నుపాసింపబడునదిదే. సంసారము నుండి తరింపచేయునది కూడ నిదియే. ఈ దుర్గకే కాత్యాయని, కన్యకుమారి అను నామాంతరములు గలవు.

దుర్గాదేవి అవతారమును గూర్చి కేనోపనిషత్తులో నొక యాఖ్యాయిక కలదు. అసురులను జయించిన దేవత లొక చోట గూడి ఎవరికి వారు తామే జయమునకు కారణులమని ప్రగల్భములు పలుకుచు సర్వకారణశక్తిని మరచి పోగా, నది వారి యెదుట ముందు యక్షరూపముగా నావిర్భవించి దేవముఖ్యులను పరాభవించినది ఇంద్ర పురస్సరముగా దేవతలా యక్షము నుపాసింపగా కొంతకాలమున కది వారికి హైమవతీ రూపముతో ప్రత్యక్షమై అనుగ్రహించినది. దానినే శ్రుతి ''తస్మిన్నేవాకాశే స్త్రియ మాజగామ, బహుశోభనా ముమాం హైమవతీం'' అని పలుకుచున్నది. ఈ యాఖ్యానమునే శ్రీదేవీ భాగవతము ద్వాదశస్కంధములో ఎనిమిదవ అధ్యాయములో కావ్య స్వరూపమున ననువదించియున్నది.

నారాయణీయము నుండి ఉదహరించిన కన్యకుమారి శబ్దముతో కేనోపనిషత్తు నందలి ఉమా హైమవతీ శబ్దములు జోడించి ధ్యానము చేసిన వారికి కర్మభూమియైన ఈ భరత ఖండమంతయు దుర్గాదేవీ స్వరూపముగా భాసింపకపోదు. ఈ దేశమునకు దక్షిణాగ్రమందు పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రజలములచే నిత్యము నభిషేకింపబడుచున్న కన్యకుమారి దుర్గా దేవాలయము క్షేత్రము నేటికిని ప్రత్యక్షముగా నుండి ఎవ్వరికిని ఎన్నటికిని చెరుప సాధ్యముగాని సీమా చిహ్నముగా నున్నది. అట్లే ఉత్తరాగ్రమున హిమవత్పర్వత రాజము భాసిల్లుచు తన యుత్సంగములో వాత్సల్యముతో ఉమను హైమవతిని భీమాదికములగు ననేక రూపములతో ప్రతిష్ఠించుకొనియున్నది.

ఈ రెండు సీమా చిహ్నముల మధ్యనెన్నియో దుర్గా క్షేత్రము లున్నవి. ఉత్తర భాగమున నున్న క్షేత్రములన్నిటిలో కాశికాపురి విశాలాక్షియు, దక్షిణ క్షేత్రములకు శ్రీశైల భ్రమరాంబికయు కేంద్ర స్థానీయములు. పశ్చిమ భారతమున బృందావన క్షేత్రములోని రాధాదుర్గయు, పూర్వ భాగమున జగన్నాథ సమీపమున భువనేశ్వరియు వెలసిరి. ఇట్టిది మనస్సులో భావించియే శ్రీవిద్యా శంకర భగవత్పాదులు జగద్గురువై దిగ్విజయమొనర్చి వైదికనిష్ఠ సుప్రతిష్ఠిత మొనర్చి పరమహంస సామ్రాజ్యము నెలకొల్పనెంచి ద్వారకయందు, బదరికాశ్రమమున, జగన్నాధ క్షేత్రమున, శృంగగిరిని నాలుగు జగద్గురు పీఠములలో భారతీదుర్గను ప్రతిష్ఠించిరి. శ్రీ దేవీ భాగవతమున సప్తమ స్కంధమున ముప్పదియవ అధ్యాయములో ప్రధానమైన దుర్గా క్షేత్రముల నూటయెనిమిదింటిని పేర్కొనుచు చివరకు, 'వేదవదన మందది గాయత్రిగను, శివ సన్నిధిని పార్వతిగను, దేవ లోకములో ఇంద్రాణిగను, బ్రహ్మముఖములందు సరస్వతిగను, సూర్యబింబమున ప్రభగా, మాతలలో వైష్ణవిగా, సతులలో అరుంధతిగా, సర్వ శరీరుల చిత్తములందును బ్రహ్మకలా స్వరూపముగను ప్రతిష్ఠింపబడియున్నదని యద్భుతముగా వర్ణించియున్నది.

ఇంతేకాదు, భరతదేశములో పూర్వరాజులే నగరము నిర్మించినను ముందుగా ఆనగర లక్ష్మిని, నగర దుర్గను ప్రతిష్ఠించు నాచారముండెను. అట్లే ఏ క్రొత్త గ్రామము నిర్మించినను గ్రామ శక్తిని గ్రామ రక్షణకై ప్రతిష్ఠించు నాచారము మన దేశములో ననాదిగా వచ్చుచున్నది. పురదుర్గలు పురవాసులను, గ్రామ దుర్గలు గ్రామీణులను కాపాడుచుండును. అదే విధముగా వనమున గాపాడునది వనదుర్గ, పర్వతములందు కాపాడునది పర్వతదుర్గ. గంగ మొదలు కావేరి వరకు నదులన్నియు నదీదుర్గలు. సరస్సులును దుర్గలే.

మరియొక విషయము గమనించినచో నిది విస్పష్టకరము కాగలదు కోటయను పదమునకు దుర్గము అనునది పర్యాయ పదము గదా ! ఏ కోట కట్టినను ముందక్కడ కోటశక్తికి నిత్యపూజలును, సంవత్సరమున కొకసారి విశేషపూజలను జరుగుచుండెను శత్రువుల బారినుండి రక్షించుట చేతనే అందు ప్రతిష్ఠింపబడిన దుర్గాదేవత కారణమున గూడ కోటలకు దుర్గములను నన్వర్థ నామము వచ్చినది.

పురములు, గ్రామములు, వనములు, పర్వతములే కాదు మన గృహములే దుర్గా క్షేత్రములు గృహప్రవేశ మొనర్చునపుడు గణపతి నర్చించి పుణ్యాహవాచన మొనర్చి వాస్తుపూజ, నవగ్రహ పూజ నిర్వర్తించి నూతన గృహములో తూర్పు భాగమున పూర్ణకలశ ద్వయము ప్రతిష్ఠించి, గృహదేవతా పూజ గావింతుము ఆ వెంటనే అగ్ని ప్రతిష్ఠాపనము జరుగును. గృహదేవతయే గృహదుర్గ. దాని ప్రత్యక్ష స్వరూపమే అగ్ని. దానికే సంధ్యావేళల దీపారాధన మొనర్చి నమస్కరింతుము.

ఎన్ని విధముల మనము విస్మరించుటకు యత్నించినను మన యందనుగ్రహ బుద్ధితో దుర్గాదేవత మనలను వదలక కటాక్షించుచు అనేక రూపములతో కొట్టవచ్చినట్లు ప్రత్యక్షమవుచున్నది. ఆ సేతు హిమాచల మధ్యస్థయగు ఈ పుణ్యభూమిలో జనులుపాసించు దేవత దుర్గ. అందులో గ్రామీణులని, నాగరీకులని, వనవాసులని, పురవాసులని, పేదలని, ధనవంతులని, సేవకులని, మహాప్రభువులని, స్త్రీలని, పురుషులని తారతమ్యము లేదు. అందరకును దుర్గాదేవి ఆరాధ్యయే. ఇప్పటికిని వివాహమునకు పూర్వము వధువు విధిగా గౌరీపూజ చేయుట యాచారము. రుక్మిణీదేవి కల్యాణమునకు ముందు దుర్గను పూజించుటకు పురి వెలువడి వచ్చుట అందరికీ తెలిసినదే. రఘువంశ కావ్యములో పదునావరవ సర్గలో కుశస్థలములోనున్న కుశునికి సాకేతపురాధిదేవత అర్ధరాత్రమున ప్రత్యక్షమై అతనిని మరల కుల రాజధానిని ప్రవేశింప చేసినది ఈ సందర్భమున గుర్తునకు తెచ్చుకొనదగును.

ఈ విధంగా భరతదేశమందంతటను సర్వకాలములందును దుర్గాదేవత ప్రధానముగా పూజింపబడుచున్నది. దీనికి కారణము భరత ఖండములో ధర్మమంతటికి మూలము శ్రుతి. అది స్వతః ప్రమాణము గలది. అందులో పై నుదహరించిన మంత్రములే కాక శ్రీసూక్తము మొదలగు మంత్రము లెన్నో దుర్గాపరమైనవి కలవు అయితే ఒక్క దేవీపరములైన మంత్రములే కాక మరి ఎందరో ఇతర దేవతలను ప్రతిపాదించు మంత్రములున్నవి కదా యని సందేహము వచ్చుట సహజము. కాని ఒక్క విషయము గమనించినచో అశంక నివృత్తియగును.

వేదాధ్యయనమున కధికారము ఉపనయనదీక్షతో ఆరంభమగును ఉపనీతునికి ముందు గాయత్రీ మంత్ర ముపదేశించి నిత్యము ముప్పూటలు సంధ్యావందనము చేయించి, ఆ పిమ్మట సమస్త వేదములు ఉపదేశించుచున్నారు సంధ్యోపాసనము ప్రధానముగా గాయత్రీ మంత్రానుష్ఠానమే కదా ! అందులో గాయత్రిని ఆవాహన చేయుచు, గాయత్రితోపాటు సావిత్రిని, సరస్వతిని, చందర్షులను, శ్రీదేవతను ఆవాహన చేయుచున్నాడు. తర్వాత గాయత్రికి ఉద్వాసన చెప్పుచు ఆమెను వరదాన శీలయైన వేదమాతగా కీర్తించుచున్నాడు కాబట్టి, వేదమాతయే గాయత్రి ఉపాసనలలో నెల్ల ప్రథమమైనది, ప్రధానమైనది, ఉత్తమమైనది, గాయత్ర్యుపాసనమే. దానికి దేవత సవిత, ముఖమగ్ని, శిరస్సు బ్రహ్మ, హృదయము విష్ణువు, శిఖ రుద్రుడు, యోని పృథివి మరియు నది త్రిపద మూడు సంధ్యలలో మూడు రూపములతో నుండునది సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములే శిరస్సులుగా గలది. ఇట్టి గాయత్రి నుపాసించుట భరత ఖండములో అనాది గదా !

గాయత్రితోడనే ద్విజులకు అగ్నిహోత్రార్చనము వచ్చుచున్నది. దాని రూపము గనుకనే దుర్గను తరచుగా అగ్నివర్ణము కలదిగాను, తేజ స్వరూపమున ఆవిర్భవించునట్లును వర్ణింపబడినది. శ్రీదేవీ భాగవతము గాయత్రి నారాధించుట నిత్య విధియని చెప్పి మరల తుదకు ద్వాదశ స్కంధములో నిట్లు చెప్పుచున్నది. ''సత్య యుగమందందరు గాయత్రీ జప తత్పరులును తారహృల్లేఖలు జపించువారునై యుండిరి''. విష్ణూపాసనము నిత్యము కాదు శివోపాసనము నిత్యము కాదు. ఒక్క గాయత్రి ఉపాసనము తప్ప తక్కిన దేవతల ఉపాసనలు నిత్యములు కావు గాయత్రి నుపాసింపనిచో ద్విజుడు ద్విజత్వమునే కోల్పోవును. అట్టి ద్విజునికి హాని మరియే యితర మంత్రము నుపాసింపకున్నను కలుగదు. మనువు గూడ ఇతరములు చేసినను చేయకున్నను గాయత్రి మాత్ర మనుష్ఠింపవలెనని శాసించినాడు గాయత్రిని వదలి విష్ణూపాసనము, శివోపాసనము చేయువారు నరకమే పొందుదురు.'' ఇట్లు ద్ఘోషించి గాయత్రీ మంత్రాధికత్వను ప్రతిపాదించు నాఖ్యాయిక చెప్పి శ్రీదేవీ భాగవతము ఉపసంహార మొనర్చినది

గాయత్రి యనగా గానము చేయువానిని త్రాణము (రక్షించు) చేయునదని అర్థము. దుర్గ యనగా భక్తులను కష్టములు నుండి రక్షించునది యని యర్థము. ఈ రెండును ఒక్క దేవత నామములే. దుర్గా ప్రతిపాదకములైన మంత్రము లన్నియు గాయత్రీ మంత్ర భేదములే. కావుననే ఉపాసనా రహస్యము లన్నియు నిక్షేపింపబడియున్న సామవేదీయోపనిషత్తగు లలితా రహస్య నామస్తోత్రములో ఆ దేవత

ఒక చోట 'గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా ద్విజ బృంద నిషేవితా' అనియు, మరియొకచోట 'దుర్లభా దుర్గమాదుర్గా దుఃఖ హంత్రీ సుఖప్రదా' అనియు, ఇంకొకయెడ 'సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా సర్వేశ్వరి సర్వమయీ సర్వమంత్ర స్వరూపిణీ సర్వయంత్రాత్మిక సర్వతంత్రరూపా' అనియు, వేరొక యెడ, 'అపర్ణా చండిక చండ ముండాసుర నిషూదినీ' అనియు ఇత్యాదిగా బహువిధముల కీర్తింపబడినది

వేద మంత్రాధికారము నొసంగు గాయత్రీ మంత్రము పురుషులగు ద్విజులచేతనే అనుష్ఠింపదగినదని పెద్దల నిర్ణయము. మరి స్త్రీలను ద్విజేతరులను తరింపజేయు గాయత్రి యేది? ద్విజ పురుషులనే కాక ద్విజేతరులను, స్త్రీలను అందరను తరింపజేయుటకు శ్రుతి విధించిన సాధనములే దుర్గా మంత్రములు. ఇట్లందర నన్ని విధముల రక్షింపగల గాయత్రీ దేవతా స్వరూపములే దుర్గాదేవీ మూర్తులు రహస్య నామమందు వల్లనే దానిని 'ఆబాల గోపవిదితా' అని కీర్తించినది. నగరములలో, గ్రామములలో, గృహములలో, ఆయతనములలో, వనములలో, గిరులలో ప్రతిష్ఠించిన దుర్గామూర్తులే కాదు, భరత ఖండము మహాదుర్గామూర్తి, భరతమాత భారతీదుర్గ.



దుర్గోపాసన కేవలము వేదములలో గూఢముగా దాగియున్నది కాదు మహాభారతములో ఈ ఉపాసనాతిశయము కాన్పించును. పాండవు లే గడ్డుపని సాధింపవలసి వచ్చినను ముందుగా నుపాసించినది దుర్గాదేవతనే. పాండవులు సాధించిన గడ్డు పనులలో గడ్డైనది అజ్ఞాతవాస వత్సర సమాప్తి విరాట నగరమును సమీపించుచు తమ అజ్ఞాతావాస సమయము నిర్విఘ్నముగా పూర్తియగుటకు ధర్మరాజు ప్రార్థించినది దుర్గాదేవినే. ఆ స్తోత్రము చదివిన వారికి దుర్గా సప్తశతిలోని స్తోత్రములు స్పష్టముగా స్ఫురించును.

తరువాత వారు సాధించినది మహాభారత యుద్ధములో విజయము యుద్ధభూమిలో ప్రవేశించిన వెంటనే శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని దుర్గాస్తోత్రము చేయమని చెప్పెను వెంటనే అర్జునుడు రథముపై నుండి దిగి దుర్గాస్తోత్ర మొనర్చెను దుర్గాదేవి గోవిందుని ముందు నిలిచి అర్జునునికి ప్రత్యక్షమై శీఘ్రముగా జయింతువని అదృశ్యమయ్యెను.

మహాభారతములోనే కాక హరివంశమందును దుర్గా మహత్త్వము, స్తోత్రము కలవు ప్రబంధపరమేశ్వర ఎఱ్ఱకవి వచనములలో తెలిసికొందము శ్రీవిష్ణువు అవతరించుటకు ముందు యోగమాయతో నిట్లనెను

''నామేనితో దుల్యమై మేను నవమేఘ కాంతి నొప్పార సంకర్షణునకు
నెనయైన వదన పూర్ణేందుండు శోభిల్ల నెనిమిది బాహువు లొసగి శార్ఙ
చక్ర గదా ఖడ్గ జలరూహ మధుపాత్ర మునల శూలముల నుల్లసితములుగ
నుజ్జ్వల హార కేయూరాది దివ్య భూషణ గంధమాల్య విస్తారలీల

నీల కౌశేయ వసనవై నిఖిల సిద్ధ
గణము పూజింప దివికేగ గలవు నిన్ను
నెదురు వచ్చి తోడ్కొని పోయి యింద్రుడెలమి
నాదిశక్తిగ నభిషేక మాచరించు.''

''నీవు నాకు నక్కొశికునకుం జెలియలవై కౌశికి యను పేరం బ్రసిద్ధి వహించి వింధ్యాచలంబు నివాసంబుగా నుండి శుంభ నిశుంభులను దైత్యుల వధియించి లోక హితం బొనర్చెదవు. శ్రీయు, ధృతియు, శాంతియు, హ్రీయు, విద్యయు, సన్మతియు, మతియు, సంధ్యయు, రాత్రియు, ప్రభయు, గాంతియు, నిద్రయు గాలరాత్రియు నను నామంబులు నీకు వాచకంబులుగా మహామునులుం గీర్తింతు రార్తులై కొలచు వారికి దారిద్ర్యబంధన వధ ప్రముఖంబులగు సుఖదుఃఖంబులపనయించి యాయురారోగ్య ధనధాన్య పశుపుత్ర భృత్యాది కింబులగు కల్యాణంబులు గరుణింపుము.''

తరువాత కంసుండు యోగ మాయను చంప ప్రయత్నింపగా పై కెగసి యద్భుతాకారయై యందుండి,

తన చేతి పానపాత్రం
బున నొలికెడి దివ్య మధువు ముదమున నాస్వా
దన మొనరించి మదోద్ధత
నినదంబున బెలుచ నవ్వి నిష్ఠుర భంగిన్॥

కంసునితో నాతని చంపువాడున్నాడనియు, తాను మృత్యుమూర్తియై యాతని ప్రాణములు రుధిరములు నొక్క వూపున గ్రోలుదునని చెప్పి అదృశ్యమయ్యెను.

ఈ సందర్భమున దుర్గాసప్తశతిలో మహిషాసుర మర్దనమునకు ముందు భగవతి,

'' ఉవాచ తం మదోద్ధూత ముఖరాగా కులాక్షరమ్ ।
గర్జగర్జ క్షణం మూఢ మధు యావ త్పిబామ్యహమ్ ॥

అన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకొన్నచో రెండు విషయములు స్పష్టమగును. ఈ ఇద్దరు ఒకే దేవత అవతార భేదములని, ఆమె చేతిలోనిది ''దివ్య మధువు'' కల సుధాపాత్రయే గాని సప్తశతి అప పాఠములలో నున్న సురాపాత్రము కాదనియు స్పష్టము. దేవత ఒకటే అనుటకు సప్తశతిలో శుంభనిశుంభ వధానంతరము శ్రీదేవి ప్రత్యక్ష వచనములే ఉన్నవి.

'' వైవస్వతేఽంతరే ప్రాప్తేష్టా వింశతి తమేయుగే
శుంభో నిశుంభశ్చై వాన్యా వుత్పత్స్యేదే మహాసురౌ ॥
నందగోప గృహే జాతా యశోదా గర్భ సంభవా
తతస్తౌ నాశయిష్యామి వింధ్యాచల నివాశినీ ॥

అనిరుద్ధుడు బాణుని నాగపాశములచే బద్ధుడై యుండి ఆర్యాస్తోత్ర మొనర్చి పాశవిముక్తుడయ్యెను. అందులో నుండి ఈ భాగము లుదహరించిన జాలును .

''నందుని కూర్మి నందన యనంగ యశోదకృశో దరంబు జెందందగ నావహించి ప్రకటంబుగ విష్ణుని తోడబుట్టువై సుందర గోకులైక నవ శోభనయై జనియించియే జగద్వందిత యొప్పె నాయసురదారణి నాదిమశక్తి గొల్చెదన్. తనువు లందెల్ల నెలసి చేతనయనంగ..... ..''

లక్ష్మి సరస్వతి లజ్జ కీర్తి.....సావిత్రి, దుష్టి, శాంతి, దైవమాతా, భక్తప్రియ దలతు భక్తి......దుర్గ దుర్జయ.....శివ వజ్రపాణి భగిని.....శుంభనిశుంభవ్యా మర్దిని... ఎల్ల వేళ్ళెల్ల రూపము లెల్ల నీవె వరదాయిని మహిషాసుర మర్దని వైదికాది బ్రహ్మాణి శివ సుందరి నారాయణి య చలేశ్వరి కన్యక యనగ నీదు సంజ్ఞలు తల్లీ ! ''

ఆది కావ్యమగు వాల్మీకి రామాయణములో దుర్గాపూజ ఉన్నదా ? అని సందేహము కలుగవచ్చును. అందులో సీతాదేవియే ఆదిశక్తియని సమాధాన మిచ్చి మిన్నకుండ నవసరము లేదు. శ్రీరామునికి వనవాసమునకు బోవుచుండ సర్వరక్ష యొనర్చి కౌసల్య తుదకిట్లు మంగళ మొనర్చినది.

''య న్మంగళం సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే
వృత్ర నాశే సమ భవత్ తత్తే భవతు మంగలమ్ ॥
యన్మంగలం సువర్ణస్య వినతా కల్పయత్ పురా
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగలమ్ ॥
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్
అదితి ర్మంగలం ప్రాగాత్ తత్తే భవతు మంగలమ్ ॥
త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః
యదాసీ న్మంగలం రామ తత్తే భవతు మంగలమ్ ॥
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ
మంగలాని మహాబాహూ దిశంతు శుభమంగలాః ॥

ఈ విధంగా సర్వమంగలా దుర్గనే కౌసల్య యావాహన మొనర్చినది. రామాయణ పారక్రమములో పెద్దలీ మంగళ శ్లోకములు పఠించుచుండుట సంప్రదాయము గదా ! వృత్రవధమందు, అమృతాహరణమందు, క్షీరసాగర మధనమందు, త్రివిక్రమ క్రమమునందు ముందుగా స్తుతింపబడినది సర్వమంగళా దేవతయే యనియు దీనిచే సూచింపబడుచున్నది. నేటికిని ప్రయాణ సమయముల సర్వమంగళామంత్రస్మరణ మొనర్చుట వృద్ధాచారము.

పురాణ పురుషులే కాక, నేటివారు చారిత్రక పురుషులని భావించుచున్న మహానుభావులందరూ దుర్గోపాసకులే. వారిలో అగ్రగణ్యులు శ్రీవిద్యా శంకర భగవత్పాదులు. వారి ఆశ్రమ నామమే భారతి. వారు ప్రతిష్ఠించిన పీఠములన్నియు భారతీ పీఠములే. వారి శిష్య పరంపర భారతీ నామము ధరించి ప్రత్యక్ష దుర్గామూర్తులుగా విలసిల్లుచున్నారు. శ్రీవిద్యా శంకరులు దిగ్విజయము చేయునప్పుడే వక్ర మార్గములు పట్టిన దుర్గోపాసనము వైదిక మార్గమునకు త్రిప్పినట్లు స్థల పురాణము లెన్నో చెప్పుచున్నవి. అట్టి వానిలోనిదే విజయవాడ కనకదుర్గమ్మ.

శ్రీ విద్యా శంకర పరంపరలో ప్రత్యేకముగా నెన్నదగిన మహానుభావుడు శ్రీ విద్యారణ్యులు. వారి యిష్టదైవము వనదుర్గ. తన యిష్టదేవతనే నగర రక్షణకు ప్రతిష్ఠించి శ్రీ విద్యానగరము నాతడు ప్రతిష్ఠ చేసెను. ఆ దుర్గకు పూజ జరిగినన్నాళ్ళు శ్రీ విద్యా నగర రాజ్యమునకు చ్యుతి లేదు.

మహాకవి కాళిదాసు దుర్గా భక్తుడు చాళుక్య ప్రభువులు తమ వంశకర్త ''నందాం భగవతీం ధ్యాయన్'' సామ్రాజ్య చిహ్నములు వడెసెనని శాసనములలో వ్రాయించుకొనిరి. రాజ రాజ నరేంద్రుడు దాన శాసనములో తాను 'చండీ ప్రసాద లబ్ధ సామ్రాజ్య ధౌరేయుడ' నని చెప్పుకొన్నాడు ఈ మధ్య కాలములో వైదిక ధర్మ రక్షణకు పూనుకొన్న శివాజీ మహారాజు దుర్గా భవానీ భక్తుడు.

వైదిక ధర్మమును ప్రతిఘటించిన బౌద్ధులు, జైనులు ఇత్యాదు లుపాసించినదియు తారాది దుర్గామూర్తి బేధములనే వారల వలననే దుర్గాపూజ అపమార్గముల పట్టినది. మనకు ప్రస్తుతము లభించు తంత్ర గ్రంధముల ప్రతులలో వారల సంపర్కము విశేషముగా కనబడుచున్నది. వానిలో నీరక్షీరములను పరమహంస రూపులగు కల్యాణ పాదులు చాల వరకు వేరు చేశారు. కాని, ఆ పని పూర్తి కాలేదు. ఇప్పుడు మనకు కల్యాణ పాదుల వంటి పరమహంసల అవసరమెంతో ఉన్నది.

వైదిక మతద్వేషి యని యాంగ్లేయ చరిత్రకారులు చిత్రించిన టిప్పు సుల్తాను తనకు యుద్ధములో జయము కొరకై శతచండీ యాగము చేయింపవేడుచు శ్రీ శృంగేరీ పీఠాధిపతులకు పంపిన యుత్తరము హిందూపత్రిక ప్రకటించినది.

దుర్గాదేవ తాశయమునకు చెరుపరాని గుర్తు ఎప్పటికి ఉన్నది మన పండుగలలో గొప్ప పండుగ శరన్నవ రాత్రములు.

దుర్గా స్వరూపము లనంతములు. ఐనను వానిలో ప్రధానముగా చండీదుర్గ, వనదుర్గ, శాలినీదుర్గ యను మూడు దుర్గామంత్రములు ప్రచారము నొంది యున్నవి. దుర్గోపాసనల కన్నిటికిని మూలముగా చండీ నవార్ణ మంత్రమును తత్సంబంధమైన దుర్గా సప్తశతీ మాలా మంత్రమును గ్రహింపవచ్చును. శివ పంచాక్షరియు, దాని మాలా మంత్రమగు శత రుద్రమును ఎట్లు అనంత ఫలప్రదములో అట్లే ఇవియు అనంత ఫలప్రదములు. ఇవి రెండును శివాశివశక్తి ప్రతిపాదకములగు మహోపాసనలు.

(శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి వ్యాసమునకు సంగ్రహరూపము)



# అనుబంధము - 7

# శ్రీవిద్య

సర్వ విధములగు జ్ఞానములకు, ఐహికాముష్మిక సుఖ మార్గములకు వేదములు నిధానములు. వేదములు (1) ఋగ్వేదము, (2) యజుర్వేదము, (3) సామవేదము, (4) అధర్వణవేదము అని నాలుగు విధములు. అవి ఒక్కొక్కటి పఠన పాఠన సంప్రదాయముల చేతను, కొన్ని ప్రయోజనముల చేతను నానా శాఖలుగా వెలుగొందినవి

| | | |
|---|---|---|
| (1) ఋగ్వేదము | - | 21 శాఖలు |
| (2) యజుర్వేదము | - | 101 శాఖలు |
| (3) సామవేదము | - | 1000 శాఖలు |
| (4) అధర్వణవేదము | - | 9 శాఖలు |

గను విభజింపబడియున్నవని పతంజలి తన మహాభాష్యమున పేర్కొనెను. వీనిలో సామవేదములో బహు శాఖలున్నవి. వీనిలో చాల శాఖలు నశించి పోయినవి వేదములలో సామవేదమునకు ప్రాశస్త్యము ఉన్నట్లు భగవద్గీత వలనను, శిష్ట వచనముల వలన తెలియుచున్నది.

'' వేదానాం సామవేదోఽస్మి '' (భ.గీ. 10 - 22)

''సామవేదశ్చ వేదానాం యజుషా శత రుద్రీయం ''

సామవేద ప్రాశస్త్యమునకు కారణము ఇందలి ఉపాసనా విశేషమే అని చెప్పవచ్చును ఇది చాందోగ్యోపనిత్తు వలన విదితమగును.

సామవేద ప్రాశస్త్యము చాందోగ్యములో ఉద్గీథ ప్రసంగమున ఇట్లు చెప్పబడినది.

''ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత.. .

ఏషాం భూతానాం పృథివీ రసః, పృథివ్యా ఆపోరసః,

అపా మోషధయోరసః, ఓష ధీనాం పురుషోరసః,

పురుషస్య వాగ్రసః , వాచః ఋగ్రసః, ఋచః
సామరసః సామ్నః ఉద్గీథోరసః '' (చాం 1-1-1,2 )

ఇట్లు వేదములలో కెల్ల సామవేదము ప్రాధాన్యము కల్గియున్నది

సామాన్యముగా వేదము మంత్రము, బ్రాహ్మణము అను రెండు భాగములుగా నుండును. తొలి భాగములగు మంత్రములకు కర్మలయందు వినియోగము బ్రాహ్మణము మంత్రార్థమును, మంత్ర వినియోగమును తెల్పును. సామాన్యముగా బ్రాహ్మణమునకు చివరి భాగమును ఉపనిషత్తు అందురు. అందుకే ఉపనిషత్తులకు వేదాంతములని పేరు ఇవి కర్మలతో సంబంధము లేని జ్ఞానమును బోధించును వేదములందు అద్వైత జ్ఞానమును బోధించు ఉపనిషత్ భాగమునకు, కేవలము ద్వైత దృష్టినే ఆధారము చేసికొని ప్రవర్తించే కర్మ భాగమునకు మధ్య ద్వైతాద్వైత దృష్టులను రెండింటిని ఆధారము చేసికొని ప్రవర్తించిన ఉపాసనా భాగము కొంతగలదు. ఇది కర్మ జ్ఞానములను కలుపు సేతువు ఉపనిత్తులలో జ్ఞాన బోధకములగు ఉపనిషద్భాగములకు ముందు ఉపాసనములను బోధించు భాగముండును

పురుషార్థ సాధకములగు ఉపాసనమనములు సర్వ వేదములందు చెప్పబడినను, సామవేదములో చెప్పబడినన్ని చతుర్విధ పురుషార్థ సాధకములగు ఉపాసనములు మరి ఏ వేదమునను చెప్పబడలేదు అనగా సామవేదము ఉపాసనలకు ప్రథమ స్థానము

# II

సకల వేదముల వలన పొందదగిన పరమ పురుషార్థమును, తత్సాధనమును బోధించు శ్రుతి రాజము ఇట్లు చెప్పుచున్నది :

బ్రహ్మ విదాప్నోతి పరమ్ । త దేషాభ్యుక్తా ।
సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ । యో వేద నిహితం
గుహాయాం పరమే వ్యోమన్ । సోఽశ్నుతే సర్వ
క్కామాన్త్సహ బ్రహ్మణా విపశ్చి తేతి ॥

ఈ శ్రుతి వలన బ్రహ్మ విద్యయనునది చతుర్విధ పురుషార్థముల నభిలషించు వైదిక ధర్మానుయాయులకు అత్యంతోపాదేయముగా అనాదిగా బరగుచున్నది ఇట్టి బ్రహ్మ విద్య పరాపర భేదముచే రెండు విధములుగా ఉన్నదని ముండకోపనిత్తునందు చెప్పబడినది

'' ద్వే విద్యే వేదితవ్యే ఇతిహస్మ యద్బ్రహ్మ విదోవదన్తి, పరాచైవా పరాచ ''
(ముండ 1-4)

ఇందు అపరావిద్య అను మాటయే అవిద్యయను నామాంతరముచే గ్రహింపబడి విద్యాద్వై విద్యావ బోధకముగా ఈశావాస్యమున ఇట్లు చెప్పబడినది ·

అంధం తమః ప్రవిశన్తియేఽవిద్యా ముపాసతే ।
తతో భూయా ఇవతే తమోయ ఉవిద్యా యాగ్ం రతాః ॥

అన్య దేవాహుః సంభవాదన్యదాహు రసంభవాత్ ।
ఇతి శుశ్రు మధీరాణాం యేనస్త ద్విచ స్త చక్షిరే ॥

విద్యాం చా విద్యాం చయ స్త ద్వేదో భయగ్ం సహ ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే ॥
(ఈ.వా.ఉ 9, 13, 14).

ఈ విద్యా విద్యలే కఠవల్లి యందు గూడ నిట్లు చెప్పబడినవి

దూరమేతే విపరీతే విషూచీ అవిద్య యా చ విద్యేతి జ్ఞాతా । (క ఉ 4)

ఇట్లే శ్రుతుల తాత్పర్యమును శ్రీకృష్ణ భగవానుడు ---

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయాఽనఘ ।
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మ యోగేన యోగినామ్ ॥ (భ.గీ. 3-3)

పైన శ్రుతుల యందు అవిద్యయను శబ్దముచే తెలియ వచ్చెడి విషయమును ఉపాసనమను పారిభాషిక పదముచే బ్రహ్మవిదులు వాడుచున్నారు ఇట్టి యుపాసనమే తపశ్శబ్దముచే గూడ అచ్చటచ్చట శ్రుతులయందు పేర్కొనబడుచున్నది. శ్రుతి సమ్మతములగు ఉపాసనా విశేషములను పుష్కలముగా ఉపదేశించుటయే పరమ తాత్పర్యముగా కలిగి ఛాందోగ్య, బృహదారణ్యకములు రెండును బ్రవర్తించుచున్నవి. బ్రహ్మ విద్యకు అవ్యవహిత సాధనమగు ఉపాసనము బ్రహ్మ విద్యోపదేష్ట్రియగు శ్రీదేవి

యుపాసనమగుటచే శ్రీవిద్యయను పవిత్ర నామముతో వ్యవహరింపబడుచున్నది బ్రహ్మ విద్యోపదేష్ట్రియగు శ్రీవిద్య సంప్రదాయ ప్రవర్తకులచే నిట్లు స్తుతింపబడుచున్నది.

ధ్యాయే పద్మాసనస్థాం వికసిత వదనాం పద్మపత్రాయ తాక్షీమ్।
హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసద్ధేమ పద్మాం వరాంగీమ్ ॥
సర్వాలంకార యుక్తాం సతత మభయదాం భక్త నమ్రాం భవానీం।
శ్రీ విద్యాం శాంత మూర్తిం సకల సురనుతాం సర్వసపత్ప్రదాత్రీమ్ ॥

బ్రహ్మ విద్యోపదేష్ట్రియగు నీ శ్రీవిద్యను గూర్చి కేనోపనిషత్తునందు 3/11 నుండి 4/8 వరకు వర్ణింపబడినది.

ఈ శ్రుతియందు వినబడుచున్న బహుశోభ మానా ముమాం హైమవతీం అను పదములచే వినవచ్చెడి శ్రీవిద్యయే శ్రీసూక్తముచే సంక్షేపముగా వర్ణింపబడినది పురుష సూక్తము గూడ నీ శ్రీదేవి యొక్క స్వరూప వర్ణనా విశేషమేయని సంప్రదాయవిదులు ఉపదేశించుచున్నారు. శ్రీదేవి యొక్క పవిత్రమగు నామాంతరములుగా గాయత్రీ సంధ్యా శబ్దములు ఉదహరింపబడుచున్నవి. వైదిక ధర్మముచే పవిత్రముగా నెన్నబడు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమములు నాలుగును శ్రీవిద్య యొక్క సోపాన విశేషములే. శ్రీవిద్య అగ్నివాయ్వాదిత్యులను మహాదేవతోపాధు లుపాస్య స్థానములుగా గల్గి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థములందు అపరవిద్యారూపము నొందుచు గాయత్ర్యుపాసనము ప్రధానముగా గల్గియున్నది.

ఇక పరావిద్య యన్ననో పరాపర బ్రహ్మప్రతీకరంబగు ప్రణవోపాసనముతో నొప్పు శ్రీవిద్య.

ఇట్లు ప్రకట గాయత్రి మొదలుగా గల్గి ప్రణవ మంత్రముగా గల సముదాయము యొక్క ఉపాసనమే శ్రీవిద్యోపాసనమని శ్రుతి స్మృతి సదాచార సంప్రదాయ సిద్ధమగు విషయము. శ్రీ విద్యా విశేషములు ఉపనిషత్తుల యందు బహు విధముల ఉపదేశింపబడి యుండుటచే ఉపాసకులకు దద్ధర్మములు సుగమముగా తెలియుటకై శ్రీవిద్యాధిష్ఠాన దేవతయగు పరదేవత నుండి ''శ్రీమాతా'' అను రహస్య నామము ఆదిగా గల్గిన ''లలితాంబికా''యను రహస్యనామము అంతముగా గల్గిన రహస్యనామ సూత్రము వెలువడినది. కావున శ్రీవిద్యోపాసకులకు

''లలితారహస్యనామ సూత్రము'' శ్రుతి సమ్మతముగా బరమ ప్రమాణమగు చున్నది. లలితారహస్య నామ స్తోత్రము శ్రీదేవి సంపూర్ణ స్వరూపమును చేయు కార్యములను మొదలగు విషయములను తెల్పును. ప్రతి నామము ఒక మహామంత్రము ఇది అన్ని సహస్ర నామములకంటె గొప్పది దీనిలో నామములు పునరావృతమగుట గాని, అనవసరపు మాటలు (చ, తు, అపి) గాని లేవు

మొదట శ్రీవిద్యోపాసకుడు ఇంద్రుడు. ఉమాహైమవత్యుపాసనము తొలుత చేసి తత్ఫలమును నొందినవాడు ఇంద్రుడు. ఇదంతయు కేనోపనిషత్తునందున్నది ఇప్పుడు కేనోపనిషత్తును గూర్చి కొంత తెలిసికొందము.

# III

కేనోపనిషత్తు తలవకారమను సామశాఖకు సంబంధించినది కావున దీనికి ''తలవకారోపనిషత్త''ను నామము గలదు. దీనిలో నాల్గు ఖండములన్నవి. మొదటి రెండు ఖండములను పూర్వభాగమనియు, మిగిలిన రెండు ఖండములను ఉత్తర భాగమనియు అందురు. దీనిలో మొత్తము 34 వాక్యములు గలవు. సామాన్యముగా ఉపనిషత్తులలో మొదటి భాగము ఉపాసనమును తెల్పుచు తుది భాగము బ్రహ్మవిద్యను తెల్పును. కాని ఈ ఉపనిషత్తు మాత్రము అట్లుగాక తొలి భాగము బ్రహ్మవిద్యను బోధించి రెండవ భాగము బ్రహ్మ విద్యా ప్రయోజకమగు ఒక ఉత్తమ ఉపాసనను తెల్పుచున్నది రెండవ భాగము ఇతిహాసముగా నున్నది

**క్లుప్తముగా ఆ ఇతిహాసమిది :**

ఒకప్పుడు దేవాసురులకు యుద్ధము జరిగినది. ఆ యుద్ధములో అంతర్యామి రూపమున నున్న బ్రహ్మము ఈశ్వర ధర్మసేతు భేదనమును గావించు అసురులను జయించి ధర్మసేతు రక్షకులగు దేవతలకు జయము నిచ్చెను. కాని దేవతలు ఆ విజయము తమ శక్తి వలనే కలిగినదని విర్రవీగ సాగిరి. అది చూసి పరమేశ్వరుడు వారల అజ్ఞానమును పోగొట్టి వాస్తవమును తెలియునట్లు చేయుటకు అత్యద్భుతమగు రూపముతో ప్రత్యక్షమయ్యెను ఆ రూపమేదియో వారికి అంతుపట్టలేదు. అది యేమో తెలిసికొని రమ్మని తమలో ప్రధానుడగు అగ్నిదేవుని పంపిరి. ఆ అత్యద్భుత రూపము అగ్నిని నీ వెవ్వడవు? నీ శక్తి ఏమి? అని అడిగెను. దానికి అగ్ని తనను అగ్నియనియు, జాతవేదుడని పిలుతురనియు, ఈ జగత్తునంతయు భస్మము

చేయగలనని చెప్పెను అపుడా యక్షము అతని ముందు ఒక గడ్డిపోచను ఉంచి దగ్ధము చేయమనెను అగ్నికి చేతకాక సిగ్గుపడి వెళ్ళిపోయెను అపుడు దేవతలు మహాబలుడగు వాయువును పంపిరి అతడు గూడ అవమానితుడై వెళ్ళిపోయెను అంత దేవతల ప్రార్థన మీద ఇంద్రుడు వచ్చెను. అతడికి ఆ యక్ష దర్శనమే కాలేదు. అప్పుడు ఇంద్రుడు అభిమానమును పోగొట్టుకొని తపము చేసెను అప్పుడు ఉమాహైమావతీ రూపిణియగు ఒక స్త్రీ ఆ యక్ష స్థానములో ప్రత్యక్షమయ్యెను. ఇంద్రుడు ఆ యక్ష మేదియో తెలుపవేడెను. అప్పుడు ఆ ఉమ బ్రహ్మము స్వరూపమును దేవేంద్రునకు ఉపదేశించెను.

ఇంద్రునికి ప్రత్యక్షమైన ఆ స్త్రీరూపమును శ్రుతి, ఉమా,హైమావతీ అను రెండు పేర్లతో పేర్కొనెను. ఉమ అనునది 'ఓమ్' అను ప్రణవము యొక్క ప్రథమ వికృతి రూపము.

అ + ఉ + మ్ = ఓమ్

ఉ + మ్ + అ = ఉమ

ఉమా శబ్దము చెప్పే పదార్థము బ్రహ్మము యొక్క ఆవిర్భూతరూపము. హైమవతీ గూడ బ్రహ్మమును బోధించుచున్నది. హైమ అంటే జ్యోతి అనియు, హైమావతి అంటే ప్రకాశ స్వరూపమనియు అర్థము. ఉమతో అభిన్నయగు ఈ హైమవతి ప్రణవవాచ్యుడును ప్రకాశ స్వరూపుడును అగు పరమేశ్వరుని కంటె భిన్నము కాదని తెలియుచున్నది. కావుననే స్త్రీ పుంరూపాతీతమగు బ్రహ్మ పదార్థము నపుంసక బ్రహ్మ శబ్దము చేతనే చెప్పబడును అట్టి బ్రహ్మము యొక్క ప్రథమాభివక్తి మాత్రము స్త్రీ ఆకృతి తోడనే కలుగుచున్నట్లు బ్రహ్మవిద్యయగు గాయత్రీ ధ్యాన శ్లోకమును బట్టి తెలియుచున్నది. ఉపనయనములో గురువుచే ఉపదేశింపబడు గాయత్రిని ప్రకట గాయత్రియనియు, జిజ్ఞాసాపూర్వకముగా ప్రాజ్ఞుడు సరియగు అధికారమును పొంది ఉపాసించు గాయత్రికి ''గుప్తగాయత్రి'' అనియు అందురు ఒకప్పుడిట్టి బ్రహ్మోపాసననునే అధికారి భేదమునుబట్టి పుం రూపముతో గూడ ఉపాసింపవచ్చును.

ఇట్టి ఉపాస్య బ్రహ్మరూపమునే కామకామేశ్వరీ రూపము, శ్రీ శివాశివరూపము, శివశక్తి సామరస్యరూపము అనియు చెప్పుదురు. ఉమా హైమవతీ దేవిని ధ్యానించునపుడు అధికారి భేదముచే ఏ రూపముతోనైనను ధ్యానింపవచ్చునని ఈ క్రింద పేర్కొనిన దానివలన తెలియుచున్నది

స్త్రీరూపం వా స్మరేద్దేవీం పుంరూపం వా చింతయేత్ ।
అథవా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానంద రూపిణీమ్ ॥

ఇట్టి శ్రీ శివాశివరూపమును అర్ధ బ్నగళ రూపమని లౌకిక దృష్టితో ఉపనిషత్తు పేర్కొనుచున్నది దానిని ఆధారము చేసికొని మందాధికారి కొరకు స్మృతులు -

శివకామేశ్వరాంకస్థా అనియు
బిందు పీఠోపరి స్వాభిముఖ మానంద విగ్రహః
x x x x x x x x x x x x x x x
x x x x x x x x x x x x x x x
జాగర్తి భగవ నాదిదేవః కామేశ్వర ప్రభుః ।
తస్యోత్సంగే సమాసీనాం తరుణాదిత్య పాటలాం
అశేష వ్యవహారాణాం స్వామినీం సంవిదమ్ పరామ్ ॥

అని స్మరించుచున్నది

ఈ కేనోపనిషత్తుచే ఉపాస్యముగా బోధించు ఈ దేవతారూపము స్థూలముగా చూచిన స్త్రీరూపముగా తోచినను సామశ్రుతి సంప్రదాయమును బట్టి స్త్రీపుం సామరస్యరూపమనియే చెప్పవలసియున్నది

ఉమాహైమవతీ ఉపాసనము బ్రహ్మోపాసనమేగాని వేరొండు కాదు ఇది మోక్షవిద్యయగుటచే దీనినే 'శ్రీవిద్య' అనియు అందురు ''సాహి శ్రీ రమృతా సతాం'' అనెడి శ్రుతియందు శ్రీశబ్దము మోక్షవాచకముగా పేర్కొనబడినది కావున శ్రీయన మోక్షము దానిని కలుగచేయు విద్య శ్రీవిద్య

ఉమాహైమవతీ రూపము బ్రహ్మము యొక్క ఉపాస్యారూపము ఈ ఉపాసనచే ఫలితము పొందిన మొదటివాడు ఇంద్రుడని పైన చెప్పుకొన్నాము

ఉమాహైమవతీ దేవత మోక్షవిద్య ఫలము గావున ఇంద్రుడు ఉపాసించిన మంత్రము ఈ మంత్ర విశేషమును విద్యా విశేషమును దేవతా స్వరూప విశేషమును గూడ కేనోపనిషత్తు మూలకములగు స్మృతి గ్రంథములు ''శ్రీవిద్యాం శాంతమూర్తిం, సకల సునసుతాం'' అనియు, ''ఆత్మ విద్య, మహావిద్యా, శ్రీవిద్యా, శ్రీషోడశాక్షరీ విద్యా, త్రికూట, గాయత్రీ, వ్యాహృతిః ఉమాశైలేంద్ర తనయా, త్ర్యక్షరీ, పరంజ్యోతిః,

సర్వ వేదాంత సంవేద్యా, సత్యానంద స్వరూపిణీ ముక్తిదా, శ్రీశివ శక్త్యైక్య రూపిణీ'' మొదలగు రహస్య నామములచేత తెలుపబడుచున్నది

# IV

సామాన్యముగా శక్తికి సంబంధించి పన్నెండు అక్షరములకు మించియున్న మంత్రమును విద్యా అందురు మహా త్రిపుర సున్దరి మంత్రము శ్రీవిద్యా ; యంత్రము శ్రీచక్రము.

శ్రీవిద్య బ్రహ్మవిద్య యగుటచే మహావిద్య అనబడుచున్నది. తంత్రములలో అనేక మహావిద్యలు ఉన్నవని అంటారు. వానిలో పది ముఖ్యమైనవి. అవి దశమహావిద్యలుగా లోకములో ప్రసిద్ధి అవి : (1) కమలా, (2) బగళా, (3) భువనేశీ, (4) భైరవీ, (5) ధూమావతీ, (6) ఛిన్నమస్తా, (7) తారా, (8) కాళీ, (9) మాతంగీ, (10) షోడశీ. ఇవి దశావతార సంబంధములుగా తెలియుచున్నది. వీటిని సిద్ధ విద్యలనియు గూడ అందురు. వనదుర్గాది దశవిద్యలును మహావిద్యలుగానే తెలియబడుచున్నవి వానిలో వనదుర్గామహావిద్య ఎక్కువ ప్రచారములో నున్నది. సప్తకోటి మహామంత్రములందు శ్రీవిద్య మహామంత్రము అతి ప్రాముఖ్యమైనది, ప్రధానమైనది అగుటచే మహావిద్య అనబడుచున్నది చాంధోగ్యోపనిషత్తులోని ఉపకోసల విద్యయు, నారదుని భూమ విద్యయు, యాజ్ఞవల్క్య మైత్రేయీ విద్యయు మహావిద్యలే.

లోకములో శ్రీవిద్యాదీక్ష బాలాది పాదుకాంతము వరకు 12 విధములుగా నున్నది. మూర్ధా భిషిక్తులు మూడు రకములు గలరు. సింహాసములు గూడ మూడు రకములు. రాజ్యమును పాలించువాడు ఒక సింహాసనమున అభిషిక్తుడు. ప్రస్థానత్రయ భాష్యములను పఠించి అవగాహన చేసికొనిన వాడు వేరొక సింహాసనమున అభిషిక్తుడు. పాదుకాంత దీక్షను గ్రహించినవాడు మంత్ర సింహాసనమున అభిషిక్తుడు. ఇప్పుడు బాలా, పంచ దశాక్షరీ, షోడశాక్షరీ మంత్రములను గూర్చి కొంత చెప్పుకొందము.

ముందుగా పంచదశీ విద్యను తెలిసికొనుటకు ప్రయత్నించుదాము. పంచదశీవిద్యకును ఆవిద్యాధి దేవత అగు మహా త్రిపురసున్దరికిని అభేదము. ఆత్మజ్ఞానమును తెలిసికొనటకు వేదములు సారభూతములు అందు గాయత్రి

సారము అది రెండు రూపములు గలది. ఒకటి ద్విజులచే ఉపాసింపబడుచున్న ద్వాత్రింశ దక్షర రూపమయినది. రెండవది వేదములయందు బహు గుప్తముగా నున్నది అదియే శ్రీవిద్యా పంచదశి గాయత్రికి పంచదశి విద్యకు భేదము లేదు. గాయత్రీపాద చతుష్టయము వలన శ్రీ విద్యా షంచదశి బీజములు ఉత్పన్నమగుచున్నవి. గాయత్రి, విద్యాపంచదశీ పరాశక్తికి శరీరములుగ నున్నవి. ప్రకట యనగా విద్యార్థి యొక్క యర్థిత్వము అవసరము లేకుండగనే యథాకాలమున ఉపదేశింపబడునది అని అర్థము. గుప్త యనగా విద్యార్థి యొక్క అర్థిత్వ సామర్థ్య విద్వత్తుల ననుసరించి యుపదేశింపబడునది. ప్రకట గాయత్రి ఉపదేశము ద్విజత్వ సంపాదకము, వైదిక విద్యా హేతుభూతము నగుటం చేసి విద్యార్థి యొక్క యర్థిత్వము లేకుండగనే ఉపదేశింపబడవలెనని శ్రుతి స్మృతి సదాచార మర్యాద

గాయత్రికి స్థూలమని, సూక్ష్మమని రెండు రూపములు గలవు అందు వెల్లడిగా నుండి చతుర్వింశతి వర్ణాత్మకమై (24 అక్షరములు) పాదత్రయము కలిగియున్న గాయత్రి స్థూలరూపము. గాయత్రి యొక్క తురీయపాదము శ్రీవిద్యగా సూక్ష్మరూపముగా నున్నది. అందువలన ఉపనయనము లఘుదీక్షగాను, శ్రీవిద్యామంత్రదీక్ష పూర్ణదీక్షగాను వాడుకలో నున్నది.

పంచదశీ విద్య కూటత్రయమునందు 12 విధములగు భేదము లున్నవి. (1) మనువు, (2) చంద్రుడు, (3) కుబేరుడు, (4) మన్మథుడు, (5) లోపాముద్ర, (6) అగస్త్యుడు, (7) నందీశ్వరుడు, (8) సూర్యుడు, (9) ఇంద్రుడు, (10) విష్ణువు, (11) శివుడు, (12) దూర్వాసుడు - ఈ పన్నెండు పేర్లలో పాఠభేదము గలవు. నందీశ్వరుడు, ఇంద్రుడు బదులు అగ్ని, కుమారస్వామి పేర్లు వచ్చును. మరి కొందరు సూర్యుడు, శివుడు, మనువు, నందీశ్వరుడు బదులు బ్రహ్మ, స్కందుడు, బలరాముడు, దత్తాత్రేయుడు చెప్పుదురు వీరందరు దేవీ ఉపాసకులు వీరు స్వయముగా వేదము నుండి పంచదశీ మంత్రమును గ్రహించి ఉపాసించిరి. వీనిలో కామరాజ (మన్మథుడు), లోపాముద్ర విద్యలు మాత్రమే అధికముగా సాధన చేయబడుచున్నవి. నామమాత్రముగా నందికేశ్వర విద్య కనబడుచున్నది. లోపాముద్ర విద్యహకారము మొదట గలది - హాది విద్య. కామరాజవిద్య క కారము మొదట గలదీ - కాది విద్య. నందికేశ్వర విద్య సకారము మొదట గలది - సాది విద్య.

ఈ విద్యలన్నిటిలో కామరాజ, లోపాముద్ర విద్యలు శ్రేష్ఠములు. ఈ రెండింటిలో సమయ మత-పరంపరగా వచ్చుచున్న కాదివిద్య ప్రశస్తము. శ్రీవిద్యా పంచదశి త్రిపద గాయత్రీ వలె మూడు కూటములుగా నుండును -

కాది విద్య : క ఏ ఈల హ్రీం । హ సక హలహ్రీం । సకల హ్రీం ॥
(కామరాజు)

హాది విద్య : హసక లహ్రీం । హసక హలహ్రీం । సకలహ్రీం ॥
(లోపాముద్ర)

సాది విద్య : స ఏ ఈలహ్రీం । స హక హలహ్రీం । సకల హ్రీం ॥
(నందికేశ్వరుడు)

మిగిలినవన్నీ కాదిహాది విద్యల వివిధ సంపుటీ భేదములే. శ్రీ విద్యా పంచ దశలోని మూడు కూటములు :-

(1) క ఏ ఈల హ్రీం ।
(2) హసక హలహ్రీం ।
(3) సకల హ్రీం ॥

ఆ మూడు కూటములు (1) అగ్ని, (2) సూర్యుడు, (3) చంద్రుడు ఈమూడు కూటములు త్రిపుర సుందరి శరీరము చంద్రుని 16 కళలు, సూర్యుని 24 కళలు, అగ్ని యొక్క 10 కళలు కలిసి మొత్తము 50. ఇవే మాతృకలు మొదటి కూటము వాగ్భవ కూటము, రెండవది కామరాజ కూటము, మూడవది శక్తికూటము

మంత్రము దేవత యొక్క సూక్షరూపము. శ్రీవిద్యా స్వరూపిణియగు పరమేశ్వరీ మూర్తి ఈ మంత్రము యొక్క మూడు కూటములు. శిరము నుండి కంఠము వరకు వాగ్భవకూటము. కంఠము నుండి నడుము వరకు కామరాజ కూటము. నడుము నుండి పాదాంతము వరకు శక్తి కూటము. అమ్మ లలితా రహస్య నామస్తోత్రములో త్రికూటగా వర్ణింపబడినది. ప్రతి మంత్రమునకు బీజ, శక్తి, కీలకములు తానే అగుటవలన త్రికూట అగును.

శ్రీ విద్యా పంచదశి ప్రతికూటము చివర హ్రీం ఉన్నది. హ్రీంను తాంత్రిక ప్రణవమందురు. వేద సంబంధమైన వాటిలో ''ఓం''కు ఎంత ప్రాధాన్యత ఉన్నదో తంత్ర సంబంధమైన వాటిలో హ్రీంకు అంత ప్రాధాన్యత ఉన్నది.

వాగ్భవకూటము విద్యాప్రదమైనది కామరాజ కూటము అర్థకామ భోగప్రదమైనది శక్తి కూటము మోక్షప్రదమైనది శ్రీచక్రము గూడ మూడు ఖండములు కలది శ్రీవిద్యా పంచదశి మూడు కూటములు, శ్రీచక్రము యొక్క మూడు కూటములు తాదాప్యములు.

శ్రీవిద్యా పంచదశిలోని బీజములను తొమ్మిది మాతృకలుగా చెప్పవచ్చును. అవి : ల, స, హ, ఈ, ఏ, ర, క, అ, అం - వీటిని మేరువులందరు శ్రీచక్రము మేరురూపములో గూడ ఉండును. అనగా శ్రీవిద్యా పంచదశి బీజముల సమిష్టిరూపమే శ్రీచక్రము. జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారి శ్రీయాగములో సృష్టిక్రమము, సంహారక్రమముల పూజా విధానము చూచిన ఇది అర్థమగును.

తంత్ర సంకేతములో - ల - భూమికి సంకేతము ఇది భూపురత్రయమును సూచించును. స - చంద్రునికి సంకేతము (షోడశకళలు). ఇది షోడశ దళ పద్మమును సూచించును. హ - శివుని సూచించును. (అష్టమూర్తి - శివుడు) అష్టదళపద్మమును సూచించును ఈ - మాయను సూచించును. పై ఏడు లోకములకును క్రింది ఏడు లోకములకును సామ్రాజ్ఞి భువనేశ్వరి. ఇది చతుర్దశారమును సూచించును. ఏ - విష్ణుశక్తిని సూచించును. అది దశావతార రూపములు. ఇది బహిర్దశరమును తెల్పును. ర - అగ్నిని సూచించును. అగ్నికి పది కళలు. ఇది అంతర్దశరమును సూచించును క - కాముడు అనగా సృష్టిని కావించిన ఈశ్వరుడ. ఆయన ఎనిమిది ప్రకృతులను కలిగి యుండును. (1) భూమి, (2) నీరు, (3) అగ్ని, (4) వాయువు, (5) ఆకాశము, (6) మనస్సు, (7) బుద్ధి, (8) అహంకారము. ఇది అష్టకోణమును తెల్పును అ- త్రికోణమును తెల్పును. త్రికోణము త్రిగుణములను తెల్పును అం - బిందువును తెల్పును. అది ఈశ్వర్యాత్మక బిందువు. ఆ విధముగా శ్రీచక్రము శ్రీవిద్యలోని ప్రాథమికాక్షరముల సమిష్టిరూపము.

గౌడపాదులు శ్రీవిద్యా పంచదశినే సౌభాగ్య విద్య అనినారు. సంప్రదాయములో బాలామంత్రము, బీజత్రయమును (ఐం క్లీం సౌః) పంచదశిలోని మూడు కూటముల ఆది యందు వరుసగా చేర్చగా వచ్చు మంత్రమే సౌభాగ్య విద్యా పంచదశిగా చెప్పబడుచున్నది.

**సౌభాగ్య విద్యాపంచదశి :-**

ఐం క ఏ ఈల హ్రీం । క్లీం హసక హలహ్రీం । సౌః సకల హ్రీం ॥

## శ్రీషోడశాక్షరీ విద్య :-

ఈ విద్యామంత్రము 16 బీజములు గలది యగుటచే షోడశాక్షరి అనబడుచున్నది. శ్రీవిద్యా పంచదశాక్షరీ మంత్రమునకు చివర శ్రీకారం చేర్చితే షోడశాక్షరీ మంత్రమవుతుంది అని అంటారు. పంచదశాక్షరీ మంత్రమునకు చివర ఈంకారము తో కూడిన మరొక షోడశాక్షరీ మంత్రము కలదు. దీనికి శ్రీవిద్య అనియే వ్యవహార నామము. కాని ఇది బ్రహ్మ విద్య కాదు. ఇది కేవలము 16 అక్షరములుగల మంత్రము మాత్రమే. ఇంతేకాక కూటములు లేకుండ 16 బీజములు గలిగి రామషోడశి అని మంత్రము కలదు.

**రామషోడశి :-**

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం ఐంక్లీం సౌః
సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

కాని బ్రహ్మవిద్యగా చెప్పవలసిన షోడశాక్షరీ 28 అక్షరములు గలది. ''అథ విద్యాహ్యష్ట వింశతి వర్ణ విశిష్టా'' అని గౌడపాదుల సూత్రము.

## శ్రీ విద్యాషోడ శాక్షరీ (28 అక్షరములు గలది)

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః । ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం ।
హసకహలహ్రీం । సకల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

దీనిలో షట్కూటములున్నవి. దీనిని 16 అక్షరముల మంత్రముగా రెండు విధముల చెప్పవచ్చును.

మొదటి పద్ధతి : దీనిలో 16 బీజములున్నవి. అవి - శ్రీం హ్రీం క్లీం ఐం సౌః
ఓం హ్రీం శ్రీం హ్రీం హ్రీం హ్రీం సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

రెండవ పద్ధతి . ఇందులో మొదటి 5 వర్ణాలు, చివరి 5 వర్ణాలు కవచకూటంగా చెబుతారు అప్పుడు మిగిలినవి 18 వర్ణాలు హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ అను శ్రుతి వాక్యాన్ని

అనుసరించి మిథున రూపంగా ఉన్నవాటిని ఏకాక్షరముగా భావిస్తే 16 అక్షరాల మంత్రమవుతుందనేది ఉపాసనా రహస్యము. ఓం హ్రీం శ్రీం - ఒక వర్ణమగును

లోకములో 28 అక్షరముల శ్రీవిద్యకు షోడశి అనియు, 16 అక్షరముల శ్రీవిద్యకు షోడశాక్షరి అనియు పిలుచు నాచారము గలదు

## బాలాత్రిపుర సున్దరి లేక బాల :

బాల మహాత్రిపురసున్దరి యొక్క దేవతా సంబంధమైన పుత్రిక అని అంటారు. బాల పరమేశ్వరి యొక్క సంకల్పమాత్రమున ఉద్భవించి 30 మంది భండ పుత్రులను సైన్యముతో గూడ సంహరించెను బాల పరమేశ్వరీ స్వరూపురాలు. ఆమె పూజోపాసనలు సకలాభీష్టప్రదములు బాలాత్రిపురసున్దరియే చండీ స్వరూపురాలనియు తెలియుచున్నది

బాలామంత్రము త్ర్యక్షరీగా గాని లేదా కేవలం పంచదశిగాని, తురీయాశ్రయేతరులకు ఉపాస్యాయోగ్యములు కావని పెద్దలంటారు. అందువలననే తురీయాశ్ర యేతరులు సౌభాగ్యవిద్యనే ఉపాసన చేయాలి

బాలామంత్రము ఐం క్లీం సౌః అను మూడు బీజములు గలది. అయినను బాలా మంత్రమును అనులోమ విలోమములుగా ఉపాసన చేయుట శిష్టాచారము

**బాల :-** ఐం క్లీం సౌః । సౌః క్లీం ఐం ॥

ఐం క్లీం సౌః - అహం బ్రహ్మాస్మి - నేను బ్రహ్మ స్వరూపమును.

సౌః క్లీం ఐం - బ్రహ్మైవాహమస్మి - బ్రహ్మమే నేను అయితిని అని సమిష్టి మంత్ర తాత్పర్యమని చెబుతారు.

లోకములో ప్రచారములోనున్న నమ్మక మేమనగా ముందు గురువు సాధకునికి బాలా త్రిపురసున్దరీ మంత్రము ఉపదేశించాలి. సాధకుడు బాలా మహామంత్రమును అధమపక్షము 4 లక్షలు జపము చేసిన తరువాత పంచ దశాక్షరీ మంత్రమును ఉపదేశించాలి. పంచ దశాక్షరీ మంత్రము 15 లక్షలు చేసిన తరువాత షోడశాక్షరీ ఉపదేశించాలి. అప్పుడు సాధకుడు పూర్ణదీక్షాపరుడు అగును.

గురువు లేకుండా పుస్తకము చూసి, కలలో భగవంతుడు కనబడి నాకు ఈ మంత్రము చెప్పాడని - ఆ మంత్రములను ఉపాసన చేయరాదు దాని వలన ఏమీ ఉపయోగముండదు మంత్రము తెలిసిన ప్రతివాడు గురువు కాలేడు గురువుకు కొన్ని లక్షణములున్నవి. అట్టివాని దగ్గరే శిష్యునిగా చేరాలి ఈ క్రింది శ్లోకము అందరికి తెలిసినదే

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।
గురు స్సాక్షాత్పర బ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥

శివునికి కోపము వస్తే గురువు రక్షిస్తాడు కాని గురువుకు కోపం వస్తే ఎవరూ రక్షించలేరు. ''గు'' అంటే మనస్సును ఆవరించియున్న అజ్ఞానమనే చీకటి అని అర్థము. ''రు'' అంటే అట్టి అజ్ఞాన అంధకారమును పోగొట్టువాడని అర్థము.

గురువు యొక్క లక్షణములు ''బ్రహ్మకల''లో ఈ విధంగా చెప్పబడియున్నది.

తత్ర గురుః శ్రోత్రియో బ్రహ్మ నిష్ఠః శాన్తోదాన్తః ।
కులీనః శుద్ధాచార స్సుప్రసిద్ధ శ్శుచిర్దక్షో ।
మంత్ర తంత్ర విచక్షణో విప్ర ఆశ్రమీ ధ్యాననిష్ఠోవా ॥ (బహ్మకల - 9-20)

గురువు శ్రోత్రియుడై బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడై శాన్తాది గుణ సంపన్నుడై ఉండవలెను అతడు ధ్యాననిష్ఠగల విప్రుడుగాని, విప్ర సన్యాసిగాని అయి వుండవలెను. మంత్ర తంత్రముల మర్మములను ప్రయోగములను తెలిసిన వాడై యుండవలెను. గురువునకు పాండిత్య మొక్కటే చాలదు సాంప్రదాయ పద్ధతులు కూలంకుషంగా తెలిసినవాడై యుండవలెను. శిష్యుడు అడిగినను అడగకున్నను విద్యలో వచ్చు ప్రశ్నలను తానే చెప్పి సశాస్త్రీయమైన సమాధానములు చెప్పగల వాడే గురువు అగుటకు తగినవాడు.

దైవము మంత్రాధీనము, తన్మంత్రము గుర్వధీనము మంత్రపాలిత చిత్తుడగు గురువును సేవించి దీక్షితుడైనవాడే మంత్ర, తదధిదైవములను ఆత్మ భూతములుగా నొనర్చు కొనగలడు.

భారతదేశములో గురువు సర్వోత్తముడుగా నెన్నబడుచున్నాడు ఇతర దేశములలో గురు శిష్య సంబంధము అర్థార్థి సంబంధము మాత్రమే. మన దేశమున

అట్లుగాక, గురుశిష్యులది పవిత్రమగు యావజ్జీవ సంబంధము. భారతీయుడు గురువు నుండి ప్రధానముగా రెండు విద్యలను తెలిసికొనవలెను. అవి పరా- అపరా విద్యలు. వాటి స్వరూపమును శ్రుతి ఇట్లు చెప్పుచున్నది

''ద్వేవిద్యే వేదితవే పరాచ అపరాచ, తత్ర అపరా -
ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వ వేదః ;
శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం చందో జ్యోతిషమితి ;
అథపరా - య యాత దక్షరమధిగమ్యతే ( ముండకోపనిషత్ )

ఏ విద్యచే అక్షరమగు బ్రహ్మమును తెలిసికొని ముక్తుడగునో అయ్యది పరావిద్య.

ఎంతటి వానికైనను గురువు అవశ్యము ఉండవలెననియును, ఆ గురువు ద్వారానే విద్యను సంపాదించి తరింపవలయుననియు వేదము - '' ఆచార్యవాన్ పురుషో వేద'' - గురువుగల వానికే తరించు మార్గము తెలియును.

''ఆచార్యస్తుతే గతింవిక్తా'' - నీకు మార్గమును చూపువాడు గురువు మాత్రమే అనియు స్మృతులు చెప్పుచున్నవి.

తద్విద్ధిప్రణి పాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥ ( భ.గీ. **4-34**)

బ్రహ్మమును దర్శించిన జ్ఞానుల కడకు పోయి నమస్కరించి వారలను సేవించి నీవు వలసిన విద్యను అడిగినచో వారలు నీకు జ్ఞానమును ఉపదేశింతురు.

కావున పురుషుడు అభ్యుదయమును ముక్తిని (నిశ్రేయసము) పొందుటకు గురువు అత్యంతావశ్యకము.

శ్రీ విద్య నేటికిని శ్రీ శృంగేరి శ్రీ విరూపాక్ష శ్రీపీఠముననే సంప్రదాయ సిద్ధముగ విరాజిల్లుచున్నది ఈ పీఠము ఇప్పుడు గుంటూరు అరండల్‌పేట **4**వలైను 2వ అడ్డరోడ్డులో ఉన్నది శ్రీ శృంగేరి శ్రీ విరూపాక్షమున శ్రీ పీఠము వారు తూర్పు తీరమునకు వచ్చి గుంటూరులో స్థిరపడినపుడు శ్రీ జగద్గురువులు శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు తమ మఠమునకు శ్రీ సదనమని పేరు పెట్టిరి దాని ప్రస్తుత పీఠాధిపతులు శ్రీ జగద్గురు శ్రీ శివ కల్యాణానంద భారతీస్వామి వారు.



# అనుబంధము - 8

## వామాచారము

భారతభూమియందు వైదికమతమునకు శత్రువుగా ఘోరములగు ఆచారములు కలిగిన వామపర్యాయియగు శాక్తేయమను ఒక ఉపాసనా పద్ధతి అప్పుడప్పుడు ప్రబలుచుండును దానిని వైదిక మార్గ ప్రవర్తకులగు శ్రీకృష్ణ ద్వైపాయన, శ్రీ విద్యా శంకర, శ్రీ కల్యాణానంద భగవత్పాదాది మహనీయులు అన్ని విధముల వారించి వైదిక ధర్మమును స్థాపించుటయు జరుగుచునే యున్నది ఇట్టి వైదిక ధర్మ విరుద్ధములగు వామాద్యాచారములను పూర్వము జాతి వర్ణకుల గోత్రహీనులును, అజ్ఞాత కులగోత్రులును, ప్రారబ్ధ వశమున అర్థకామాశచే కులభ్రష్టులై చండాల మ్లేచ్ఛాది జాతులందు ప్రవేశించిన పాండిత్య విశేషముతో నొప్పువారలును లేవదీసి వైదిక ధర్మమునకు ప్రతి ద్వంద్విగా ప్రచారము చేయ మొదలిడిరి వీరి దుశ్చేష్టలకు సహింపక శిష్ట వైదిక ధర్మ ప్రవర్తకులు వారలను చాతుర్వర్ణ్యము నుండి బహిష్కరించుచు అపహసించుచుండిరి దానికి ఈ భ్రష్టులగు విద్వాంసులు ఈర్ష్య చెంది తమ భ్రష్ట స్థితియే పరమ పురుషార్థ సాధనమనియు, చాతుర్వర్ణ్యముతో నొప్పు వైదికాచారము పురుషార్థమును సాధింప జాలదనియు బోధించు తంత్ర గ్రంథములను గొన్నింటిని చిత్రించి సత్క్రమంబగు వైదిక మార్గమునకు భ్రంశమును కలుగ చేయుటకై ఆ తంత్ర గ్రంథములకు వైదికత్వానులేపనము చేయ మొదలిడిరి. కాలక్రమమున అర్థకామాసక్తులగు ద్విజులు సైతము ఈ తంత్ర గ్రంథములను ప్రమాణముగా స్వీకరించి వైదికమత విరుద్ధములగు కొన్ని మతములను ప్రచారము చేయ మొదలిడిరి. ఈ గ్రంథముల అవలంబనమునే భారత భూమియందు నేడు అసంఖ్యాకములగు అవైదిక మతములు ప్రబలుటయు, పై తాంత్రికాచారములు ద్విజులయందు చెలరేగుటయు గల్గినది. అంతేకాక విక్రమార్క శకారంభమున భారతభూమియందు అనులోమ విలోమ జాతులవారు విరళ సంఖ్యాకులుగా నుండిరి. అట్టి వారలలో విద్యాబుద్ధులు గల కొందరు అర్థకామాశ వలన పై తాంత్రికోపాసనను బోధించు పుస్తకముల కొన్నింటిని విరచించి బహుళ ప్రచారము చేయ మొదలిడిరి వీరి ప్రచారముచే ఆ ఉపాసకులందరు పంచ విధములుగా విడిపో జొచ్చిరి. ఇట్టి విభాగమునందు ఉపాసకులు తమ తమ కభీష్టములగు గుణముల నాధారముగా చేసి కొని

తత్త ద్విశిష్టమగు దేవతల నుపాసించుటయేగాని వేరొండుగాదు. అందు శాక్తులను వారలు శక్తియే తమ కుపాస్యదేవత యని తలంచువారలు. వీరలచే ఉపాసింపబడు శక్తి విశేషభేదముచే వీరలు మరల పది విధములుగా విభజింపబడుచున్నారు. ఆశక్తి విశేషము చేతనే వీరలు జపించు మంత్రము అనుసరించు ఉపాసనా పద్ధతి గూడ పరస్పరము భేదించు చుండును. అట్టి శక్తి భేదములు ''కాళీ, తారా, త్రిపురసున్దరీ, భువనేశ్వరీ, ఛిన్నమస్తా, త్రిపురభైరవీ, ధూమావతీ, బగళాముఖీ, మాతంగీ, కమలాత్మికా'' అనునవి. వీనికి ప్రత్యేకముగా పది విధములగు తంత్ర గ్రంథములు వెలువడినవి. ఈ గ్రంథములను అనుసరించి ఉపాసన గావించు వారలే శాక్తేయులనియు, వామాచారులనియు బ్రసిద్ధి నేటికిని గాంచుచున్నారు.

ఈ శాక్తేయులు క్రీ. శ. పదియవ శతాబ్దము వరకు తమ కభీష్టమగు శక్తిరూపమును ఉపాసించుట తప్ప వేరొక తత్త్వాన్వేషణమును గూర్చి ఎట్టి ప్రయత్నమును ఎవ్వరు చేసి యుండలేదు. ఈ భిన్నశక్త్యుపాసననే యవ్వారలు ''దశ మహావిద్యలు'' అని ప్రచారమును చేసిరి. వీనియందు గూడ కాళి ఉపాసన అగ్రస్థానము అలంకరించి యుండెను.

క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది యందు కాశ్మీర దేశమున వసుగుప్తుడు, సోమానందుడను ఇద్దరు శాక్తేయులు తమ శాక్తేయమునకు ఒక అపూర్వ తత్త్వమును ప్రదర్శింపనెంచి, ''శివసూత్రము'', '''శివదృష్టి'' అను రెండు గ్రంథములను రచించిరి. ఆ పుస్తకములలో వారు ''త్రిక సిద్ధాంతము, త్రిక శాస్త్రము, త్రిక రహస్యము'' అను పేర్లతో తమ కభీష్ట దైవము పరమ శివుడనియు, అట్టి పర శివ స్వరూపము జీవేశ్వర శక్తిత్రయ సమిష్టి రూపమనియు, అద్దాని పరిణామమే తమ కుపాస్యదేవతయగు శక్తి అనియు, అయ్యదియే కాళీభైరవియని వ్యవహరించబడుచున్నదనియు, ఒక లోక వ్యామోహకరమగు ప్రణాళికను తయారుచేసి ప్రచారము చేయ నారంభించిరి ఇది అభినవ గుప్తాదుల ఆలంబనమున పెరిగినది. తుదకు వైదిక ప్రవర్తకాచార్యుల ప్రచారముచే ఇయ్యది శ్రుతి స్మృతి విరుద్ధము, శిష్ట గర్హితమును అని లోకమునకు వెల్లడియై తుదకు కొద్ది కాలములోనే అడుగంటి పోయెను.

భాస్కర రాయడను కౌళికాగ్రగణ్యుడు త్రిక సిద్ధాంతమును చొప్పించి లలితా రహస్య నామమునకు సౌభాగ్య భాస్కరమను ఒక వ్యాఖ్యానము రచించెను. ఇతడు త్రిక

సిద్ధాంతమందలి పరశివుడే కౌలికులకు నభీష్ట దైవముగాను, అట్టి పరశివుని భట్టారికయగు లలిత కౌళికులకు ఉపాస్యదేవతగాను ఒక అపూర్వ పథమును లేవదీసి ''వరివస్యా రహస్యము'', ''సేతు బంధ'' మను గ్రంథములను రచించెను. ఈ గ్రంథములందు కాశ్మీరత్రిక సిద్ధాంతమునే పరమ సిద్ధాంతముగా నిరూపించుటయే గాక అందలి మకార పంచకసేవనమే [(1) మత్స్యము (2) మద్యము, (3) మాంసము (4) ముద్ర (పక్షి మాంసము (5) మైథునము)] పరతత్త్వ నిష్ఠ యని గూడ ప్రతిపాదించెను.

---

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు ఒకచోట భాస్కర రాయని గూర్చి ఈ విధంగా వ్రాశారు. సౌభాగ్య భాస్కర నామ భాష్యమున భాస్కర రాయలు వైదికమైన ఉపాసనా మార్గమును ప్రస్తుతించి నప్పటికీ - ఆయన రచించిన వరివస్యా రహస్యమును, సేతుబంధనము మొదలగు గ్రంథములను పరిశీలింపగా - భాస్కర రాయలకు తాంత్రిక పక్షపాతమున్నదని స్పష్టమగుచున్నది. ఆ గ్రంథములు చూచి మరల నీ సౌభాగ్య భాస్కరమును చూడగా - ఆయన వైఖరిలో కొంత వైదికేతర మార్గాభిమానము ధ్వనించుచున్నది.

స్వామి ప్రణవానంద తమ ''A Treatise on Sri Chakra''లో ఒకచోట భాస్కర రాయని గూర్చి ఈవిధంగా పేర్కొన్నారు : Bhaskara Raya was a follower of Vamamarga out and out and claimed himself to be Kaulachara-paravara. He was staunch advocate of Pancha-makaras. Madya (wine), Mamasa (meat), Matsya (fish), Mudra (Posture) and Maithunam (sexual intercourse with women) and use of yoni (female organ) in the worship of Devi as a must..... .......orthodox Samaya carins would not accept Bhaskara Ray's findings and views which are against the tenets of Samayachara, like the worship of yoni and use of pancharmakara's etc.

భాస్కరరాయని శిష్యుడగు పండితరాయలు ఇట్టి ఆచారమునే అనుసరించి ''నిత్యోత్సవ'' మను నిబంధనము రచించి కౌలాచారమును బ్రాహ్మణుల యందు ప్రవేశపెట్టి తనకు కల్గిన భ్రంశమును నసంఖ్యాకులగు ద్విజులకు సైతము సంక్రమింపచేసి అనంతమగు వైదిక ధర్మద్రోహమును గావించినాడు. గురు శిష్యులిద్దరును '' ఆనందో బ్రహ్మణో రూప తచ్చదేహే వ్యవస్థితం, తస్యాభివ్యంజకాః పంచమకారాః '' అని బ్రహ్మానందమును మపంచకసేవచే కల్గెడి యున్మాదముగా వర్ణించి అభీష్ట దైవము పరశివుడనియు, అట్టి పరశివుడు జీవేశ్వరశక్తి సమిష్టి రూపమగు త్రికమనియు చిద చిద్విశిష్టమనియు, అట్టి పరశివుని పరిణామ విశేషమే లోకమునందలి స్త్రీ పుం నపుంసక వ్యక్తులనియు నిరూపించిరి. కావుననే స్త్రీలందరును శివారూపులనియు, పురుషులందరు శివ రూపులనియు చెప్పుచు వీరలు స్త్రీ పురుష షండ భేదముగాని, జాతి మత భేదముగాని, వర్ణాశ్రమ భేదముగాని లేకుండా దీక్షయను పేర మపంచకసేవను గావించి స్వేచ్ఛాతో విహరించవచ్చునని తమ గ్రంథములందు నిరూపించి శాశ్వతమగు ధర్మ ద్రోహమును గావించిరి. వీరి దృష్టిలో కౌళిక దీక్ష నొందిన చండాలుని కంటె చతుర్వేద పారంగతుడై స్వవర్ణాశ్రమాచారయుక్తుడగు విప్ర పుంగవుడు తుచ్ఛుడు. ఇట్టి నీచమగు ద్రోహము బయట పడకుండుటకు వీరలు తమ గ్రంథములలో ''ప్రాకట్యాన్నిర్ణయః'' అను సూత్రము శిష్యులకు బోధించిరి.

ఇట్లు వైదిక ధర్మద్రోహులగు అర్థకామగ్రస్తులచే వైదిక ధర్మ విఘాతము కొరకు లేవదీయబడిన ఈ వామాచారము కాశ్మీరమున త్రికమను పేర కొంతకాలము అభివృద్ధి నొంది వైదిక ధర్మ ప్రవర్తకాచార్యుల సద్బోధనముల వలన రూపుమాసి అవైదికములగు మతములకు నిదానమయి మారుపేర బరగుచు భాస్కర పండితరాయాదుల నాలంబనము చేసికొని వారల కృత్రిమ ప్రచారముచే వైదికత్వానులేపనము నొంది క్రమముగా లో లోపలనే ద్విజులయందు సక్రమించి వైదిక ధర్మమును సంకరముగా నొనర్చ ప్రారంభించెను.

భాస్కరరాయ విరచితమైన పరశురామ సూత్రము తద్వ్యాఖ్యయగు నిత్యోత్సవము వామాచార సంప్రదాయస్థులకు పరమ ప్రమాణ గ్రంథములు. శ్రీవిద్యోపాసకులు కొందరు సాంప్రదాయ వామాచారమును వదలలేక మపంచకసేవ హేయమని తెలిసి వాటి స్థానే ప్రత్యామ్నాయములను ఏర్పాటు చేసుకొన్నారు.

ఉదాహరణకు మాంసమునకు అల్లము, మద్యము బదులు రాగి పాత్రలో పాలు, సువాసిని పూజ భార్యకు చేయుట మొదలగునవి.

# కౌలమతము

వామాచారము, భైరవ ఋషి, భైరవీ భైరవులధి దేవతలు, శివతత్త్వము శక్తితత్త్వమందు అంతార్భావము, శక్తితత్త్వ ప్రధానము అంతర్యాగమందు మూలాధార స్వాధిష్ఠానకమలములయందు పూజా, ఆత్మలయాది కలాపము, కుండలినీ ఉపాసన, కుండలినీ ప్రబోధాధికము, బాహ్య చక్రార్చనలో వామహస్తముతో తర్పణాది కలాపము, పరశురామ సూత్ర ప్రకారము సురామాంసాదులతో పూజా కలాపము నీ సంకేతములు గలది వామాచార ప్రధానమయిన కౌలమతమని ఋషు లేర్పరచిరి.

కులమనగా ఆధార చక్రము. ఈ మూలాధారమును పూజించువారు కౌళులు. వీరు మూలాధారమునకు పైన ఉన్న స్వాధిష్ఠానమును గూడ పూజింతురు. ఈ రెండు చక్రములనే పూజింపవలెనందురు కౌళులు. పూర్వ కౌళులు శ్రీచక్ర మందలి నవయోని మధ్యవర్తియగు యోనిని పూజింతురు. ప్రత్యక్షయోనిని పూజించువారు ఉత్తర కౌళులు. వీరిరువురు పూజించు యోని బాహ్యము కనుక ఆధార చక్రమునే పూజింతురు. ఇచట గల కుండలినీ శక్తిని కౌలినీ అందురు. త్రికోణమందలి బిందురూపముగల ఈ కుండలినీ శక్తిని నిద్రాణముగా నున్నపుడే పూజింపవలెనని వీరి భావము. కుండలిని ప్రబోధమైన క్షణమందే వీరికి ముక్తి.

మకార పంచకముతో పూజించువారు వామాచారులు. ప్రత్యక్ష త్రికోణమున బిందు స్థానమును మన్మథ ఛత్రము గావించి వీరు పూజింతురు. ఈ త్రికోణము అధోముఖ మగుటచే మన్మథ ఛత్రమును అధోముఖముగనే పూజింతురు.

కౌలవామాచారములు అవైదిక మార్గమును అవలంభించిన వగుటచే వీటిని వదలివేయవలెను. అవి స్మరించుటకు గూడ తగనివి.

# శ్రీచక్రార్చన

శ్రీ చక్రార్చన పలు సంప్రదాయాలలో రకరకాలుగా ఆచరణలో ఉన్నది శ్రీ చక్రార్చన బోధించు తంత్రములు గూడ వేరు వేరుగా నున్నందున సాధకులు బహురీతుల అర్చనాక్రమం పాటిస్తున్నారు

శ్రీవిద్యా సంప్రదాయములో చాల మంది రహస్యము అంటూ తాము చేసేది రెండవ వారికి చెప్పరు అందువలన ఇద్దరు సంప్రదాయస్థులు ఒకే రకంగా అర్చనా క్రమం పాటింపకున్నారు. దేశంలో శ్రీచక్రార్చనా పద్ధతి కేవలం వామాచార పద్ధతిలోనే ప్రచారంలో ఉండేది. కాని తెలియక అట్టి వారు తమది దక్షిణాచారమనియే చెప్పుకొంటారు. దక్షిణాచారము పేర వామాచార తంత్రాన్నే ఎక్కువమంది సాధకులు ఆచరిస్తున్నారు. అది కేవలం దక్షిణాచార వామార మార్గముల భేదము తెలియకనే అని అనుకొనవచ్చును. ఎవరి మార్గం వారికి గొప్ప.

లోకంలో శ్రీచక్రార్చన భూపురము ప్రథమ ఆవరణగా ప్రారంభించి బిందు మండలము నవావరణగా సంహారాక్రమంలో చేస్తున్నారు. ఆవరణ అంటే తెర. భూపురము నుండి ఒక్కొక్క తెరను భేదించుకొనుచు చివరకు బ్రహ్మమును పొందుటకు అంటే మోక్షమును కోరువారు ఇట్లా అర్చన చేస్తారు. ఇది దక్షిణాచారము. ప్రాపంచిక సుఖమును కోరువారు సృష్టి క్రమంలో పూజిస్తారని లోక ప్రసిద్ధి. అంటే బిందువు నుండి భూపురము వరకు.

జగద్గురు శ్రీ శ్రీ కల్యాణానంద భారతీ స్వామివారు శ్రీ చక్రార్చన సృష్టిక్రమము, సంహార క్రమములలో చేయాలని నిర్ధారించిరి.

తస్యార్చనం తు సృష్టి సంహార క్రమాభ్యామ్ ॥ (బ్రహ్మకల : సూ.70)

మొదట ప్రాణ ప్రతిష్ట చేసి తరువాత పూజ చేయుట విధి విధాయకము. ప్రాణ ప్రతిష్ఠ తరువాత బిందువు నుండి వరుసగా భూపురత్రయ ఆవరణ వరకు ఆయా దేవతలను ప్రకల్పనం చేయుటే సృష్టిక్రమము. ఇది శ్రీచక్ర ప్రతిష్ఠాగమంలో ఉన్నదే. మరల భూపుర ఆవరణ నుండి బింద్వావరణ వరకు పూజ చేయుట సంహార క్రమార్చన. ఇట్లు సృష్టికల్పనతో కూడిన సంహార క్రమార్చనయే పూర్ణోపాసన. శ్రీయాగసూత్రమందు ఈ సృష్టి సంహార క్రమములతో శ్రీ చక్రార్చనా విధానమును జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ స్వామి వారు వ్యవస్థీకరించి యున్నారు. ప్రస్తుతము చాలమంది ఈ పద్ధతినే అనుసరించుచున్నారు.

సా చాదౌ శ్రీ భారత్యా సంప్రోక్తాచాథ శ్రీకృష్ణాభ్యాం ।
సమ్యగుపదిష్టా శ్రీవిద్యాశంకరేణ సంస్థాపితా ।

శ్రీ విద్యారణ్యేన సంరక్షితా మాయాచార్య
శ్రీ కల్యాణానందేన సంప్రదర్శితా బ్రహ్మకలైవ నా న్యేతి విజ్ఞాయతే ॥
(బ్రహ్మకల - 9 - 64)

శ్రీకృష్ణ పరమాత్మచే గీతయందు ఉపదేశింపబడిన సత్సంప్రదాయము కృష్ణద్వైపాయునిచే ప్రకటింపబడి ఆది శంకరులచే ప్రతిపాదింపబడి విద్యారణ్యునిచే సంరక్షింపబడినది. ఆ సత్సంప్రదాయమును శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పద వాక్యప్రమాణ పారావారపారీణ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠా గరిష్ఠ తపశ్చక్రవర్త్య నాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సంప్రదాయక షడ్దర్శన స్థాపనా చార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల వేదార్థ ప్రకాశక, సాంఖ్యాత్రయీ ప్రతిపాదక సకల నిగమాగమ సారహృదయ వైదిక మార్గ ప్రవర్తక సర్వ తంత్ర స్వతంత్ర విద్యానగరాది మహారాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాప నాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగపురవరాధీశ్వర శ్రీవిరూపాక్షాధీశ్వర శ్రీమదాచార్యాన్వయ పరివృఢ శ్రీమద్రాజాధిరాజ మహారాజగురు భూమండలాద్యన్వర్థ సకలబిరదావళీ విరాజమాన శ్రీ విద్యా శంకర పదమావేశ ప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య స్వామి వారిచే 'బ్రహ్మకల' అనుసూత్ర గ్రంథము ద్వారా సిద్ధాంతీకరింపబడి ప్రకటితమైనది.



# అనుబంధము - 9

# శ్రీవిద్యా సంప్రదాయములు

మనకు తెలిసిన 108 ఉపనిషత్తులలో 8 శక్తి ఉపనిషత్తులు. అవి : (1) త్రిపుర, (2) త్రిపుర తాపిని, (3) దేవి, (4) బహ్వృక, (5) భీమ, (6) సరస్వతీ హృదయ, (7) సీతా, (8) సౌభాగ్య లక్ష్మి. ఇవి కాక ఇంక కొన్ని దేవీ ఉపనిషత్తులున్నవి.

ఋగ్వేదములో వాగాంభ్రిని సూక్తము, పృధ్వీ సూక్తము, భూ సూక్తము, దుర్గా సూక్తము, శ్రీ సూక్తము మొదలగు సూక్తము లున్నవి. వీనిలో బ్రహ్మము స్త్రీలింగములో చెప్పబడుటచే సామాన్యులు వాటిని దేవీసూక్తములని పిలువ మొదలిడిరి. రససిద్ధులు (Alchemists) కొందరు రససిద్ధి శ్రీచక్రముల రహస్యము శ్రీసూక్తములో నున్నదని నమ్మెదురు. మరి కొందరు శ్రీసూక్త రహస్యము శ్రీచక్రములో ఉన్నదందురు.

శ్రీచక్ర పూజా విధానంలోగాని, శ్రీ విద్యా ఉపాసనలోగాని అనేక సంప్రదాయములు ఉన్నవి. వానిలో (1) హయగ్రీవుడు, (2) ఆనంధభైరవుడు, (3) దక్షిణామూర్తి చెప్పినవి మూడు ముఖ్యమైన పద్ధతులు. ఇవి అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత పద్ధతులకు సంబంధించినవి. హయగ్రీవుని పద్ధతిలో శ్రీచక్రములో వృత్తత్రయము ఉండదు. అంటే షోడశదళము తరువాత మూడు వృత్తములు ఉండవు. అవి చతుర్దశరము, అష్టదళము, షోడశ దళముల తరువాత ఉన్న వృత్తములే. (2) ఆనంద భైరవుని పద్ధతిలో శ్రీచక్రములో వృత్తత్రయము ఉండును కాని వాటికి పూజలేదు. (3) దక్షిణామూర్తి పద్ధతిలో శ్రీచక్రములో వృత్తత్రయము ఉండును. వాటికి పూజ కూడ వుండును.

శ్రీ విద్యలోని కాది, హాది, నందికేశ్వర సంప్రదాయములను గూర్చి ఇదివరకే చెప్పుకొన్నాము. వీటన్నిటికీ శ్రీచక్రము కొన్ని మార్పులతో సామాన్యము.

శ్రీవిద్యా సంప్రదాయి పూజా విధానముల మీద అనేక పుస్తకము లున్నవి. వాటిని జాగ్రత్తగ పరిశీలించిన కొన్నిటి గ్రంథకర్తలు సాధకునికి ఆకర్షణవంతముగను, మనస్సును ఆకట్టుకొనునవిగాను ఉండు ఇతర సంప్రదాయ పూజా పద్ధతులలోని కొన్ని భాగములను తమకు నచ్చిన వాటిని తమ పుస్తకములలో చేర్చినట్లు తోచును. వారు తాము వ్రాసిన పూజా పద్ధతులు, ఆచార వ్యవహారములు శివుడే స్వయంగా పార్వతికి చెప్పాడని, వాటిని తు.చ. తప్పక అనుసరించాలని నిర్దేశించారు. సామాన్య సాధకులు తమ సంప్రదాయములోనే వేరువేరు విధములుగ ఉండుటచే ఏది అనుసరించాలనే సందిగ్ధములో పడుతారు. అంతేకాక తాము చెప్పిన ప్రకారము పూజాదికములు జరుపని యెడల ఏదో కీడు జరుగునని చెప్పు పుస్తకములు గూడ ఉన్నవి. అందువలన కొందరు శ్రీవిద్యను స్వీకరించుటకు భయపడుదురు శివుడే స్వయంగా ఈ పూజా విధానము చెప్పాడనుట సమంజసము కాదు. కాని కొన్ని విధి విధానములను తప్పనిసరిగా పాటించాలి. అంటే సాధకులకు చిన్న మార్పులకు గూడ స్వేచ్ఛలేదని అర్థము కాదు. గాఢ భక్తిగల సాధకుడు తెలిసియో తెలియకో పూజాది విధానములో స్వల్ప మార్పులు చేసిన వానికి ఏదో ప్రమాదమో, దుఃఖమో, నష్టమో మొదలగునవి సంభవించునని తలంచుట కేవలము మూఢత్వము. శ్రీవిద్యోపాసన మొదలుపెట్టి ఆపివైచిన లేక పూజలోనో లేక లలితా రహస్య నామస్తోత్ర పారాయణ చేయుటలోనో పొరపాటున ఉచ్చారణ దోషములు దొర్లిన ఏదో అనర్థము జరుగునని సామాన్యులను భయపెట్టి వారిని శ్రీవిద్యకు దూరముగా ఉంచి తాము ఏదో గొప్ప సాధకులైనట్లు నటించు డంబాచారులు గూడ గలరు త్రిపురసుందరి అమ్మ ఎంత దయామయియో శ్రీదేవీ భాగవతములోని సత్యవ్రతుని కథ, సుదర్శుని కథల వలన మనకు తెలియును.

పసిపిల్లలు తప్పుచేసిన, మాటను తప్పుగా ఉచ్చరించిన తల్లిదండ్రులు వారికి సరైన పద్ధతి చెప్పి, వారిలో వారు, బంధువులకు ఆ తప్పులను చెప్పి ఆనందింతురు. అంతేకాని వారిని శిక్షించరు. ఇది లోకంలో పద్ధతి. మరి లోకమాతా శ్రీమాతకు మన మందరము పసి పసి పిల్లలము. ఎందుకని అంటే ఎంతో మంది త్రిమూర్తులున్నారని, అట్లే ఇంద్రాది దేవతలున్నారని, వారు అమ్మ వద్దకు వెళ్ళినట్లు శ్రీదేవీ భాగవతము చెప్పుచున్నది. మరి అటువంటప్పుడు శివా-శివులు, విశ్వమాతాపితలు సాధకులకు అనర్థము కలిగిస్తారంటే వారిని కించపరచడమే కాని వేరు కాదు. దీనికి వారికి అప్రసన్నత డంబాచారులపై కలగాలి గాని, తెలియక ఉచ్చారణ దోషము చేసిన వారిపై కాదు. కాని

అమ్మకు వారి మీద గూడ అప్రసన్నత కలుగదు. వారికి వారి దోషము తెలిసేటట్లు చేస్తుంది. భగవద్గీతలోని ఈక్రింది శ్లోకములను చూస్తే ఇది కొంతవరకు మనకు అర్థమగును.

పార్థ ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత । గచ్ఛతి ॥
(భ. గీ. 6-40)

ఓ అర్జునా ! యోగభ్రష్టునకు ఇహమునందు గాని పరమునందు గాని నాశము లేదు. మంచి కార్యములు చేయువాడు ఎవడును దుర్గతిని పొందడు అని శ్రీకృష్ణ పరమాత్మ అభయమిచ్చినాడు.

నే హ భిక్రమనాశో ౽ స్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥
(భ. గీ. 2-40 )

ఈ మోక్ష మార్గమగు కర్మయోగమును మొదలు పెట్టుటకు కాల పరిమితి లేదు. ప్రారంభించిన తరువాత ఏ కారణము చేతనైన విడచుట వలన దోషము లేదు. ఈ ధర్మము స్వల్పమైనను మహత్తరమైన సంసార భయము నుండి కాపాడును

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ । ప్రతి జానీ హి నమే భక్తః ప్రణశ్యతి ॥
(భ. గీ. 9 -31)

నన్ను ఆశ్రయించిన వాడు శీఘ్రముగా ధర్మబుద్ధి గలవాడగుచున్నాడు; శాశ్వతమైన శాంతిని బొందుచున్నాడు. అర్జునా ! నా భక్తుడు చెడడు.

భవిష్యోత్తర పురాణములోను, లలితారహస్యనామ స్తోత్రములోను శ్రీచక్ర పూజను గూర్చి ఈ క్రింది విధంగా ఉన్నది.

హసకలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం ।
పూజనీయా జనైర్దేవీ స్థానే స్థానే పురే పురే ।
గృహే గృహే శక్తి పరైః గ్రామే గ్రామే వనేవనే ఇతి ॥

ప్రతి దేశములోను, పురములోను, గృహంలోను, వనంలోను అందరిచేత శ్రీదేవి పూజింపబడాలి.

ఆబాల గోప విదితా సర్వా నుల్లంఘ్యశాసనా ।
శ్రీ చక్రరాజనిలయా శ్రీమత్త్రిపుర సుందరీ ॥
(ల.ర.స్తో. 182 శ్లోకం)

దీనికి శ్రీ శ్రీ నృసింహానందభారతి స్వామివారు వారి శ్రీ లలితా రహస్యనామ స్తోత్ర ప్రబంధములో ఈక్రింది విధంగా చెప్పారు :

తే ॥ బాలురకు నెల్ల, నెల్ల గోపాలురకును
నెల్ల వారికి నెవ్వేళ నెల్ల యెడల
న ప్రయత్నంబుగా దెలియంగవచ్చు
నమ్మ జగముల యమ్మ మాయమ్మ దలతు.

శ్రీ కల్యాణానంద భారతీ స్వామివారు శ్రీకలలో ఇట్లా చెప్పారు : ఆబాల గోప = పిల్లలు మొదలు గొల్ల వారి వరకును గూడ ననగా బ్రహ్మ మొదలుగా మనుష్యుల వరకుగల సకల ప్రాణులకును విదిత = తెలియబడునది. అమాయకపు పసిపిల్లవాని నుండి ఏమీ తెలియని గోవుల కాపరి వరకు అమ్మ తెలియబడునది, పొందబడునది.

ఇక్కడ శ్రీచక్రమును గూర్చి ఒక విషయము ప్రత్యేకముగా చెప్పుకోవాలి. యంత్రము లన్నిటిలో శ్రీచక్రము సౌమ్యాతి సౌమ్యమైనది, నిరపాయమైనది, శాంతమైనది. ఏమాత్రము ఉగ్రస్వభావము లేని యంత్రము. ఉగ్ర స్వభావముగల యంత్రములు, ఉగ్ర దేవతామూర్తులు ఉన్న చోట శ్రీచక్రమును ఉంచిన వాటి ఉగ్ర స్వభావములు పోయి శాంత స్వభావము, సౌమ్య స్వభావము కలవి అగును. ఇది ఆది శంకరులు ఆచరించి నిరూపించారు. ఆది శంకరులు కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకు, కామరూపము నుండి ద్వారక వరకు దిగ్విజయ యాత్రలు చేశారు. అప్పుడు ఎన్నో దేవాలయములలోని ఉగ్రరూప దేవతామూర్తులను శాంతమూర్తులుగా మార్చుటకు వివిధ శ్రీచక్ర ప్రస్తారములను ఆ దేవాలయములలో ప్రతిష్ఠించారని ప్రసిద్ధి. అట్టి వాటిలో మనకు తెలిసిన విజయవాడ లోని ఇంద్రకీలాద్రి మీద వేంచేసి ఉన్న కనకదుర్గమ్మ ఒకరు.

శాస్త్రీయమైన శ్రీవిద్యా సంప్రదాయమును గూర్చి చెప్పుకొందాము. శ్రీవిద్యా శంకర భగవత్పాదానుయాయులకు విద్యావంశము అనాద్యవిచ్ఛిన్న గురు పరంపరా ప్రాప్తమగు భారతీ సంప్రదాయమే. ఈ భారతీ సంప్రదాయమే భారత వర్షమున గల గొప్ప విధానమని విష్ణు పురాణమున ఇట్లు పేర్కొనబడినది

''ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్
వర్షంత ద్భారతం నామ భారతీ యంత్ర సంతతిః ॥

ఈ భారతీ సంప్రదాయము శ్రుతి స్మృతి సదాచారనుయాయులచే ఇట్లు ప్రతి దినము పారాయణము చేయబడుచున్నది :

''నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ
తత్పుత్ర పరాశరం చ। వ్యాస శుకం గౌడపాదం
మహాన్తం గోవింద యోగీంద్ర మధాస్య శిష్యమ్।
తం త్రోటకమ్ వార్తిక కార మన్యా నస్మద్గురూ
న్సంతాత మానతోఽస్మి ॥

ఇంతేకాదు. కలి ద్వాపర సంధియందు గల శ్రీకృష్ణ ద్వైపాయన వేదవ్యాస మహర్షి, ''భారతీ వంశ వివర్ధనుడని నేటికిని యశమును గనుచుండుటచే భారతీ సంప్రదాయ మహత్త్వముల్లోకమునకు తేటతెల్లమగుచున్నది.

అట్టి పవిత్ర తమ విద్యావంశంబగు భారతీ సంప్రదాయము నేటి కాలమున శ్రీ విద్యా శంకర పదమాఽవేశ ప్రకాశిత జగద్గురు శ్రీ శ్రీ శివ కల్యాణానంద భారతీ మాన్తాచార్య స్వాములవారి యందే సుప్రతిష్ఠితమై వెలుగొందుచున్నదని శ్రుతి స్మృతి సదాచారానుయాయులు తమ విద్యావంశ సిద్ధికై అవశ్యము తెలియదగిన విశేష విషయము.

ఈ భారతీ సంప్రదాయముచే ప్రవర్తింప చేయబడు శ్రీవిద్యా క్రమము మార్గాన్తర వ్యావర్తనమునకై దక్షిణాచారమనియు, దక్షిణమార్గమనియు చెప్పబడుచున్నది. ఇయ్యది అయిదు విధముల నలరారు చున్నట్లు మేరు తంత్రమున యిట్లు ఉదహరింపబడియున్నది

''కర్తవ్యా వైదికీ శ్రేష్ఠా స్మార్తీ స్యాన్మధ్య మోత్తమా ।
పౌరాణీ మధమాఖ్యాతా తాంత్రికీ త్వ పరాస్మృతా ।
దైశీచకాలీ జాతీయా కనిష్ఠా స్యాదుపాసనా ॥

కౌలికులు, లోకములో తెలియక కొందరు దలచునట్లు దుర్గోపాసనము, శ్రీవిద్యయు తాంత్రికము ఎంత మాత్రమును కాదు అది శ్రుతి, స్మృతి సదాచార ప్రమాణములచే సర్వ విధముల అనాదిగ వైదిక లోకమున ప్రవర్తింప చేయబడి యున్నది. నేటి కాలమున పరశురామ కల్పసూత్రము, వరివస్యా రహస్యము, జ్ఞానార్ణవ తంత్రము, సౌభాగ్య భాస్కరము మొదలగు గ్రంథముల వలన శ్రీవిద్యకు జరుగుచున్న హాని తొలగించుటకు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు రచించిన (1) పూర్ణమీమాంసా దర్శనము, (2) శ్రీ చక్ర దర్శనము, (3) శ్రీయాగ సూత్రము, (4) శ్రీకల అను లలితా రహస్య నామస్తోత్ర వ్యాఖ్య, (5) బ్రహ్మకల మొదలగు గ్రంథములను చదివి సత్యమును తెలిసికొనవచ్చును. అపమార్గములను ఖండించుచు శ్రీ స్వామివారు వ్రాసిన శ్రీవిద్యాస్త్ర పరంపరలోని :

(1) కౌల తస్కర మర్దని, (2) నిత్యోత్సవ ప్రధ్వంసినీ, (3) కులార్ణవ విశోషణీ, (4) కౌలమర్మ విభేదిని, (5) కులగురు విఘాతినీ, (6) కుల నిష్ఠ విక్లేదినీ, (7) పరశు సూత్ర ఛేదిని, (8) కౌల చండాల వాహినీ మొదలగు గ్రంథములను చదివి శ్రీవిద్యా అపమార్గములలోని లోపములను తెలిసికొనవచ్చును డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి M.A., M.Lit., Ph.D. గారు గౌడ పాదాచార్య విరచిత సుభగోదయ స్తుతికి ఆంధ్ర వివరణ వ్రాస్తూ, '' శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠముననే శ్రీ విద్య నేటికిని సంప్రదాయ సిద్ధముగా విరాజిల్లుచున్నది'' అని పేర్కొనిరి. కావున సంప్రదాయ శ్రీవిద్య కావలసిన వారు గుంటూరు అరండల్‌పేట 4/2 లోని శ్రీ సదనములోని శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠమును సంప్రదింపవచ్చును. ప్రస్తుత పీఠాధిపతులు శ్రీ జగద్గురు శ్రీ శ్రీ శివకల్యాణానంద భారతీ స్వామివారు



# అనుబంధము - 10
# అశ్వత్థ వృక్షము

(1) మూలే విష్ణుః స్థితో నిత్యం స్కన్దే కేశవ ఏవచ
నారాయణస్తు శాఖాసు పత్రేషు భగవాన హరిః ।

(2) ఫలేఽచ్యుతో న సందేహః సర్వదేవైః సమన్వితః ।

(3) స ఏవ విష్ణుర్ద్రుమ ఏవ మూర్తో
మహాత్మభిః సేవిత పుణ్యమూలః
యస్యాశ్రయః పాప సహస్రహన్తా
భవేన్నృణాం కామ దుఘోగుణాఢ్యః ॥

(స్కాంద పురాణము)

రావిచెట్టుయందు విష్ణువు, కాండము నందు కేశవుడు, కొమ్మలలో నారాయణుడు, ఆకులలో శ్రీహరి, ఫలములలో అచ్యుతుడు సమస్త దేవతలతో కూడి విరాజిల్లుచుందురు. ఈ విషయమున సందేహము లేదు. రావిచెట్టు సాక్షాత్తు ఆకారము ధరించి వచ్చిన విష్ణువే. దీని నాశ్రయించు వారి యొక్క పాపజాలము నంతను నశింపచేయును. ఇది మనుజుల కోరికలను నెరవేర్చును ఔషధ దృష్టియందును రావి చెట్టుకు గొప్ప ప్రాముఖ్యత గలదు.

శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీత 10 అ 26 శ్లోకములో వృక్షము లన్నింటికంటె రావిచెట్టు యందు తాను ఎక్కువ శక్తితో ఉన్నాని చెప్పారు. (అశ్వత్థః సర్వ వృక్షాణాం. .). రావిచెట్టును విష్ణురూపంగా చెబుతారు. వేపచెట్టును మహాలక్ష్మిగా భావిస్తారు. అందుకే ఒకే పాదలో వేపచెట్టును, రావిచెట్టును పెంచి పెండ్లి చేస్తూ వుంటారు ఇలా చేసి సాక్షాత్తు లక్ష్మీనారాయణ కల్యాణము చేసినట్లు భావిస్తారు.

రావిచెట్టు ఇంతటి మహిమతో కూడుకొని వుంది కనుకనే దీని పుల్లలను యజ్ఞయాగాదులకు మాత్రమే ఉపయోగిస్తారు. ఇతర విధాలుగా ఉపయోగించరు రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణం చేస్తూ ఈ క్రింది పేర్కొన్న శ్లోకము పఠిస్తే శరీర ఆరోగ్యముతోపాటు మానసిక ఆరోగ్యము గూడ పొందగలరు

అశ్వత్థ ప్రార్థన -

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ ।
మధ్యతో విష్ణురూపిణే।
అగ్రత శివరూపాయ ।
వృక్షరాజాయతే నమః ॥

అశ్వత్థః = రేపటి వరకు ఉండక క్షణమాత్రములో నశించునదిగాన అశ్వత్థ మనబడును. (నశ్వోఽపిస్థా స్వతీత అశ్వత్థః)

శ్రు॥ ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః ।
తదేవ శుక్రం తద్బ్రహ్మ, తదేవా మృత ముచ్యతే ।
తస్మిం ల్లోకా శ్శితా స్సర్వే, తదు నాత్యేతి కశ్చన ।
ఏత ద్వైతత్ ॥

(కఠోపనిషత్ ; ద్వి. అ.తృ.వల్లీ)

ఊర్ధ్వమూలః = పైన వేళ్ళు గలదిగను (అన్నింటికి పరమైన పరబ్రహ్మ స్వరూపమే వేరుగాగల); అవాక్ శాఖః = స్వర్గ నరకాదులను అడ్డముగా వ్యాపించియున్న కొమ్మలు గల, ఏషః = ఈ, అశ్వత్థః = సంసార వృక్షము, సనాతన = ప్రాచీనమైనది (ప్రవాహరూపమున అనాది), యత్ = ఏది; అస్య = ఈ సంసార వృక్షమునకు; మూలం = మొదలో ; తదేవ= సంసార వృక్ష మూలమైన ఆ బ్రహ్మ స్వరూపమే; శుక్రం = తేజోమయమైన పరిశుద్ధ స్వరూపము (అవిద్యాది దోషరహితము); తత్ = అదే; బ్రహ్మ = (సర్వ మహత్తగుటచే) బ్రహ్మయనియు; తదేవ = ఆ బ్రహ్మ

స్వరూపముమే , లమృతం = నాశనములేని దనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తస్మిన్ = ఆ బ్రహ్మ స్వరూపమునందే, సర్వేలోకాః = సమస్త లోకములు , శ్రితాః = ఆశ్రయించియున్నవి , ఉ = మరియు, కశ్చన = ఎవడును, తత్ = ఆ బ్రహ్మమును , నాత్యేతి = అతిక్రమింపజాలడు, వై = నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది (నచకేతుడు అడిగిన ఆత్మతత్త్వము)

తా॥ ఈ సంసారవృక్షము అతి విచిత్రమైనది. దీని మొదలు మీదికిని, కొమ్మలు క్రిందికిని ఉండును నాశ స్వభావము కలది అగుటచే దీనిని అశ్వత్థమనెదరు అయినను ప్రవాహమువలె సతతము ప్రవృత్తమగుటచే సనాతన మనెదరు సంసార వృక్షమునకు మూలమైన పరబ్రహ్మము పరిశుద్ధము, జ్యోతిర్మయమైనది అదియే సర్వ మహత్తమగుటచే బ్రహ్మయనియు, సృష్టి ప్రళయ కాలములందు మార్పుచెందక నిర్వికారమై యుండుటచే అమృతమనియు చెప్పబడును ఇట్టి నిర్వికార తేజోరూప శుద్ధ పరమాత్మ యందే చతుర్దశ భువనములు ఆశ్రయమొంది యున్నవి ఏ ఒక్క పదార్థము దానిని విడివిడి ఉండనేరదు దానిని ఎవరు ఉల్లంఘించజాలరు అదియే బ్రహ్మ పదార్థము.

(Contd..on next page)

# అశ్వత్థ వృక్షము

శ్రీ

(పరమాత్మ)

శ్రీ
ప్రత్యగాత్మ
సహస్రార
కమలము

శక్తి, ఆజ్ఞా
కమలము

మహ
తత్త్వము

అహం
కారము

మన
స్తత్వము

విశుద్ధ
కమలము
16

అ 16
చంద్ర ఖండము

అనాహత
కమలము
12

క 24
సౌర ఖండము

మణి
పూరకము
10

య
to
హం
10
ఆగ్నేయం

స్వాధిష్ఠా
నము
6

మూలా
ధారము
4

(Total) సమిష్టి 50

| | | | |
|---|---|---|---|
| శబ్ద | ఆకాశము | శ్రోత్ర | వాక్ |
| స్పర్శ | వాయు | త్వక్ | పాణి |
| రూప | అగ్ని | చక్షు | పాద |
| రస | జలము | జిహ్వా | ఉపస్థ |
| గంధ | పృధ్వి | నాసిక | పాయు |

పై పటము అనాది అయిన అశ్వత్థ వృక్షము. దీని మూలము ఊర్ధ్వముగను, శాఖలు క్రిందికిని గలది. ఇది సనాతన మైనది. అమృతమని, శుక్రమని చెప్పబడు బ్రహ్మము యొక్క స్వరూపమిదియే. దీనిలో సమస్త లోకములు ఇమిడి యున్నవి. దీనితో సంబంధము లేని వస్తువేదియు లేదు. దీనిని అశ్వత్థమందురు. ఇదియే పరదేవతా శారీరక వృక్షము. ఇది నామరూపాత్మకమయిన ప్రపంచ సృష్టి క్రమమును, తన నిజరూపమును తెల్పుచున్నది.

జగత్తు నామరూపాత్మకము కావున ఈ వృక్షమును నామ, రూపములను రెండు శాఖలను కలిగియున్నది. దీనికి మూలము ప్రత్యగాత్మ. అది సృష్ట్యాది వస్తువు. అదే సర్వోర్ధ్వ బిందువుగా ఉన్నది. దాని ప్రభావము వలన అధోముఖ త్రికోణ చక్రమేర్పడినది. ఇది అవ్యక్తమనియు, మూల ప్రకృతి యనియు చెప్పబడును. ఈ ఉభయ బిందువుల వలన నామరూపములను రెండు శాఖలు ఏర్పడినవి.

అశ్వత్థ వృక్షమునకు దక్షిణ భాగమున ఉన్నది నామాత్మక శాఖ. ఈ శాఖ యొక్క సృష్టి క్రమములో మొదట నున్నది బిందువు. ఆ బిందువు వికసనము వలన త్రికోణమేర్పడును. అప్పుడు అందు నాదము ఉత్పన్నమగును. దాని నుండి క్రమముగా చంద్ర ఖండము అకారాది 16 స్వరములను (అచ్చులు) వాని వలన సౌరఖండమును 24, అగ్ని ఖండమును 10 వ్యంజనములు సమిష్టి 50 అక్షరములు ఉత్పన్నమయినవి. అవి క్రమముగా వర్ణ, పద మంత్ర రూపములను పొంది చతుర్దశ భువనములయందు గల సకల నిగమాగ భాషారూపముగా వ్యాపించి ఈ నామాత్మక శాఖ అలరారు చున్నది.

ఇక అశ్వత్థ వృక్షము నామ భాగమునందు రూపాత్మక శాఖ గలదు. దీని ఉత్పత్తి క్రమములో సర్వోర్ధ్వ బిందువు సృష్ట్యాదిన నున్న బ్రహ్మము. సృష్టి ఆవిర్భావ కాలము సమీపించినపుడు బ్రహ్మము అనేకముగా అగుదును అని అనుకొనును.

శ్రు॥ సోఽకామయత బహుస్యాం ప్రజాయేతి స ఈక్షత।

ఆ బ్రహ్మము నందు సకల శక్తులు ఇమిడి యున్నందున దానికి ప్రపంచ స్మరణ కలిగినది. అప్పుడే ఇచ్ఛాశక్తి పురోభాగమునందు పుట్టినది. అది కోణ చక్రాకృతి కలిగి మూలప్రకృతి అనియు, అవ్యక్తమనియు పిలువబడుచున్నది. ఇది త్రిగుణాత్మకము. ఈ ఉభయ బిందురూప శివశక్తి సామరస్యము వలన మూడవదగు మహత్తత్వము ఉత్పన్నమైనది. అందువలన అహంకార బిందువు, దాని వలన మనస్తత్వము, దానిచే ఆకాశము, దాని నుండి వాయువు, దానియందు అగ్ని, అందుదకము, అచట భూమి ఇటుల క్రమముగా ఉత్పన్నమైనవి.

ఈ ఆకాశాది పంచభూతముల ధర్మములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంథములు; శ్రోత, త్వక్, చక్షు, జిహ్వా, నాసిక అనే జ్ఞానేంద్రియ పంచకమును, వాక్పాణిపాద పాయూపస్థలనే కర్మేంద్రియ పంచకమును ఈ పంచభూతముల వలననే కలిగినవి. ఇవి ఆరోహణ క్రమమందు పృథ్వి నుండి అవ్యక్తము వరకు వ్రాస్తే అవ్యక్తము ఇరువది నాల్గవది (24) అగును. కావున ఇవి చతుర్వింశతి తత్త్వములని నిగమ సిద్ధము. పంచ విగ్ంశ ఆత్మా భవతి అంటే 25 వది ఆత్మ అగును

ఆది బిందువు శివశక్తి మేళనము అదియే తత్త్వాతీతము ఈ 24 తత్త్వములు క్రమముగా వ్యాపించి కలా, తత్త్వ, భువనాకారములను పొందుచున్నవి. అశ్వత్థ వృక్షమందు ఇది రూపాత్మక శాఖ.

ఈ బిందువులలో దిగువ దానికి పై బిందువు కారణము. దిగువది కార్యము

## అశ్వత్థ వృక్షమందలి కమల విభాగములు :-

మూలాధారాది సహస్రాంత కమలములకు సహస్రారము మొదటిది. దాని ప్రభవలన ఆజ్ఞాకమలము, దాని వలన విశుద్ధము, దాని ప్రభ అనాహతము, దానిచే మణిపూరము, దానిచే స్వాధిష్ఠానము, ఆ క్రింద మూలాధారము ఏర్పడినవి. ఈ కమలముల యందు నామరూప శాఖలు రెండును ఇమిడి యున్నవి. విశుద్ధాది

మూలాధారాంత కమలములు ఐదును పంచభూతములను తెల్పును దీనిలో రూపశాఖ ఇమిడియున్నది ఆజ్ఞాది మూలాధారాంత షట్కమలముల దళములు - ఆజ్ఞ-2; విశుద్ధ-16, అనాహత-12, మణిపూరము-10, స్వాధిష్ఠానము-6, మూలాధారము-4 మొత్తము 50 - ఏబది ఈ దళముల యందు పంచాశద్వర్ణమయ మాతృక, దళమునకు ఒక మాతృక చొప్పున ఉన్నవి. ఈ వర్ణములే యోగినీరూపములను ధరించియున్నవి. దీనిలో నామాత్మక శాఖ ఉన్నది.

సుషుమ్నమను నాడి సహస్రారము నుండి మూలాధారము వరకును వ్యాపించి యున్నది సుషుమ్న నాడి యందు ఈ కమలములు పద్మమాలవలె నున్నవి. సుషుమ్న నాడికి ఎడమ కుడి ప్రక్కలందు ఇడా పింగళ అను రెండు నాడులు కలవు. ఇడనాడిని చంద్రనాడి అని, పింగళ నాడికి సూర్యనాడియని నామాంతరములు గలవు ఇడనాడి చంద్ర మండలమున, పింగళనాడి సూర్య మండలమున చరించును

అశ్వత్థ వృక్షమందు అంతటను సత్వ రజ స్తమములనే మండల త్రయమును బ్రహ్మాండ పిండాండ శ్రీచక్ర శ్రీ విద్యా మాతృకాదులును, సకల నిగమాగమములు సామరస్యమును పొందుచున్నవి.



# అనుబంధము - 11

## నాడీ వివరము - షట్చ్రక్రములు

మానవునికి స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము అని మూడు శరీరములు గలవు. పంచ వింశతి (25) తత్త్వములు కలిగియున్నదే స్థూల దేహము పంచతన్మాత్రలు (5), పంచభూతాలు(5), జ్ఞానేంద్రియ పంచకము (5), కర్మేంద్రియ పంచకము (5), మనస్సు (1), బుద్ధి (1), చిత్తం (1), అహంకారము (1), జీవుడు (1), మొత్తము 25 - ఇవియే స్థూలదేహములోని తత్త్వములు. సూక్ష్మ శరీరము సప్తదశ (17) తత్త్వాలు గలది పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణవాయువులు మనస్సు బుద్ధి అనే 17 తత్త్వాలే సూక్ష్మ శరీరమందలి తత్త్వాలు సూక్ష్మ శరీరమునే లింగ శరీరమని గూడ అంటారు స్థూల దేసములో సూక్ష్మ శరీరములోని 17 తత్త్వాలు చేరి ఉండును ఇక కారణ దేహమే అజ్ఞానము

క్రింద పేర్కొన్న సుషుమ్నాది నాడులు సూక్ష్మ శరీరమును అనుసరించి ఉంటాయి నాడులు అనగా స్థూలదేహములో కనపడే నరాలు కావు. ఈ నాడులు సూక్ష్మరూపంగా ప్రాణశక్తికి ఆధారాలై ఉంటాయి వీటిని వైద్యులు కనుగొనలేరు ఈ దేహం అంతర్గతములై ఉండే అనేక నాడుల కూడలి అనవచ్చును ఈ నాడీ సమూహము సూక్ష్మ శరీరమును ఆశ్రయించి ఉండును జాగృతిని పొందిన కుండలిని సుషుమ్న నాడిని చేరి నాడీ మండలమును శుద్ధపరచును అందువలన సాధకుడు చక్రాలను గూర్చియు నాడీ మండలిని గూర్చియు తెలిసికొనుట అవసరము.

కుండలినీ యోగము హఠయోగ ప్రాతిపదిక గలది. హ - అనగా సూర్యుడు, ఠ - అనగా చంద్రుడు ఈ ఇద్దరిని చెప్పే యోగమే హఠయోగము. కుటిలాంగి, భుజంగి, శక్తి, ఈశ్వరి, కుండలినీ, కుండలి అను ఏడును కుండలినీ నామాంతరములు. లింగ స్థానమునకు పైన నాభి స్థానమునకు దిగువన పక్షిగుడ్డు ఆకారముగల కంద స్థానము గలదు అక్కడ 72 వేల నాడులు పుట్టి శరీరమందు నలు ముఖముల వ్యాపించియున్నవి. కొందరు మూడున్నర కోట్ల నాడులు గలవందురు గుద స్థానము కంటె కొంచెము పైన లింగస్థానముకంటె క్రిందుగా శరీర మధ్యమున

మూలాధార చక్రము గలదు. బ్రహ్మరంధ్ర అధో భాగమందు సహస్రారము గలదు మూలాధారము మొదలుకొని సహస్రార పర్యంతము వీపు వైపున వీణాదండమువలె సర్వనాడులకు ఆధారమైన పెద్ద యెముక ఒకటి గలదు. దానిని బ్రహ్మదండి అందురు. అది రెండు వైపులను నరుకబడిన వెదురువలె నుండును దీనిని మేరుదండమని గూడ అందురు.

బ్రహ్మదండి మొదటనున్న మూలాధార చక్రము మధ్య నుండి బ్రహ్మ రంధ్రము వరకు వ్యాపించి యున్న నాడికి బ్రహ్మనాడి యని పేరు. బ్రహ్మనాడికే సావిత్రి, సరస్వతి అని నామాంతరములు గలవు. దీనిని వాడుకలో సుషుమ్నానాడి అని పిలుతురు. సుషుమ్నానాడి యొక్క ఎడమ కుడి ప్రక్కల యందు ఇడా పింగళ నాడులున్నవి. ఈ మూడు అతిసూక్ష్మమైన నాడులు వీటిద్వారా అతిసూక్ష్మమైన అంతర్వ్యాత శక్తులు ప్రసరించుచుండును. ఇడ, పింగళ నాడులు ఆధార చక్రము నుండి నాశికా రంధ్రముల వరకు వ్యాపించియుండును. ఇడానాడికి పితృయానమని, చంద్రనాడి అని పేర్లు గలవు పింగళనాడిని దేవయానమని, సూర్యనాడియని కూడ పిలుతురు. ఇడనాడి చంద్రమండలమున, పింగళనాడి సూర్య మండలమున చరించును నాడులన్నిటిలోను ఈమూడే ముఖ్యమైనవి సుషుమ్నానాడికి నాడీ శిరోమణి అని పేరు.

ఎడమకంటియందు గాంధారి నాడి, కుడికంటియందు హస్తిజిహ్వా, కుడి చెవియందు పూషనాడి, ఎడమచెవియందు యశస్విని నాడి, అంగస్థానమునందు కుహూనాడి, మూల స్థానమందు శంఖిని నాడి వ్యాపించి యుండును. కనుబొమ్మల మధ్యయందు శుక్ల అనబడు నాడియున్నది. నాశికారంధ్రములు, చెవి రంధ్రములు కనుబొమ్మల క్రింద భాగమున కలియును. దానికిని చతుష్పదమనియు, శృంగాటకము అని పేర్లు గలవు.

ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు కనుబొమ్మల మధ్య స్థానమున కలియును. ఈనాడులకు వరుసగా గంగా, యమునా, సరస్వతీ అని నామములు గలవు అందువలన అవి కలియు స్థానమును త్రికూటమని, త్రివేణీ సంగమమని పిలుతురు. సరస్వతీ నాడీ శాఖ నాలుక చివర వరకు వ్యాపించి వాక్ప్రసారిణియై యుండును. విశ్వోదరియను నాడి భక్ష్యభోజ్యాది నాలుగు విధములగు ఆహారమును భక్షించును పయస్వినీ అను నాడి కంఠస్థానమందుండి ఆకలిదప్పులను కలిగించును; జలపానము చేయును.

రక్త, సినీవాలీ, కుహూ అను మూడు నాడులు అధోముఖముగా నున్నవి రక్తనాడి రేతస్సును, సినీవాలీ నాడి మూత్రమును, కుహూనాడి మలమును వెలుపలికి నెట్టును. శంఖినీ, దామినీ నాడులు తిన్న ఆహారసారమును గ్రహించి బ్రహ్మరంధ్రమునందు చేరి అమృతమును సృష్టించును

నాడులయందు కదలుట, పరుగెత్తుట, కంపము నొందుట, ముడుచుకొనుట, బడలిక చెందుట మొదలగు గుణములు కలిగినట్టి దశవాయువులు సంచరించుచుండును. ఆ దశ విధ వాయువుల పేర్లు (1) ప్రాణ, (2) అపాన, (3) వ్యాన, (4) ఉదాన, (5) సమాన, (6) నాగ, (7) కూర్మ, (8) కృకర, (9) దేవదత్త, (10) ధనంజయ.

(1) ప్రాణ వాయువు హృదయ స్థానము నందుండి శ్వాసనిశ్వాస రూపముచేత ఇడాపింగళ నాడీ రంధ్రముల ద్వారా వెలుపలికి 8 అంగుళములు ప్రసరించి లయించును. దీనికి అధిష్ఠాన దేవత విశిష్టకుడు.

(2) అపాన వాయువు గుద స్థానము నుండి మలమూత్రములను వెడలించుచుండును విశ్వకర్మ అనెడి అధిష్ఠాన దేవతచే ప్రేరేపింపబడి అధోముఖ సంచారము చేయును. కుహూనాడి వలన మలము, సినీవాలి నాడి వలన మూత్రమును, రక్తనాడి వలన శుక్లమును బహిర్గతములగును

(3) వ్యాన వాయువు శరీరమంతటను వ్యాపించి శుక్లశోణితములను పంచిపెట్టుచుండును. దీని అధిష్ఠాన దేవత విశ్వయోని. ఈ వాయువు తిన్న ఆహారమును శరీరమంతట వ్యాపింపచేయును.

(4) ఉదాన వాయువు కంఠస్థానము నందుండును. దీనికి అధిష్ఠాన దేవత అజుడు ఈ దేవత ప్రేరణచే మనస్సు యొక్క సంకల్ప వికల్పములను జిహ్వోద్యష్ఠ స్థానముల యందు ఉచ్చారణ రూపముగా వాక్కును కలుగచేయును.

(5) సమానవాయువు నాభి స్థానము నందుండి భుజించిన ఆహారమును జఠరాగ్నిచే పచనము చేయుచుండును. దీని అధిష్ఠాన దేవత జయుడు. ఆ దేవత చేత ప్రేరేపింపబడి పచనము చేయబడిన ఆహారమును కంద స్థానమందు పుట్టి వ్యాపించు 72,000 నాడులకు సమానముగా అందించును.

ఈ అయిదు వాయువులను ప్రాణాది పంచవాయువులనబడును ఇవి స్థూల శరీర సంబంధములై యున్నవి మిగిలిన అయిదు వాయువులను ఉపవాయువులందురు ఇవి సూక్ష్మ శరీర సంబంధమైనవి.

(6) నాగవాయువు ఉద్గారక్రియ (వాంతి)ను కల్గించును.

(7) కూర్మవాయువు కనురెప్పలు మూయుట, తెరచుట చేయించును.

(8) కృకరవాయువు తుమ్మును కలిగించును

(9) దేవదత్త వాయువు ఒడలు విరచుట, ఆవలింప చేయుట చేయును.

(10) ధనంజయ వాయువు సర్వ శరీరమందు వ్యాపించి శరీరమును వృద్ధిపరచును. మృతి చెందిన తరువాత గూడ 9 గడియల వరకు శరీరము నందుండును

మన శరీరములోని చక్రములు, వాటి స్థానములు తత్త్వములు మొదలగు విషయములను గూర్చి కొంత తెలుసుకొందాము. చక్రములు, నాడీ ముడులు అతి సూక్ష్మనాడుల ద్వారా మన శరీరమును, బుద్ధిని ఆలోచనను అదుపులో నుంచును.

**(1) మూలాధార చక్రము :-** ఇది గుద స్థానమునందు గలదు. దీనికి నాలుగు దళము లున్నవి. నాలుగు దళములందు వరుసగ వ, శ, ష, స అను నాలుగు వర్ణములన్నవి ఇది అరుణ వర్ణములో ఉండును ఇది పృథ్వీతత్త్వము కలది, తత్త్వ బీజము లం. ఈ చక్రమును అధిష్టించిన దేవత సిద్ధవిద్య

**(2) స్వాధిష్ఠాన చక్రము :-** ఇది లింగస్థానమున ఉన్నది. దీనికి ఆరు దళములున్నవి ఆరు దళములందు వరుసగ బ, భ, మ, య, ర, ల అను ఆరు వర్ణములు ఉన్నవి ఇది పీత వర్ణములో ఉండును. ఇది అగ్ని తత్త్వము గలది, తత్త్వబీజము రం ఈ చక్ర అధిష్ఠాన దేవత సిద్ధేశ్వరి

**(3) మణిపూరక చక్రము :-** ఇది నాభి స్థానమున ఉన్నది. ఇది పది దళములు గల నీలవర్ణ కమలము. ఒక్కొక్క దళమునందు వరుసగా డ నుండి ఫ (డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ) వరకు గల పది వర్ణములున్నవి. ఇది జల తత్త్వము గలది. దీని తత్త్వబీజము వం దీనిని అధిష్ఠించిన దేవత వయోవస్థా వివర్జితా

**(4) అనాహత చక్రము :-** దీని స్థానము హృదయము ఇది పన్నెండు దళములు గల హేమ వర్ణ కమలము ఇది వాయు తత్త్వము గలది. దీని దళములలో వరుసగ క నుండి ఠ వరకు గల పన్నెండు వర్ణములన్నవి. దీని తత్త్వ బీజము యం దీని అధిష్ఠాన దేవత వామదేవి.

**(5) విశుద్ధ చక్రము :-** ఇది కంఠ స్థానమున ఉన్నది. ఇది పదహారు దళములు గల శ్వేత వర్ణ కమలము. దీని దళములలో వరుసగా పదహారు స్వరములు అనగా అచ్చులు (''అ'' నుండి అః వరకు) ఉన్నవి. ఇది ఆకాశ తత్త్వము గలది. దీని తత్త్వ బీజము హం దీనిని అధిష్ఠించిన దేవత యొక్క రహస్య నామము వజ్రేశ్వరి.

**(6) ఆజ్ఞా చక్రము :-** ఇది భ్రూ మధ్యమమున ఉన్నది. ఇది రెండు దళములు గల శ్వేత వర్ణ కమలము . ఇది మహత్త్వ తత్త్వము గలది దీని తత్త్వ బీజము ఓం. దీని రెండు దళములందు వరుసగా హం, క్షం అను వర్ణములు గలవు. దీనిని అధిష్ఠించిన దేవత సిద్ధమాత.

**(7) సహస్రారము :-** బ్రహ్మ రంధ్రము అధో భాగమున ఉన్న పరాకాశమున సహస్రారమున్నది. ఇది సహస్ర దళముల కమలము. ఇది తత్త్వాతీతము. దీని అధిష్ఠాన దేవత యశస్విని

మూలాధారాది ఆజ్ఞాచక్రము వరకు గల షట్చక్రములకు కులమని పేరు. సూర్య చంద్ర గతియు, వారి కిరణ ప్రసారము కాలభేదము కులము వరకే. లలాట పైభాగము పరాకాశము సహస్రారము నుండి బ్రహ్మ రంధ్రము వరకు తురీయ స్థానము జ్యోత్స్నాలోకము. ప్రతి రెండు చక్రముల తరువాత ఒక గ్రంధి ఉన్నది. మూలాధార స్వాధిష్ఠానముల తరువాత బ్రహ్మ గ్రంధి ఉన్నది. మణిపూర, అనాహత చక్రముల తరువాత విష్ణు గ్రంధి ఉన్నది విశుద్ధ ఆజ్ఞా చక్రముల తరువాత రుద్ర గ్రంథి ఉన్నది బ్రహ్మగ్రంధి అగ్ని మండలము, విష్ణుగ్రంధి సౌర మండలము, రుద్ర గ్రంథి సోమ మండలము బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంధు లనునవి అవిద్యా కేంద్రములు

ప్రపంచము, దేహేంద్రియాదులు వీనికన్న నితరమేమియు లేదనుకొనుటయే బ్రహ్మగ్రంథి స్వరూపము. ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయములను మూడు

కోశముల సమిష్టి రూపమగు సూక్ష శరీరము తానను ద్వైతభావమును సూచించునది విష్ణుగ్రంధి జీవబ్రహ్మల అన్యోన్య అధ్యాసయే రుద్ర గ్రంధి

**బ్రహ్మ రంధ్రము :-** ఈశ్వరుడు పంచ భూతములను, ఇంద్రియ పాలకులను, ఇరువది నాలుగు తత్త్వములుగల శరీరమును సృజించెను తాను లేనిదే గర్భస్థ జంతు శరీర ఇంద్రియాదులకు చేతనత్వము ఉండదని, తాను కూడ శరీరమందు ప్రవేశింప నిశ్చయించెను. ప్రవేశించుటకు మార్గములను చూడగా ఇంద్రియ మార్గములందు ఇంద్రియ పాలకులగు దేవతలు ఉన్నందున వారికి బాధ కలుగునని ఆలోచించి శిరో మధ్యభాగమును భేదించి తద్వారా ప్రవేశించి అచటనే ఉండెను. ఆ స్థానమునకు బ్రహ్మరంధ్రము అని పేరు. గర్భస్థ జంతు శరీరమునందు బ్రహ్మరంధ్రము ద్వారా ఆత్మ ప్రవేశించి సకల తత్త్వములకు చేతనత్వము కలుగజేసి తాను రాజుగాను ఇంద్రియాదులు ప్రజలుగాను ఉన్నవి ఈ ప్రవేశించిన కలయే చిత్కళ. దీని వలననే సకల శరీరమునకు చైతన్యము కలిగినది. ఇది ఇంద్రియాదులకు వేరైనది కాన ప్రత్యగాత్మ అనియు, అసంగముగా నున్నందున సాక్షి అనియు పిలువబడుచున్నది ఇది బ్రహ్మరంధ్ర అధోభాగమున తేజోరూపమున ఉన్నది. ఇది సుధా స్థానముగా నున్నందున చంద్ర మండలమని చెప్పుదురు.

# కుండలిని

మానవుని వెన్నెముకలో ఇడా, పింగళ, సుషుమ్న అని అతి సూక్ష్మమైన అంతర్భూత శక్తులు ప్రసరింపచేయు మూడు నాడులున్నవి అని చెప్పుకొన్నాము. ఇడా, పింగళ, సుషుమ్న నాడికి ఇరు ప్రక్కల నుండి నాశికా రంధ్రముల ద్వారా పని చేయుచుండును. కుండలినీ శక్తి అంటే శరీరములోని అంతర్భూత శక్తి; వెన్నెముక క్రింది భాగమున ఉండును సుషుమ్ననాడిలో మూడున్నర చుట్టలు చుట్టుకొని ప్రచ్ఛన్నముగా నుండును

ఇడానాడిని చంద్రనాడి అందురు. ఇది చల్లగా నుండును. పింగళను సూర్యనాడి అందురు. ఇది వేడిగా నుండును.

మనము గాలిని పీల్చేటప్పుడు వేలిని ముక్కు రంధ్రముల దగ్గర ఉంచితే రెండు రంధ్రముల దగ్గర శ్వాసక్రియ సమానముగా జరుగుటలేదని తెలియును. ఒకప్పుడు

ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఎడమ నాసికా రంధ్రము ద్వారా ఎక్కువగాను, కుడి నాసికా రంధ్రము వద్ద తక్కువగాను ఉండును ఇంకొకప్పుడు దానికి వ్యతిరేకముగాను ఉండును. ఎడమ నాసికా రంధ్రము ద్వారా శ్వాస జరుగునప్పుడు చల్లదనము కలుగును. కుడి నాసికా రంధ్రము ద్వారా శ్వాస జరుగునప్పుడు వేడి కలుగును పింగళనాడి (కుడి వైపుది) ద్వారా శ్వాస జరుగునప్పుడు ఉపాసకులు జపాదులు చేస్తే శీఘ్ర ఫలితము వచ్చునని ప్రతీతి. అదే విధంగా ఇడ ద్వారా శ్వాస జరుగునప్పుడు సాధన చేస్తే శీఘ్ర ఫలితములు ఉండవని ప్రతీతి.

సుషుమ్న నాడి పొడుగున క్రింది నుండి పైకి మూలాధారాది ఆరు ప్రధాన చక్రములున్నవి. ఈ చక్రములకు సంబంధించిన ధ్యానయోగమును కుండలినీ యోగమందురు. కుండలినీ శక్తిని జాగరితము చేసి మూలాధార చక్రము నుండి పైకి లేపి షట్చ్రక్ర భేదనము చేయించి సహస్రారమును చేర్చుటే కుండలినీ విద్య. గౌడపాదులు ''సుభగోదయ స్తుతి'' వ్రాశారు. దీనిలో కుండలినీ ప్రబోధ విధి కూడ ప్రతిపాదించారు. సుభగోదయమనగా శ్రీ త్రిపుర సుందరి యొక్క అభ్యుదయమని అర్థము. శ్రీ త్రిపురాంబిక కుండలినీ రూపమున పిండాండమున ఉండుటచే కుండలినీ ప్రబోధ విధి దీనిలో ప్రతిపాదింపబడినది. ఈ శాస్త్ర జిజ్ఞాసకలవాడే ఈ గ్రంథ పఠనమునకు అధికారి

మూలాధార చక్రమునకు సమీపమున యోని కందమను స్థానము గలదు. దానియందు అగ్నివంటి తేజో మధ్యమున జీవశక్తియగు కుండలిని మూడున్నర వలయములు కలిగి సర్పాకృతిలో నిద్రవస్థలో ఉండును. ఇది సమస్త శక్తి మహిమలకు, సమస్త జ్ఞానములకు, విజ్ఞానములకు ఆధారభూతమగు కేంద్రము. ఇది నిద్రితమై ఉన్నంత కాలమును జీవి అజ్ఞానముతో ఉండును. కుండలినీ జాగరణమున జీవి సంపూర్ణ జ్ఞానమును, సమస్త మహిమలను పొందును. దీని సాధనము యోగ మార్గములో సిద్ధుడై సమర్థుడైన సద్గురువు కరుణాకటాక్షములతో చేయవలెనే గాని స్వతంత్రముగా చేయరానిది.

బ్రహ్మరంధ్ర స్థిత సహస్రారమునకు పద్మాటవి అను పేరు గలదు పరమేశ్వరి అందుండును. మూలాధారము నుండి బయలుదేరు సుషుమ్న సహస్రారమును చేరుటకు మార్గములో పద్మములనబడు షట్చ్రక్రములు గలవని చెప్పుకొన్నాము. వానిలోని దళములలో గల వర్ణములను గూర్చి కూడ చెప్పుకొన్నాము. మూలాధారము నుండి ఆజ్ఞా చక్రము వరకు గల చక్ర దళములలోని వర్ణ పద్మములు పశ్యంతీ

వాగ్రూపములు సహస్రారమున కాది విద్య (నారాయణ సమామ్నాయము) హాది విద్య (మహేశ్వర సమమ్నాయము) భూమ విద్య, విసర్గ అచ్ క చ ట త ప య శ వర్గములు, సంఖ్యా విద్యయయు పరావాగ్రూపమున ఉండును.

సహస్రారమున చంద్ర మండలమున సుధా సముద్రమందు పరమేశ్వరి ఉండును ఉత్తమ సాధకులు ★ప్రాణాయామాభ్యాస పాటవమున ఈ సుధాసాగరమును తెలుసుకొందురు శ్రీచక్రమందలి బిందుస్థానము సుధా సాగర సంజ్ఞ కలది సహస్రారమందలి చంద్ర మండలమున అధోముఖమున సహస్రదళ పద్మము ఉన్నది. కుండలిని దానిని చేరినపుడు చంద్ర మండలము నుండి అమృతస్రావము కలిగి 72000 నాడులను తడుపును

కుండలిని వాగ్భవ బీజము (ఐం) సంకేతముగా గలది. అది వర్ణ విభాగమున అ, ఇ, అ, మ్ - అగును. మూడు వర్ణములు మూడు వలయములను, అర్థ వర్ణము(మ్) అర్థవలయమును సూచించును. కుండలములు అనగా గుండ్రని చుట్టలు శబ్దము వలయ తరంగములుగా వ్యాపించును. కుండలిని వాగ్దేవి యనుట రహస్యము. మూలాధార సహస్రారముల మధ్య చరియించు పరాస్వరూపిణియగు సుషుమ్న నాడి ఆరోహణ, అవరోహణ ప్రదక్షిణ క్రమము గలది చలనమున ఆద్యంత చక్రములకు మధ్యగల చక్రములను, గ్రంథులను చుట్టి తిరుగుటచే సర్పసామ్యము గలది అగుచున్నది.

మూలాధారము నుండి సహస్రామునకును, అచ్చటి నుండి తిరిగి మూలాధారమునకును సుషుమ్న మార్గమున జరుగు ముఖ్యప్రాణగమనము (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) హంసజపమనబడును. ముఖ్యప్రాణము హంస సంజ్ఞ కలిగియున్నది. త్రిగుణాత్మకమైన సూర్య, చంద్ర, వహ్ని, బీజములు పురుష ప్రకృతి సంయోగరూపమైన ''హగ్ం సః'' రూపమును దాల్చుచున్నవి. ''హం'' ఉచ్ఛ్వాసము. ''సః'' నిశ్వాసము. ఇడ చంద్రనాడికిని, పింగళ సూర్యనాడికిని, అగ్ని సుషుమ్న నాడికిని సంకేతములు. చేతనశక్తి అయిన ముఖ్య ప్రాణము ఉచ్ఛ్వాస నిశ్వాసముల కలుగచేయుచు పిండాండములందు శివశక్తుల సంయోగము కలుగుచేయుచున్నది

పైన మనము చెప్పుకొన్న విషయము వేరొక పుస్తకములో కొంచెము భేదముతో ఉన్నది. వైవిధ్యము కొరకు క్రింద ఇవ్వబడినది.

---

★ ప్రాణాయామ పద్ధతి చివర ఇవ్వబడినది.

మేరుదండమను వెన్నుపూస యొక్క మధ్యభాగమున సుషుమ్న అను నాడి త్రినాడీ స్వరూపమున ఉన్నది మేరుదండమునకు వెలుపల ఎడమ వైపున ఇడ, కుడివైపున పింగళ అను నాడులున్నవి. త్రిరూపయగు సుషుమ్న నాడి మధ్యలో వజ్రయను నాడి ఉన్నది ఇది శిరస్సు వరకు వ్యాపించి యుండును వజ్రనాడి మధ్యయందు చిత్రిణీ అను నాడి గలదు దీని ననుసరించి షట్చక్రములుండును కంద స్థానము నుండి పరశివ పర్యంతము బ్రహ్మ నాడి (సుషుమ్న) వ్యాపించి యుండును. ఇది శుద్ధ జ్ఞాన స్వరూపిణి దీని చివర సుధాధార గమ్య ప్రదేశము గలదు. మూలకందమున సుషుమ్న నాడి ఫణాగ్రముతో కప్పియుండును. సాధకుడు వాయు నిరోధము ద్వారా చంద్ర సూర్య నాడులను (ఇడా పింగళలను) నిరోధించినంతనే అమృత స్రావము పొందలేని సుషుమ్న ఉద్దీపించి మూల కందమును వదలును. ఇడా పింగళలు నిరోధింపబడుటకు పూర్వము అవి కుండలినికి అమృత స్రవణ హరణముల నొనర్చెడివి. కుండలినీ శక్తి సుషుమ్నను ఆశ్రయించి యుండును. అమృతపానము లభించనందున అది ప్రబుద్ధమగును. అప్పుడు కుండలిని బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులను భేదించి సహస్రారమున గల చంద్ర మండలమును చేరును. ఇది పర శివ స్థానము. ఇచట శక్తి శివునితో విహరించును. లౌకిక సుఖము కన్న సహస్రాధికానందము గలది శివశక్తి సామరస్యము ఇది పరావస్థ ఈ యోగమునకు లభించు ఫలమిది

త్రిరూపిణియైన సుషుమ్నయందు రుద్రరూపిణియగు వజ్ర కలదు. దీని ప్రబోధమున రుద్ర గ్రంధి, విష్ణురూపిణియగు చిత్రిణి ప్రబోధమున విష్ణుగ్రంధి, బ్రహ్మనాడి ప్రబోధమున బ్రహ్మ గ్రంధి భిన్నములగును. అగ్ని రూపిణి వజ్ర; సూర్యరూపిణి చిత్రిణి; చంద్రరూపిణి బ్రహ్మనాడి. పంచదశి గూడ అగ్ని సూర్య చంద్ర రూపములతో మూడు ఖండములుగా నున్నది. ప్రతి ఖండమునకును చివరనున్న హ్రీంకారము గ్రంథిత్రయ రూపము కనుక పంచదశీ మంత్రము కుండలినీ. ప్రబోధకము. హ్రీంకారత్రయము గ్రంథిత్రయ భేదకము. రాజ, హఠ, లయ యోగముల ఫలమే మంత్ర యోగమునకు లభించును.

ఇక్కడ మనము చెప్పుకొన్న కుండలినీ శక్తి రేఖా మాత్రముగానే. దీని పూర్తి వివరణలకు ఆ శాస్త్రము బాగా తెలిసిన వారు వ్రాసిన తత్సంబంధమైన గ్రంథములను చూడాలి. దానికంటె ముందు దానిలో నిష్ణాతులైన వారి వద్ద శిష్యరికము చేయాలి.

ఇక్కడ నా మనసులోని మాట ఒకటి చెప్పాలి. నేను పరిశీలించినంతవరకు జగద్గురు శ్రీ శ్రీ కల్యాణానంద భారతీస్వామి వారు ఈ కుండలినీ శక్తిని గూర్చి వ్రాసిన

గ్రంధములేవీ కనబడలేదు శ్రీకలలో కూడ చాలా కొంచెముగా మాత్రమే దీనిని గురించి వ్రాశారు అంటే ఆయన సంప్రదాయములోని వారిని ఆ సాధన జోలికి వెళ్ళవద్దని సూచన కావచ్చునని నాకు తోచింది

దీనిని గూర్చి శ్రీ సింహం భట్ల రామమూర్తిశాస్త్రిగారు కామకలా విలాసమునకు వ్రాసిన వ్యాఖ్యానములో ఈక్రింది విధముగా నున్నది

''కౌ ళులు, హఠయోగులును ఈ సుషుమ్ననాడి సర్పాకారముగా నున్నందున కుండలినీ శక్తియని వాడుచు వాయుధారణ, సూర్య చంద్ర నాడులగు ఇడా పింగళలను బంధించినపుడు వాయు వహ్ని ఘాతముచే సర్వదా నిద్రా స్వభావముగల మూలాధార మందలి కుండలిని మేలుకొని మంద్ర స్వరము చేయుననియు, ఆ నాడీ ద్వారా అగ్ని సంయుక్త వాయువు హృత్కమల గతమయినపుడు యోషిత్సంజ్ఞయనియు, సహస్రార గతమయి అగ్ని వేధ కలిగినపుడు పతివ్రతా సంజ్ఞ కలదనియు, యావేధ వలన నా చంద్రమండలము నుంచి అమృతస్రావము కలిగి నంత కాలము నా యోగికి సుఖప్రాప్తి యనియు, నాధారణాంతమందు యథాప్రకారము కుండలినీ శక్తి మూలాధారగతమయి నిద్రించునని వారి మతము అందువలననే గౌడపాదాచార్యులవారు కౌళులు క్షణముక్తులని చెప్పిరి ''

''ఈ వాయుధారణ రూపమయిన హఠయోగము ప్రస్తుతము అనుభవ సిద్ధమయిన గురుపరంపర లేకయే లోపించినది ఉన్నను అణిమాది సిద్ధిప్రదము కానిది సహజముగా మోక్షము నీయజాలదు మోక్షాపేక్ష కలిగినపుడు తిరిగి జ్ఞాన సాధనమగు స్వవిచారణయే చేయవలెను. హఠయోగికి ముక్త్యపేక్ష కలిగినపుడు జ్ఞానమును అభ్యసించవలెను. కాని జ్ఞానయోగికి హఠయోగాపేక్ష యెన్నడును కలుగదు. ఈ హఠయోగము వలన శరీరపాటవాది ఇహ సుఖములు మాత్రము కలుగును. జ్ఞానయోగికి మాయ మోహ నివృత్తి కలిగి, మనశ్చాంచల్యము వదలి అఖండానందముతో జీవన్ముక్తుడయి ఉపాధి విలయ పర్యంతము విహరించును. లోకమందు అనేక పామరజనులు ఈ వాయుసాధనమే మోక్షసాధనమని, యిందువలన మనస్సు స్వాధీనమగునను భ్రమలో మునిగియున్నారు గాని, అది నిజముకాదు. ఈ హఠ యోగము వేద బాహ్యులగు క్షపణక, కాపాలిక, దిగంబరాది విరాగుల కొరకు ఈశ్వర కల్పితము. మరియు నీ హఠయోగము పూర్వమీమాంసలో వర్ణించిన అర్చిరాది, ధూమాది మార్గముల వంటిది.''

కావున మనము అమ్మ మీద భారమువేసి భక్తి, జ్ఞాన మార్గములలో మోక్షసాధన చేయాలి

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష మహేశ్వరీ ॥

# యోగము

జీవ-పరమాత్మల ఐక్యమే యోగము. అరిషడ్వర్గము యోగమునకు విఘ్నమును కలిగించుచుండును యోగ సాధనమునకు యోగసాధకుడు అష్టాంగములను ఆచరించవలెను. పద్మాసనము, స్వస్తికము, భద్రాసనము, వజ్రాసనము, వీరాసనము అనునవి ఆసన పంచకమనబడును. వీనిలో ఏదో ఒక ఆసనములో కూర్చుండి కుడి ముక్కును మూసి ఎడమ ముక్కు రంధ్రము ద్వారా బయటి గాలిని 16 సెకండ్ల కాలము పీల్చవలెను. దీనిని పూరకము అందురు. తరువాత ఎడమ ముక్కును గూడ మూసి 64 సెకండ్ల కాలము గాలిని లోన బంధించవలెను. దీనిని కుంభక మందురు. ఇప్పుడు కుడి ముక్కును తెరచి 32 సెకండ్ల కాలము లోపలి గాలిని క్రమముగా బయటకు విడువవలెను. దీనిని రేచక మందురు ఒక పూరకము - కుంభకము - రేచకములను కలిపి ఒక ప్రాణాయామమందురు. ప్రాణాయామముల సంఖ్య క్రమముగా పెంచుకొనుచు పోవలెను.

ఈ ప్రాణాయామము జపధ్యానములతో కూడిన సగర్భ ప్రాణాయామ మనియు లేనిచో విగర్భ ప్రాణాయామమనియు అందురు ప్రాణాయామ సమయములో సాధకుని శరీరమునకు చెమట పుట్టిన అధమమనియు, శరీరమున వణుకు పుట్టిన మధ్యమమనియు, మేను పైకి లేచిన ఉత్తమమనియు ప్రాణాయామము మూడు విధములు. సాధకుడు ఉత్తమ ప్రాణాయామము సిద్ధించువరకు అభ్యసింపవలెను.

ఇంద్రియములు విషయములందు స్వేచ్ఛగా తిరుగుచుండును వానిని ప్రయత్నపూర్వకముగా లాగి నిలుపుటను ప్రత్యాహారమందురు అంగుష్టము, గుల్ఫము, పిక్కలు, తొడలు, మూలాధారములు, లింగము, నాభి, హృదయము, మెడ, కంఠము, లంబిక, ముక్కు, భ్రూమధ్యము, తల, మూర్ధము ద్వాదశాంతము అనునవి స్థానములు. వీనియందు ప్రాణవాయువును నిలుపుటే ధారణమనబడును. నిశ్చల మనస్సును చైతన్యాత్మలో నిలుపవలెను. తరువాత ఇష్టదేవతను ధ్యానించుటే

ధ్యానమనబడును నిత్యము జీవ-పరమాత్మల ఐక్యమును భావింపవలెను దీనినే సమాధి అందురు దీని నంతటిని అష్టాంగ యోగమందురు కుండలినీ యోగమును మంత్రయోగమందురు యోగము లేక మంత్రమును మంత్రము లేక యోగమును సిద్ధింపవు అని కొందరి అభిప్రాయము

కుండలినీ యోగము, అష్టాంగ యోగములను గూర్చి రేఖా మాత్రముగా చెప్పుకొన్నాము ఇంకా తెలుసుకొనగోరువారు ముక్తికోపనిషత్తు, శ్రీదేవీ భాగవతము, శాండిల్యోపనిషత్తు, యోగరత్నాకరము, యోగకుండల్యుపనిషత్తు, యోగ శిఖోపనిషత్తు, డాక్టరు ముక్కామల సోమ సుందరరావుగారి ఆత్మ బోధామృతము మొదలగు గ్రంథములను పరిశీలింప ప్రార్థన.

కుండలిని గూర్చి చివరగా ఒక విషయము. పరావిద్యాయైన శ్రీవిద్యయే కుండలినీ శక్తి అని అందురనియు, అదియే ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, పరాంబిక, త్రిపుర సుందరి అని అందురనియు చెప్పుదురు మానవ శరీరములో ఆరు ముఖ్యమైన నాడీ ముడులు సుషున్మ నాడి వెంబడి కలవు ఆ నాడీ ముడులనే చక్రములని, పద్మములని అందురు. అవియే మూలాధారాది చక్రములు వీనిని గూర్చి ఒక ప్రత్యేక విస్తృత, సంక్షిప్త సాధనా పద్ధతి గలదు. దానినే కుండలినీ యోగమందురు ఈ యోగ సాధన వలన స్తబ్ధముగా మూలాధారము దగ్గర ఉన్న కుండలినీ శక్తి ప్రకోపింపబడి సహస్రారమునకు చేరును దీనివలన సాధకునకు అనేక విధములైన శక్తులు, సిద్ధులు వచ్చునందురు. పరాకాష్ఠగా నిర్వికల్ప సమాధి లభించునందురు. అంటే జీవాత్మ పరమాత్మతో ఐక్యమగును ఇది విపులముగా శ్రీవిద్య రహస్య సాధనలో వర్ణింపబడినదని చెప్పుదురు.

సుషుమ్ననాడి వెంబడి 32 పద్మములు ఉన్నవని, సుషుమ్న నాడికి రెండు చివరల సహస్రార పద్మములున్నవని అంటారు. స్థూల, సూక్ష్మ ప్రపంచములకు ప్రతీక అయిన శ్రీచక్రమునకు మానవ దేహమునకు ఏ సంబంధము లేనప్పటికి - మానవ శరీరములోని 32 పద్మముల నుండి తొమ్మిది పద్మములను నవావరణలకు సమన్వయ పరుస్తారు. ఇది అంతా ప్రస్తుతము మన పుస్తకమునకు సంబంధించిన విషయము కాదు

మానవ శరీరములో కుండలినీ శక్తి నిజంగా ఉన్నదా అను ప్రశ్నకు శ్రీరామకృష్ణ పరమహంస యోగి శరీరములో పద్మములనెడివి నిజముగా ఉండవు, కాని అవి యోగశక్తిచే శరీరములో సృష్టించవచ్చునని చెప్పేవారని ప్రతీతి



# అనుబంధము - 12

# శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రము

ఈ స్తోత్రములో శ్రీచక్రములోని నవావరణములలోని దేవతలందరు వారి వారి నిర్దేశ స్థానములలో వస్తారు. మానసికముగా ఆయా దేవతల స్థానములను గుర్తించుచు ఈ స్తోత్రము చేసిన శ్రీచక్రార్చన చేసిన ఫలితము వచ్చునని అందురు. అందరికి అర్థమగునట్లు నవావరణములలో ఆయా దేవతల స్థానములను చూపుచు ఖడ్గమాలా స్తోత్రము క్రింద ఇవ్వబడినది. ఇది సాధకులకు ఉపయుక్తమైన నా ప్రయత్నము సఫలమైనట్లు భావించెదను.

ఇది శ్రీ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారు సంస్కరించిన శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రము ఇది బిందువు చుట్టూ ఉన్న ఊహా చతురస్రములోని షడంగ దేవతలతో ప్రారంభమగును. తరువాత నిత్యామండలము. ఇది బిందు త్రికోణముల మధ్యగా నుండు ఊహా త్రిభుజము. దీనిని గూర్చి పూర్తిగా పుస్తకములో చర్చించబడినది నిత్యామండల త్రిభుజ పరివృత్తముపై ప్రాదక్షిణముగా గురుమండలము ఉన్నది. భారతీయ సంప్రదాయ యతులే అందరికి గురు స్థానీయులు. వారికి మాత్రమే శ్రీవిద్యా మహాపాదుకాంత ఉపాసనల యందు అధికారము, ఉపదేశార్హత గలదు. వీరిని మాత్రమే శ్రీచక్రమందలి గురుమండలములో పూజించాలి. ముందుగా కారణ గురువైన దక్షిణామూర్తిని తరువాత నారాయణునితో ప్రారంభించి ప్రస్తుత పీఠాధిపతి వరకు పూజించి పిదప గురుత్రయమును అర్చించవలెను. తరువాత సంహార క్రమములో అనగా భూపురత్రయము నుండి బిందువు వరకు గల దేవతలు వచ్చెదరు. ఒక్కొక్క ఆవరణకు ఆ ఆవరణ చక్రము పేరు, యోగిని, చక్రేశ్వరి పేర్లు వచ్చును. ముందు ఆవరణ చక్రము పేరు, తరువాత యోగిని పేరు చెప్పి ఆవరణ దేవతలను, చివరకు చక్రేశ్వరిని చెప్పాలి.

పుట ఎడమ భాగములో ఖడ్గమాలా స్తోత్రము ఆ భాగమునకు సంబంధించిన ఆవరణ భాగపటము పుట కుడివైపున ఇవ్వబడినది.

## ఖడ్గమాలా స్తోత్రము :

ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః
నమస్త్రిపుర సుందరి

## షడంగ దేవతలు

బిందువు చుట్టూ ఒక చతురస్రము ఉన్నట్లు భావింపవలెను. షడంగ దేవతల స్థానములు చూపబడినవి




1) హృదయదేవి 2) శిరోదేవి
3) శిఖాదేవి 4) కవచదేవి
5) నేత్రదేవి 6) అస్త్రదేవి

## నిత్యా మండలము

బిందు త్రికోణముల మధ్యన స్వాభిముఖ ఊహా త్రిభుజమున్నది. అది నిత్యా మండలము మూడు భుజముల యందు వామావర్తముగా మూడు ఐదులుగా (15) నిత్యల స్థానము 16వది బిందువునందు

1) కామేశ్వరి 2) భగమాలిని
3) నిత్యక్లిన్నే 4) భేరుండే
5) వహ్నివాసిని

6) మహావజ్రేశ్వరి 7) శివదూతి
8) త్వరితే 9) కులసున్దరి
10) నిత్యే

11) నీలపతాకే 12) విజయే
13) సర్వమంగళే 14) జ్వాలామాలిని
15) విచిత్రే

16) శ్రీవిద్యే.



దక్షిణామూర్తిమయి, నారాయణమయి,
బ్రహ్మమయి, సనకమయి,
సనందనమయి, సనాతనమయి,
సనత్కుమారమయి, సనత్సుజాతమయి,.
వశిష్ఠమయి, శక్తిమయి, పరాశరమయి,
కృష్ణ ద్వైపాయనమయి, పైలమయి,
వైశంపాయనమయి, జైమినిమయి,
సుమంతుమయి, శ్రీశుకమయి,
గౌడపాదమయి, గోవిందమయి,
శ్రీవిద్యాశంకరమయి, పద్మపాదమయి,
హస్తామలకమయి, త్రోటకమయి,
సురేశ్వరమయి, విద్యారణ్యమయి,
బోధానందమయి, కల్యాణానంద మయి,
సదాశివానందమయి, నృసింహానంద
మయి, శ్రీ శివ కల్యాణానందమయి,
పరమేష్ఠి గురుశ్రీ . . ........మయి,
పరమ గురుశ్రీ .. . . మయి,
స్వగురుశ్రీ . . ........ . .. మయి

### గురు మండలము

శ్రీచక్రమందలి త్రికోణము లోపలగా బిందువు చుట్టూ నిత్యామండల ఊహా త్రిభుజమున్నది. ఆ త్రిభుజ పరివృత్తముపై చుట్టూ స్వాభిముఖంగా ప్రారంభమై ప్రాదక్షిణ్యక్రమంలో గురుమండలము ఉండును

I. **1వ భూపురము** :-
(క్రింది నుండి)

త్రైలోక్యమోహన చక్రస్వామిని।
ప్రకట యోగిని।

### భూపురత్రయము

భూపురత్రయము ఒకే ఆవరణ అందువలన ఒకే యోగిని, ఒకే చక్రేశ్వరి ఉండును.

**చక్రము :** త్రైలోక్యమోహన చక్రము.
**యోగిని :** ప్రకటయోగిని
**చక్రేశ్వరి :** త్రిపురే.

1) అణిమా సిద్ధే 2) లఘిమా సిద్ధే

3) మహిమా సిద్ధే 4) ఈశిత్వ సిద్ధే

5) వశిత్వ సిద్ధే 6) ప్రాకామ్య సిద్ధే

7) భుక్తి సిద్ధే 8) ఇచ్ఛా సిద్ధే

9) ప్రాప్తి సిద్ధే 10) సర్వకామ సిద్ధే




1వ భూపురము

2వ భూపురము

1) బ్రాహ్మి 2) మాహేశ్వరి

3) కౌమారి 4) వైష్ణవి

5) వారాహి 6) మాహేంద్రి

7) చాముండే 8) మహాలక్ష్మి




2వ భూపురము

మూడవ భూపురము :

1) సర్వసంక్షోభిణి 2) సర్వ విద్రావిణి

3) సర్వాకర్షిణి 4) సర్వ వంశంకరి

5) సర్వోన్మాదిని 6) సర్వ మహాంకుశే

7) సర్వఖేచరి 8) సర్వబీజే

9) సర్వయోనే 10) సర్వ త్రిఖండే

త్రిపురే।




3వ భూపురము

## II షోడశ దళము :

**సర్వాశా పరిపూరక చక్రస్వామిని :** గుప్తయోగిని

1) కామాకర్షిణీ 2) బుధ్యాకర్షిణీ
3) అహంకారాకర్షిణీ 4) శబ్దాకర్షిణీ
4) స్పర్శాకర్షిణీ 5) రూపాకర్షిణీ
6) రసాకర్షిణీ 7) గంధాకర్షిణీ
8) చిత్తాకర్షిణీ 9) ధైర్యాకర్షిణీ
10) స్మృత్యాకర్షిణీ 11) నామాకర్షిణీ
12) బీజాకర్షిణీ 13) ఆత్మాకర్షిణీ
14) అమృతాకర్షిణీ 15) శరీరాకర్షిణీ

త్రిపురేశి।

చక్రము పేరు : సర్వాశాపరిపూరక చక్రము
యోగిని : గుప్తయోగిని,
చక్రేశ్వరి : త్రిపురేశి, (పశ్చిమాదివిలోమేన)




షోడశ దళము

## III. అష్టదళము :

సర్వ సంక్షోభణ-చక్రస్వామిని
గుప్తతర యోగిని

**దిక్కులు :**

1) అనంగకుసుమే
2) అనంగ మేఖలే
3) అనంగ మదనే
4) అనంగ మదనాతురే

అష్ట దళములో ముందు దిక్కులలో తరువాత మూలలలో దేవతాస్థానములు.
(సవ్యముగా)

**చక్రము పేరు :** సర్వసంక్షోభణ చక్రము.

**యోగిని :** గుప్తతరయోగిని.

**చక్రేశ్వరి :** త్రిపురసుందరి.
(పూర్వాది దిక్షు ఆగ్నేయాది విదిక్షుచ)

ముద్రలు :

5) అనంగ రేఖే

6) అనంగవేగిని

7) అనంగాంకుశే

8) అనంగమాలిని

త్రిపురసుందరి




అష్ట దళము

## IV. చతుర్దశారము :

సర్వసౌభాగ్యదాయక

చక్ర స్వామిని। సంప్రదాయ యోగిని।

**చక్రము పేరు :** సర్వసౌభాగ్యదాయ చక్రము

**యోగిని :** సంప్రదాయ యోగిని

**చక్రేశ్వరి :** త్రిపురవాసిని. (ముందు నుండి అపసవ్యముగా (పశ్చిమాది విలోమేన))

1) సర్వ సంక్షోభిణి
2) సర్వ విద్రావిణి
3) సర్వాకర్షిణి
4) సర్వాహ్లాదిని
5) సర్వ సంమోహిని
6) సర్వ స్తంభిని
7) సర్వ జృంభిణి
8) సర్వ వశంకరి
9) సర్వ రంజని
10) సర్వోన్మాదిని
11) సర్వార్థ సాధని
12) సర్వ సంపత్తి పూరణి
13) సర్వ ద్వంద్వక్షయంకరి

త్రిపురవాసిని।




చతుర్దశారము

## V. బహిర్దశారము :

సర్వార్థ సాధక చక్రస్వామిని ।
కులయోగిని ।

1) సర్వ సిద్ధిప్రదే
2) సర్వ సంపత్ప్రదే
3) సర్వ ప్రియంకరి
4) సర్వ మంగళ కారిణి
5) సర్వ కామప్రదే
6) సర్వ దుఃఖ విమోచని
7) సర్వ మృత్యుప్రశమని
8) సర్వ విఘ్న నివారిణి
9) సర్వాంగ సుందరి
10) సర్వ సౌభాగ్యదాయిని

త్రిపురాశ్రీః ।

**చక్రము పేరు** సర్వార్థసాధక చక్రము.
**యోగిని :** కుల యోగిని
**చక్రేశ్వరి :** త్రిపురాశ్రీః
(ముందు నుండి అపసవ్యముగా)
(పశ్చిమాది విలోమేన)




**బహిర్దశారము**

## VI. అంతర్ద శారము :

సర్వ రక్షాకర చక్రస్వామిని ।
నిగర్భ యోగిని ।

1) సర్వజ్ఞే
2) సర్వశక్తే
3) సర్వైశ్వర్య ప్రదాయిని
4) సర్వజ్ఞానమయి

**చక్రము పేరు** సర్వరక్షాకర చక్రము
**యోగిని :** నిగర్భ యోగిని.
**చక్రేశ్వరి :** త్రిపురమాలిని.
(ముందు నుండి అపసవ్యముగా)
(పశ్చిమాది విలోమేన)

5) సర్వవ్యాధి వినాశిని
6) సర్వాధార స్వరూపే
7) సర్వ పాపహరే
8) సర్వానందమయి
9) సర్వరక్షా స్వరూపిణి
10) సర్వేప్సితార్థప్రదే
త్రిపురమాలిని ।



అంతర్దశారము

**VII. అష్టకోణము :**

సర్వరోగహర చక్రస్వామిని ।
రహస్య యోగిని ।
1) వశిని
2) కామేశ్వరి
3) మోదిని
4) విమలే
5) అరుణే
6) జయిని
7) సర్వేశ్వరి
8) కౌళిని
త్రిపురాసిద్ధే ।

**చక్రము పేరు :** సర్వరోగహర చక్రము
**యోగిని :** రహస్య యోగిని
**చక్రేశ్వరి :** త్రిపురా సిద్ధే.
(ముందు నుండి అపసవ్యముగా)
(పద్ధమాది విలోమేన)



అష్టకోణము

## VIII. త్రికోణము

సర్వ సిద్ధిప్రద చక్రస్వామిని।
అతిరహస్య యోగిని।

చక్రము పేరు : సర్వసిద్ధిప్రద చక్రము.
యోగిని : అతి రహస్య యోగిని.
చక్రేశ్వరి : త్రిపురాంబికే
(మహాత్రికోణే బాహ్యతః పశ్చిమాది దిక్షు క్రమేణ)
(ముందు నుండి సవ్యముగా దిక్కులందు ఆయుధ దేవతలు.)

1) బాణిని
2) చాపిని
3) పాశిని
4) అంకుశిని




1) మహాకామేశ్వరి (అగ్రకోణే)
2) మహా వజ్రేశ్వరి (దక్షిణకోణే)
3) మహా భగమాలిని (ఉత్తరకోణే)
త్రిపురాంబికే।

## IX. బిందువు

సర్వానందమయ చక్రస్వామిని।
పరాపర రహస్యయోగిని।

చక్రము పేరు : సర్వానంద మయ చక్రము.
యోగిని : పరాపర యోగిని.
చక్రేశ్వరి : మహామహా కామేశ్వరి.

మహామహా కామేశ్వరి
మహాశ్రీ చక్ర నగర సామ్రాజ్ఞి
మహారాజ రాజేశ్వరి
ప్రతాప భారతి
పరబ్రహ్మ స్వరూపిణి
నమస్తే। నమస్తే। నమస్తే। నమః।
సౌం క్లీం ఐం శ్రీం హ్రీం ఐం ॥



★★★

# అనుబంధము - 13

# శ్రీకలా యంత్రము-పరదేవత స్థూలరూపము

శ్రీ లలితా రహస్యనామ స్తోత్రములోని మొట్టమొదటి తొమ్మిది నామములు సర్వ వేదాంత రహస్యసారమును ఉపదేశించుచున్నదని శ్రీ జగద్గురు శ్రీశ్రీ కల్యాణానంద భారతి స్వామివారు తమ శ్రీకలలో చెప్పిరి. అటులనే ఉద్యద్భాను సహస్రాభా యను నామము మొదలుకొని 'కురువింద మణిశ్రేణి కనత్కోటీర మండితా' అను నామము వరకు గల తొమ్మిది నామములు శ్రీ మత్సింహాసనా అని ఉపదేశింపబడిన శ్రీకలా చక్రము యొక్క భావనా విశేషము సృష్టిక్రమముచే ఉపదేశింపబడుచున్నదని గూడ స్వామివారు సెలవిచ్చినారు. ఈ తొమ్మిది నామములు పరదేవత యొక్క సూక్ష్మరూపమును రహస్యముగాను, మందబుద్ధుల కొరకు 'కరచరణాది అవయవయుక్త' స్థూలరూపమును తెల్పుచున్నది. ఇక్కడ 9-18 నామములే కాక ఇతర నామములు చెప్పు పరదేవత అవయవములు గూడ ఇవ్వబడినవి.

**పరదేవత స్థూలరూపము :-**

## శ్రీకలా యంత్రము




పరమేశ్వరికి నాలుగు చేతులుండును ఇందు రెండు ఊర్ధ్వబాహువులు, రెండు అధో బాహువులు. పరమేశ్వరి చతుర్బాహువులు చతుర్విధ పురుషార్థములను ప్రసాదించునవిగా తలంప వచ్చును.

**పరమేశ్వరి సూక్ష్మరూపము :-** శ్రీవిద్యా పంచ దశాక్షరి అందలి కాదిహాది విద్యాద్వయ సమ్మేళనమునునగు చతుష్కూటమును ఈ చతుర్బాహువులుగా భావింపవచ్చును.

**514976**చే సూచితమైన అగ్రవృత్తము - **II** పరమేశ్వరి ముఖమును సూచించును.

శ్రీకలా యంత్రములోని **948**లచే సూచితమగు త్రికోణభాగము దక్షిణోర్ధ్వ బాహువును, **917** సంఖ్యలచే సూచిత త్రికోణ భాగము వామోర్ధ్వ బాహువును, **926** సంఖ్యలచే సూచితమగు త్రికోణ భాగము వామోధ బాహువును, **935** సంఖ్యలచే సూచితమైన త్రికోణభాగము దక్షాధో బాహువును సూచించును.

శ్రీదేవి నాలుగు చేతులందును పాశము, అంకుశము, ఇక్షుదండము, పుష్ప బాణములు అను ఆయుధములు ఉండును. ఈ ఆయుధములు భావనాభేదముచే అస్త్రములందు మార్పులు చెందుచుండును

226 త్రికోణభాగము వామకరమందలి రాగ స్వరూపపాశమును,' 335చే సూచింపబడిన త్రికోణ స్థానము అంకుశమును, 167చే సూచితమైన త్రికోణ భాగము ఇక్షుదండమును, 418చే సూచిత త్రికోణ భాగము పంచతన్మాత్రలను సూచించును

98 సంఖ్యలు దక్షిణ నేత్రమును, 91 వామనేత్రమును సూచించును. 418 దక్షిణ కర్ణ స్థానమును, 716 వామ కర్ణస్థానమును సూచించును

593 ల మధ్యతలము దక్షోరువును, 692ల మధ్యతలము వామోరువును సూచించును. 533చే సూచింపబడు త్రికోణభాగము దక్షిణ జానువును, 622లచే సూచితమైన త్రికోణ భాగము వామజానువును సూచించును

పరమేశ్వరికి కారణరూపమగు శ్రీకలాయంత్రమందు 7,8, 5, 4 సంఖ్యలచే సూచితమగు బహిర్వృత్తము (VII) సదాశివ మండలమును సూచించును. ఈ సంఖ్యా సమాహారము (7+8+5+4=24) ఇరువది నాలుగు అగును ఇవి గాయత్రి మంత్ర వర్ణములుగా చెప్పనగును. సదాశివ వృత్తదేవతయు, గాయత్రీ ప్రతిపాదిత దేవతయు ఒకరే. అందువలననే శ్రీకలా చక్రమునకు గాయత్రీ చక్రమనియు, సదాశివ చక్రమనియు సంకేత విశేషము

శ్రీకలా యంత్రమున 81726354 సంఖ్యలచే సూచితమైన అంతర్వృత్తము (I)ను సూర్యమండలమనియు, 1623 సంఖ్యలచే సూచితమైన మధ్యవృత్తము (VI)ను, బ్రహ్మాండ మండలమనియు, 5478 సంఖ్యలచే సూచితమైన బహిర్వృత్తము (VII)ను సదాశివ మండలమనియు అందురు. సకల జగదాధార భూతమగు తత్త్వమును ఈ వృత్తత్రయము స్ఫురణకు తెచ్చును. అంతేకాదు శ్రీదేవి యొక్క కిరీటము సువర్లోకమును అంటియున్నదనియును, పాదములు భూమియందు యున్నవనియును, చతుర్బాహులతో కూడిన ఆత్మయనెడి మధ్య ప్రదేశము భువర్లోకముతో సంబంధించియున్నదనియును తెలియును. కావున శ్రీదేవి యొక్క స్థూల శరీరము భూర్భువ సువర్లోకములు మూడింటియందును నిండియున్నదను రహస్యమును గూడ ఉపదేశింపబడుచున్నది.



# అనుబంధము - 14

## శక్తి

మనకు విజ్ఞాన శాస్త్రము శక్తి నిత్యత్వ సిద్ధాంతమును చెప్పేది ఈ విశ్వములోని శక్తి పరిమాణము స్థిరముగా నుండును; ఒక రూపములోని శక్తిని మరియొక రూపములోనికి మార్చగలము. కాని కొత్త శక్తిని సృష్టించలేము; ఉన్న శక్తిని నశింపచేయలేము. ఇదే శక్తి నిత్యత్వ సిద్ధాంతము. ఇది తప్పని తేలినది. పదార్థమును శక్తిగా మార్చవచ్చుని, శక్తిని పదార్థముగా మార్చవచ్చుని నిరూపింపబడినది. రెండవ ప్రపంచ యుద్ధములో నాగసాకి, హిరోషిమాల మీద వేసిన పరమాణు బాంబులలోని పదార్థములో 0.1% మాత్రమే శక్తిగా మారినది. ఈ కొంచెము పదార్థము శక్తిగా మారి ఊహించడానికి వీలులేనంత విధ్వంసము సృష్టించినది. మనము 2 గ్రాముల పదార్థమును శక్తిగా మార్చిన అది ఆంధ్ర ప్రదేశ్‌కు 10 సంవత్సరములకు సరిపడే శక్తి ఉత్పత్తి అగునని శాస్త్రజ్ఞులు అంటారు

మనము బ్రహ్మమును అనేక విశేషణములతో స్తబ్ధ పదార్థమని చెబుతాము అది శివశక్తి (ద్రవ్యశక్తి) నిద్రాణంగా ఉన్న భాగము అది శక్తిగా అవతరించినపుడే విశ్వ నిర్మాణము చేయగలదని పెద్దలంటారు. అది శివాశక్తి. పైన సూక్ష్మముగా చెప్పిన విజ్ఞాన శాస్త్ర విషయానికి ఇక్కడ చెప్పిన వేదాంత విషయానికి పోలిక కనబడుచున్నది. అంటే, శ్రీచక్రము మొదలగు విషయములు పరోక్షముగా విజ్ఞాన శాస్త్రమునే తెల్పుచున్నవని తోచుచున్నది



# BIBLIOGRAPHY


| | | | |
|---|---|---|---|
| 1 | బ్రహ్మకలా | శ్రీ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామి | |
| 2 | శ్రీయాగము | " | " |
| 3 | బ్రహ్మ విద్యా వైభవము | " | " |
| 4 | శ్రీ గుణనికా దీధితిః | Part - I & II | " |
| 5. | కేనోపనిషత్ | " | " |
| 6 | శ్రీ మద్భగవద్గీతా రహస్యమ్ | " | " |
| 7 | శ్రీ మద్భగవద్గీతా | " | " |
| 8 | శ్రీకల | " | " |
| 9 | శ్రీవిద్యోదంతము | " | " |
| 10 | పూర్ణ మీమాంసా దర్శనమ్ | " | " |
| 11 | తంత్ర జ్యోత్స్నా | " | " |
| 12 | శ్రీకలాదర్శనమ్ | " | " |
| 13. | అక్షర దర్శనమ్ | " | " |
| 14. | వేదాన్త మీమాంసా శాస్త్ర హృదయము | " | " |
| 15. | కౌళావళీ నిర్ణయ ప్రభంజనము | " | " |
| 16. | శ్రీ లలితా రహస్యనామ స్తోత్ర ప్రబంధము | శ్రీ జగద్గురు శ్రీ నృసింహానంద భారతీస్వామి | |
| 17. | శ్రీకామ సంజీవనము | శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి | |
| 18 | అక్షర సమామ్నాయము | శ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రి | |
| 19. | గూడార్థ దీపిక | శ్రీ రాచకొండ వెంకటేశ్వర రావు | |

| | | |
|---|---|---|
| 20. | శ్రీచక్ర దర్శనము | శ్రీ వడ్లమూడి వేంకటేశ్వర రావు |
| 21. | సుభగోదయ స్తుతిః | శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి (ఆంధ్ర వివరణ) |
| 22. | పురుషసూక్తము | శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య |
| 23. | కృష్ణ లహరి | డాక్టరు ధారా రామనాధ శాస్త్రి |
| 24. | దశోపనిషత్తులు | |
| 25. | కామకలావిలాసము | శ్రీ పుణ్యానంద మునీంద్ర (వ్యాఖ్యానకర్త శ్రీ సింహభట్ల రామమూర్తి శాస్త్రి) |
| 26. | సౌందర్య లహరి | శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు |
| 27. | శ్రీచక్ర విలసనము | ,, ,, |
| 28. | భారతీ వ్యాఖ్య | శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు |
| 29 | A Treatise on Srichakra | స్వామి ప్రణవానంద |
| 30 | శ్రీదేవీ భాగవతము | శ్రీ నోరి నరసింహశాస్త్రి |
| 31 | సారస్వత వ్యాసములు | ,, ,, |
| 32 | శ్రీదేవీ భాగవతము | శ్రీ ములుగు పాపయ |
| 33. | శ్రీదేవీ భాగవతము | సంస్కృతము |
| 34. | సోஉహమ్-సమాధి | శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మ |
| 35 | ఆత్మబోధామృతము | డా॥ ముక్కామల సోమసుందరరావు |
| 36 | శ్రీదత్త భాగవతాద్వైతము | డా॥ నోరి భోగీశ్వర శర్మ |
| 37 | ఆమ్నాయ మందారః | శ్రీ పోతుకూచి శ్రీరామమూర్తి |
| 38 | యోగాభ్యాస దర్పణము | శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వామి |




# కృతజ్ఞతలు

''విశిష్ట శ్రీచక్రము'' అనే పుస్తకము వ్రాయుటకు, నా ఎన్నో జన్మల సుకృతము వలన ''అమ్మ'' యొక్క కించిత్ కరుణారసము నామీద ప్రసరించి ఉంటుందని నా దృఢ విశ్వాసము. నన్ను పిన్న వయస్సులోనే శ్రీవిద్యలో ప్రవేశపెట్టిన మా అమ్మ హనుమాయమ్మ, నాన్నగారు నోరి నరసింహశాస్త్రి గారలకు, మంత్రోపదేశము చేసి శిష్యునిగా స్వీకరించిన శ్రీజగద్గురు శ్రీకల్యాణానంద భారతీస్వామి వారికి నేను సర్వదా దాసుడను. శ్రీచక్ర భూప్రస్తారమును రంగులతో కాగితము మీద వేసి ప్రేమాభిమానములతో నాకు ప్రసాదించిన శ్రీశ్రీ రామానంద భారతీస్వామి వారికి నేను సర్వదా కృతజ్ఞుడను. పాదుకాంతదీక్షను ప్రసాదించిన శ్రీజగద్గురు శ్రీ నృసింహానంద భారతీ మహాస్వామి వారికి పాదాభివందనములు. వీరంతా నాకు శ్రీవిద్యా వాతావరణమును సృష్టించి దానిలో నేను పెరిగేటట్లు చేసినవారు.

ఇక ఈ పుస్తకమును కూర్చుటకు నన్ను ప్రోత్సహించినవారు (1) శ్రీమతి వారణాశి మహాలక్ష్మీ సుబ్బారావు (2) నా భార్య చి. సౌ. సరోజిని (శిష్ట్లా వేంకట కృష్ణయ్య అన్నపూర్ణా విశాలాక్షమ్మ గార్ల చతుర్థ పుత్రిక) నాగర లిపిలోని విషయములను తెలుగు లిపిలో వ్రాసి వాటికి అర్థము చెప్పి ఎంతో సహాయసహకారములను అందించినది. (3) మా తమ్ముడు చి. సుబ్రహ్మణ్య శాస్త్రి మొదటిసారిగా శ్రీచక్రార్చన నాచేత చేయించి శ్రీచక్ర రూపమును నాకు అవగతమయేటట్లు చేశాడు. (4) ఈ పుస్తకము ముద్రణకు ఆర్థిక సహాయము చేసిన దాతలు, వారి పేర్లు చెప్పుటకు ముందు మహర్షులు చెప్పిన ఒక విషయమును చెప్పుకొందాము.

తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయం
ఆరామకృతి సత్రాణి సప్తసంతాన సంజ్ఞికాః ॥

